# కార్గిల్ యుద్ధం - కాశ్మీర్ సమస్య


రచన : ప్రవీణ్ స్వామి

తెలుగుసేత : సి.యస్.రాశ్



ప్రచురణ :

ప్రజాశక్తి బుక్‌హౌస్

1-1-298/4, స్ట్రీట్ నెం.1,

అశోక్‌నగర్, హైదరాబాద్ - 20, ఫోన్ : 766542(

ప్రచురణ నెం 590

ప్రచురణ కాలం మే 2000

ప్రతులు 1 100

వెల 40-00

English TITLE "The Kargil War

Publisher Leftword Books New Delhi 1999

Author Praveen Swamy

ముద్రణ ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్ హైదరాబాద్

ప్రతులకు:

ప్రజాశక్తి బుక్‌హౌస్

| | | |
|---|---|---|
| కారల్‌మార్క్స్ రోడ్డు<br>విజయవాడ - 520 002<br>ఫోన్ 432792 | 1-8-52/2<br>శ్రీరామాకాంప్లెక్స్ చిక్కడపల్లి<br>హైదరాబాద్-20<br>ఫోన్ 7608107 | షాప్ నెం 13<br>పోలీస్ షాపింగ్ కాంప్లెక్స్<br>కె జి హెచ్ డౌన్<br>విశాఖపట్నం-2 |

| | | | |
|---|---|---|---|
| సుందరయ్య భవన్<br>బాలాజీనగర్<br>ఖమ్మం - 507 001 | 5 ఎ జి కె కాంప్లెక్స్<br>గాంధీరోడ్డు<br>తిరుపతి - 517 501 | 6-2-250<br>విజయటాకీస్ రోడ్డు చౌరస్తా<br>హన్మకొండ - 506 011 | సుందరయ్య భవన్<br>సుభాష్ విగ్రహం (ఎదుట)<br>నల్గొండ |

# కృతజ్ఞతలు

ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుందని తెలిసి కూడా సైన్యంలోను, ప్రభుత్వ విభాగాలలోను పని చేస్తూ కొన్ని విలువలకు కట్టుబడిన అధికారులు కార్గిల్ యుద్ధం ప్రజ్వలనానికి కారణాలు, అది జరిగిన తీరు గురించి సమాచారాన్ని అందించి వుండకపోతే ఈ పుస్తకం రాయడం సాధ్యపడేది కాదు. 1999 వేసవిలో కార్గిల్ కొండలలో వాస్తవంగా జరిగినదేమిటో ప్రజలకు తెలిసేలా చేసేందుకు వారు చూపిన నిబద్ధతే, నైరాశ్యపు కారుమబ్బులు కమ్మిన కార్గిల్ యుద్ధంలో వెలుగు రేఖ.

పాత్రికేయులకు వృత్తిపరమైన సహకారం, అంతులేని తోడ్పాటునందించిన ఎన్ రామ్ గారికి, ఫ్రంట్‌లైన్ పత్రికకు, అలాగే రేయింబగళ్ళు శ్రమించి నా రాత ప్రతిని ఒక కొలిక్కితెచ్చిన సుధన్వ దేష్‌పాండేకు నా ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ పుస్తకంలోని కొన్ని భాగాల తొలి (చిత్తు) ప్రతులపై అమూల్యమైన అభిప్రాయాలు తెలిపిన అజయ్‌సాహ్ని గారికి రుణపడి వున్నాను. తప్పులేవైన వుంటే అవి కేవలం నావే.

చివరగా ఈ ప్రయత్నంలో నేను కృతకృత్యుడిని కావడానికి ఆప్యాయతతో సహకరించిన మణికి, నా తల్లిదండ్రులకు కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

# విషయసూచిక


| | | పేజ నెం |
|---|---|---|
| 1 | ముందుమాట | 1 |
| 2 | కార్గిల్ శిఖరాల కొరకు జరిగిన పోరు | 9 |
| 3 | రణరంగానికి ఆవల యుద్ధం   పడక కుర్చీ పటాలం | 22 |
| 4 | పోఖ్రాన్ నుంచి కార్గిల్ వరకు బస్సులో | 42 |
| 5 | కార్గిల్ యుద్ధం కాశ్మీర్ రాజకీయాలు | 55 |
| 6 | జమ్ము కాశ్మీర్‌లో మతతత్వ వ్యాప్తి | 67 |
| 7 | కాశ్మీర్‌లో క్రియాశీల విధానం | 80 |
| 8 | కప్పి పుచ్చే ప్రయత్నమే | 99 |
| 9 | కార్గిల్ వారసత్వం | 110 |

# ముందుమాట

## జమ్మూ-కాశ్మీర్ సంఘర్షణ

అణుశక్తి నింపుకున్న కాలచక్రం గుండె చప్పుడు అంతకంతకూ పెరుగుతూనే వుంటుంది

**ఇజాజ్ అహ్మద్**

ఎత్తైన పర్వత శ్రేణుల మధ్య వున్న కార్గిల్ రణరంగం దాదాపు 500 మంది సైనికుల్ని పొట్టన పెట్టుకుంది 1999 వేసవిలో జరిగిన ఆ సంఘటల్ని వివరిస్తుందీ పుస్తకం 1500 చ కి మీ భారత భూభాగాన్ని పాకిస్తాన్ ఆక్రమించుకోవడానికి వీలు కల్పించిన రాజకీయ సైనిక వైఫల్యాల్ని ఎకరువు పెడుతుంది జమ్మూ-కాశ్మీర్‌లో రెండు అణ్వస్త్ర దేశాల మధ్య పాత పద్ధతుల్లోనే పోరు కొనసాగే అవకాశాలు ఎమిటనేది చర్చిస్తుంది ఎ క్షణాన ముక్కలవుతుందోతెలీని రాజకీయ కూటమి ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో తప్పటడుగులు పసలేక దినదినగండంగా గడుపుతూ మనుగడ కోసం వెంపర్లాడుతున్న ప్రభుత్వం పోఖ్రాన్‌లో రెండవసారి అణు పరీక్షలు జరిపించింది ఈ కవ్వింపు చర్యే కార్గిల్లో యుద్ధానికి కాలు దువ్విందనేది నా వాదన

జమ్మూ-కాశ్మీర్‌లో తరచు రక్తం వరదలైపారుతూ దీర్ఘకాలంగా తక్కువ స్థాయిలో కొనసాగుతున్న సంఘర్షణే కార్గిల్ యుద్ధానికి నేపథ్యం ఈ పుస్తకం ప్రస్తావించే ప్రధాన అంశాలలో ఒకటి భద్రతా వ్యవస్థ వైఫల్యం- అందుకు కారణమైతే రెండవది జమ్మూ-కాశ్మీర్‌లో సంఘర్షణ 1988 నుంచి ఇప్పటి వరకు ఈ సంఘర్షణ ఫలితంగా 9 వేల మంది పౌరులు భద్రతా దళాలలో వివిధ విభాగాలకు చెందిన రెండు వేల మంది పది వేలకుపైగా తీవ్రవాదులు తిరుగుబాటుదారులు ప్రాణాలు కోల్పోయారు ఐనా పంచతారా హోటళ్ళలోను ప్రముఖుల ప్రాంగణాల్లోనూ విందులూ వినోదాలు లేవంటే అందుకు కారణం విజయం మాదేనని చెప్పుకోలేకపోవడమే కార్గిల్ చిచ్చు చల్లారినా ఈ సంఘర్షణ ఆగకపోగా మరింత తీవ్రమయ్యే సూచనలు వున్నాయి కాని భారతదేశంలో ఈ వాస్తవాన్ని అంగీకరించేందుకు ఎవరూ సిద్ధంగా లేరు ఒకపక్క రాజకీయంగా ఆర్థికంగా సాంస్కృతికంగా మరోపక్క సైనిక చొరవతో ఈ సమస్యని పరిష్కరించలేకపోతే, మత విద్వేషాగ్నితో ప్రజ్వరిల్లే హింసవల్ల జమ్మూ-కాశ్మీర్ ఛిన్నాభిన్నమవుతుంది

**కాశ్మీర్ సమస్య** భారత్‌లో విలీనమైన రాష్ట్రాల్లో ముస్లిం జనాభా అధికంగా వున్న

ఏకైక రాష్ట్రం జమ్మూ–కాశ్మీర్ భారత్ పాకిస్తాన్‌ల మధ్య ఈ ప్రాంతం గురించి ఘర్షణకి ఇదే మూలకారణం గత్యంతరం లేని పరిస్థితుల్లో భౌగోళిక కారణాల వల్ల హైదరాబాదు సంస్థానం భారత్‌లోను ఖైర్‌పూర్ పాకిస్తాన్‌లోను విలీనమయ్యాయి కాని జమ్మూ-కాశ్మీర్ విషయంలో విచిత్రమైన సమస్యలెన్నో తలెత్తాయి ముస్లిం జనాభా ఎక్కువ వున్న జమ్మూ–కాశ్మీర్ హిందూ మహారాజా ఏలుబడిలో వుంది ఆపైన అటు పాకిస్తాన్ ఇటు భారత సరిహద్దులనానుకొని వుంది పాకిస్తాన్‌లో స్వాతంత్ర్యోద్యమం రూపుదిద్దుకున్న సరళిలో మతపరమైన కారణాల వల్ల కాశ్మీర్ కోసం అడగడం పాకిస్తాన్‌కు ఆవశ్యకమైంది భారత జాతీయోద్యమానికి సంబంధించినంత వరకు ఆ రాష్ట్రం వారి లౌకిక వాద సిద్ధాంతాలకు ప్రతీకగా నిలిచింది కాని కాశ్మీర్ మహారాజు హరిసింగ్ మాత్రం ఈ రెండు కొత్త దేశాలలో కలిసిపోవాలనే ఒత్తిడికి లొంగక స్వాతంత్ర్యాన్నే కోరుకున్నాడు

అన్నిటికన్న ముఖ్యంగా పేర్కొనవలసినది జనాకర్షణల షేక్ మహమ్మద్ అబ్దుల్లా నేతృత్వంలో డోగ్రా(వంశ) పాలనకు వ్యతిరేకంగా సాగిన ప్రజోద్యమం దీనికి రాజకీయ రూపమైన జమ్మూ–కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్స్ లౌకిక భారత దేశంలోనే తమకు భవిష్యత్తువుందని విశ్వసించింది నేషనల్ కాన్ఫరెన్సు అజెండాలోని భూ సంస్కరణలు, లౌకికవాదం సామాజిక న్యాయాలకు పాకిస్తాన్‌లో ఏ మాత్రం చోటు లేదన్న సంగతి షేక్ అబ్దుల్లా స్పష్టంగా గ్రహించారు

ఎటూ తేల్చుకోలేని హరిసింగ్ ఊగిసలాట ధోరణిని బలప్రయోగంతో సమస్య పరిష్కరించుకునేందుకు తగిన అవకాశంగా పాకిస్తాన్ భావించింది మఫ్టీలో వున్న సైనికులు పటాలానికి చెందని పఠాన్ తెగల సైనికుల దళాలని జమ్మూ–కాశ్మీర్‌లోకి పంపించింది ఈ చొరబాటుకు సూత్రధారులు పాకిస్తాన్ ప్రధాని లియాకత్ ఆలీ ఖాన్ మేజర్ జనరల్ అక్బర్ ఖానులేనని దీనికి మహమ్మద్ ఆలీ జిన్నా ఆమోదం వుందని దీనిని గురించి భారత్‌లో ప్రచారంలో వున్న పలు కథనాలు విశ్వసించాయి 1941 అక్టోబర్ 22న ముందుకొస్తున్న పాకిస్తాన్ దళాలు ముజఫరా బాదుని స్వాధీనం చేసుకొన్నాయి అటువైపు పాక్ ఆక్రమిత కాశ్మీర్(పివోకె) వుంది

ఈ ఆక్రమణతో హరిసింగ్‌కు ఎదో ఒకటి చేయక తప్పలేదు పాటియాల మహారాజు నుంచి అరువుతెచ్చుకున్న దళాలతో పాక్ దళాలని నిలవరించడం విఫలమయ్యాక హరిసింగ్ వైస్రాయి మౌంట్ బాటన్ సహాయం అర్థించాడు ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ హోం మంత్రి వల్లభాయ్ పటేల్‌లతో సంప్రదింపులు జరిపిన మౌంట్‌బాటన్ 'భారత స్వాతంత్ర్యం చట్టం' కింద తనకు సంక్రమించిన అధికారంతో భారత సైనికులను కాశ్మీర్‌లో దింపాలంటే, ముందు భారత్‌లో విలీనానికి హరిసింగ్

అంగీకరించాల్సి వుంటుందని నిర్ణయించాడు కాని అందులో ఆయన ఆ విలీనాన్ని కాశ్మీర్ ప్రజలు ఆమోదించాలనే ముఖ్యమైన షరతు చొప్పించాడు దురదృష్టకర పరిణామాలకు దారితీసిన ఈ షరతుకు నెహ్రూ అంగీకరించారు అక్టోబరు 25న వి పి మీనన్ విలీన ఒప్పందంపై హరిసింగ్ సంతకం కోసం శ్రీనగర్‌కు విమానంలో ప్రయాణమై వెళ్ళారు రెండు రోజుల అనంతరం మౌంట్ బాటన్ ఆ పత్రంపై ఆమోదముద్ర వేశారు

పాకిస్తాన్ దళాలు శ్రీనగర్ ముంగిట్లోకి ప్రవేశిస్తున్న తరుణంలో భారత పారాట్రూపర్లు శ్రీనగర్‌లో దిగి వారిని వెనుకకు పారద్రోలారు అలా ప్రారంభమైన పోరు 1941 నవంబరు నాటికి పూర్తిస్థాయి యుద్ధంగా పరిణమించి డిసెంబరు దాకా కొనసాగింది అప్పటికే వివాదాస్పద భూభాగంలో మూడొంతులు పాకిస్తాన్ ఆక్రమణలో వుంది ఈ సమయంలో మౌంట్‌బాటన్ సూచనపై కేంద్రమంత్రి వర్గం ఈ వివాదాన్ని ఐక్యరాజ్య సమితిలోని భద్రతా మండలికి నివేదించింది ఈ చర్యకు వల్లభాయ్ పటేల్ తీవ్ర అభ్యంతరం తెలిపినట్లు కొన్ని కథనాలు తెలుపుతున్నాయి సుదీర్ఘంగా సాగిన సంప్రదింపుల అనంతరం 1948 జనవరిలో ఇరు పక్షాలను కాల్పుల విరమణకు ఆమోదింపచేసారు ఆ ఎడాది ఆగస్టు 15న భద్రతా మండలి ఆమోదించిన ఒక తీర్మానం భారత్–పాకిస్తాన్‌ల మధ్య సంబంధాలను 50 ఏళ్ల పాటు ప్రభావితం చేసింది

భారత్–పాకిస్తాన్లు గౌరవించడానికి అంగీకరించిన ఆ తీర్మానంలో మూడు భాగాలున్నాయి మొదటిది కాల్పుల విరమణ చేయాలని పిలుపునిచ్చింది రెండవది పాకిస్తాన్ ప్రభుత్వం తమ దళాలను ఉపసంహరించుకోవాలి యుద్ధంకోసం సమీకరించి తెచ్చిన గిరిజన గిరిజనేతర దళాల ఉపసంహరణకు పాకిస్తాన్ శాయశక్తులా ప్రయత్నించాలి ఈ తీర్మానంలోని రెండవ భాగంలోని 'సెక్షన్ బి భారత–పాకిస్తాన్‌లకు సంబంధించిన ఐ రా స కమిషన్ (UNCIP) పాకిస్తాన్ దళాలు గిరిజన తెగల ఉపసంహరణ పూర్తయిందని ధృవీకరించాక శాంతి భద్రతల నిర్వహణకు అవసరమైన కనీస వసతులు తప్ప మిగిలిన దళాలను భారతదేశం ఉపసంహరించుకుంటుందని పేర్కొంది తీర్మానంలోని మూడవ భాగం జమ్మూ–కాశ్మీర్ భవితవ్యం ప్రజల అభీష్టం మేరకు నిర్ణయించబడుతుందని తెలుపుతోంది

పోతే జమ్మూకాశ్మీర్‌పై జరిగిన చర్చలన్నీ–ప్రజాభిప్రాయ సేకరణ(ప్లెబిసైటు)కు నెహ్రూ ఒప్పుకోకపోతే ఏమి జరిగివుండేది? ఒక వేళ ప్లెబిసైటు జరిగివుంటే దాని పరిణామమెలా వుండేది?–అనే నిరర్థక అంశాలపైనే సాగాయి భద్రతామండలి తీర్మానాన్ని త్రోసి రాజన్న పాకిస్థాన్ సైనిక దళాలను ఉపసంహరించనేలేదు అందువల్ల

భద్రతా మండలి ఆ విషయంలో ప్రగతి సాధించేందుకు మరికొన్ని తీర్మానాలు చేసింది కాని అవన్నీ కూడా నిష్ఫలమయ్యాయి అటు తరువాత జమ్మూ-కాశ్మీర్‌పై ద్వైపాక్షిక చర్చలు జరిపే బాధ్యతని భారత్-పాకిస్తాన్‌లకే వదిలివేసారు 1962 డిసెంబరు 27 నుండి ఆ ప్రక్రియ ప్రారంభమైంది ఆదిలోనే హంసపాదన్నట్లు పాకిస్తాన్ తన ఆధీనంలో వున్న భూభాగంలో 2060 చ కి మి ప్రాంతాన్ని చైనాకు ధారాదత్తం చేయాలని నిర్ణయించి చర్చలకు గండికొట్టినంత పనిచేసింది దరిమిలా నీరసంగా నిరాశాజనకంగా సాగిన చర్చలు ఆరు నెలల అనంతరం పూర్తిగా నిలిచిపోయాయి

అటు తరువాత జరిగిన రెండు ఒప్పందాల ఫలితంగా జమ్మూ-కాశ్మీర్‌పై రెండు ముఖ్యమైన ఒప్పందాలు కుదిరాయి ఫీల్డ్‌మార్షల్ అయూబ్‌ఖాన్ 1947లో మిగిలిపోయిన దానిని సాధించాలనే ఉద్దేశ్యంతో ఆపరేషన్ జిబ్రాల్టర్' తలపెట్టారు 1965 వేసవిలో ప్రత్యేక శిక్షణ పొందిన సైనికులతో కూడిన ఐదు ప్రధాన టాస్క్‌ఫోర్స్ దళాలు కాశ్మీర్‌లోనికి చొచ్చుకువచ్చాయి ఐతే ఈ ఆపరేషన్ జిబ్రాల్టర్ కూడా విఫలమయింది అందుకు ప్రధాన కారణం దానికి జమ్మూ-కాశ్మీర్ ప్రజల సహాయ నిరాకరణ సైనికులను పంపి ప్రజా తిరుగుబాటు రెచ్చగొట్టాలన్న పాకిస్తాన్ కుతంత్రం భగ్నమయింది ఐరాస జోక్యంతో కాల్పులు నిలిచిపోయాయి 1966 జనవరిలో ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి పాక్ అధ్యక్షుడు అయూబ్‌ఖాన్ తాష్కెంట్ ఒప్పందం మీద సంతకాలు చేశారు తమ మధ్య వివాదాలను శాంతియుతంగా సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోవడానికి కట్టుబడి వుంటామని రెండు దేశాల పునరుద్ఘాటించాయి భారత్ పాకిస్తాన్‌ల నడుమ ఉద్రిక్తతలు కొనసాగడం రెండు దేశాలకు క్షేమదాయకం కాదని అవి పేర్కొన్నాయి

1971 యుద్ధంలో పాకిస్తాన్ పరాజయం పాలై బంగ్లాదేశ్ ఆవిర్భవించిన తరువాత కాశ్మీర్ భవితవ్యంపై కడపటి ముఖ్య ద్వైపాక్షిక ఒప్పందం కుదిరింది 1972 జూలై 3న భారత ప్రధాని ఇందిరాగాంధీ పాక్ ప్రధాని జుల్ఫికర్ ఆలీ భుట్టో దీనిపై సంతకాలుచేశారు జమ్మూ-కాశ్మీర్ విషయంలో అంతిమ పరిష్కారాన్ని సాధించేందుకు కట్టుబడివుండాలని అందుకు కృషి చేయాలని ఈ ఒప్పందం పేర్కొంటోంది ఇది ఎలా సాధించవచ్చు అనే విషయమై నిర్దిష్టమైన సూచనలేవీ ఒప్పందంలో లేవు కాని ఆలోగా ఏ దేశమూ ఎకపక్షంగా వ్యవహరించి పరిస్థితిలో మార్పు తేకూడదని శాంతియుత సుహృద్భావ పూర్వకమైన సంబంధాలను విచ్ఛిన్నం చేసే చర్యలకు పూనుకోవడాన్ని ప్రోత్సహించడాన్ని సహాయం అందించడాన్ని నిరోధించాలని కట్టడి చేసింది ఇందిరాగాంధీ జుల్ఫికర్ ఆలిభుట్టోల మధ్య అధీనరేఖను (లైన్ ఆఫ్ కంట్రోల్-ఎల్ ఓ సి )ను సరిహద్దుగా గుర్తించాలనే మౌకిక, అలిఖిత ఒప్పందం కుదిరిందని కొన్ని కథనాలు సూచిస్తున్నాయి పదేళ్ళకు పైగా జమ్మూకాశ్మీర్ ప్రతిపత్తిపై దౌత్యపరమైన

పరిష్కారానికి రెండు దేశాల ఎజెండాల్లోను చోటులేకుండా పోయింది ఆఫ్ఘనిస్తాన్‌లో సోవియట్ యూనియన్ ప్రభావాన్ని అడ్డుకోవడానికి అమెరికా చేస్తున్న ప్రయత్నాలకు పాకిస్తాన్ ప్రధాన మద్దతుదారుగా రూపొందడం పరిస్థితిని సమూలంగా మార్చివేసింది అమెరికా అండదండలతో కాశ్మీర్‌లో మరింత తీవ్రస్థాయిలో ఎదురుదాడి ప్రారంభించడానికి జియాఉల్ హక్‌కి వీలుకలిగింది 1947 1965ల్లో అమలుచేసిన పథకాలకి మార్పులు చేర్పులతో 1985 నాటికి ఆపరేషన్ టోపాక్ పథకం రూపుదిద్దుకోనారంభించింది కాశ్మీర్‌లో తక్కువ స్థాయిలో ఘర్షణలు కొనసాగిస్తూ ప్రజా తిరుగుబాటు రెచ్చ గొట్టాలనే వ్యూహం దీనికి కేంద్రబిందువు 1989లో చెలరేగిన తీవ్రవాదం భారతదేశం పాకిస్తాన్‌లు ద్వైపాక్షికంగా చొరవ తీసుకొనే అవకాశాలను పూర్తిగా తుడిచిపెట్టింది ఉభయ దేశాల ప్రధానులు ఐ కె గుజ్రాల్ నవాజ్ షరీఫ్ సంభాషణల పునరుద్ధరణకు ప్రయత్నంచేశారు కాని అనేక కారణాలవల్ల వాటి ప్రయోజనం పరిమితమై పోయింది

**తిరుగుబాటు - హిందూమిత వాదం**

లోగడ 1965లో అరాచకాన్ని సృష్టించేందుకు చేసిన ప్రయత్నాలను ప్రజలు తిప్పికొట్టినా 1988లో ఎందుకు ప్రజ్వరిల్లాయి నిరుద్యోగం ఎన్నికలలో రిగ్గింగు పాకిస్తాన్ జోక్యం ఇలా సవాలక్ష కారణాలు పేర్కొంటారు బహుశా వాటికన్న ముఖ్యమైన కారణం ఎవరి దృష్టిలో పడకపోవడం జమ్ము కాశ్మీర్ విషయంలో విమర్శనాత్మకమైన గ్రంథాలలోపాన్ని సూచిస్తుంది జమ్మూ-కాశ్మీర్ వేర్పాటువాదం ఊపందుకున్నది భారతదేశమంతటా మతపరమైన చీలికలు వృద్ధిచెంది ముస్లిం వ్యతిరేక హింస పెరుగుతున్న కాలంలో కావడం యాదృచ్ఛికం కాదు

యావత్ భారతదేశం జమ్మూ-కాశ్మీర్‌లలో మత రాజకీయాలకు మధ్య సంబంధాలు ఉన్నట్లు షేక్ అబ్దుల్లా 1951లోనే సూచించారు

'భారత్‌లో కొన్ని ధోరణులు ప్రబలుతున్నాయి భవిష్యత్తులో ఇవి దేశాన్ని ముస్లింల ప్రయోజనాలకు హానికరమైన మత రాజ్యంగా మార్చివేయవచ్చు ఒక మతపరమైన సంస్థకు ప్రభుత్వంపై ఆధిక్యత చిక్కినప్పుడు అన్ని వర్గాలకు సమానత్వం అనే కాంగ్రెసు సిద్ధాంతం స్థానంలో పరమత అసహనం చోటుచేసుకుంటుంది భారత్‌లో కాశ్మీర్ విలీనం కొనసాగింపు ఈ ధోరణులను అరికట్టడంలో తోడ్పడుతుంది భారత యూనియన్‌లో కాశ్మీర్ వుండడమే భారతదేశంలో హిందూ-ముస్లింల మధ్య సత్సంబంధాలు స్థిరపడడానికి ప్రధాన కారణం నాలుగు సంవత్సరాల నా అనుభవంతో చెబుతున్న మాట ఇది'

అబ్దుల్లా అభిప్రాయం తప్పని దీర్ఘకాలంలో రుజువైంది భారతదేశ లౌకిక

దృక్పథాన్ని జమ్మూ-కాశ్మీర్ సుస్థిరం చేయకపోగా 1980 దశకం నుంచి లౌకికవాదం విషయంలో కాంగ్రెసు (ఐ) ఊగిసలాట వలన జమ్మూ కాశ్మీర్‌లోని లౌకికవాద రాజకీయాలే దెబ్బతిని పోయాయి ఫలితంగా హిందూమితవాదానికి ఆస్కారం కలిగింది

ఈ రోజున నేషనల్ కాన్ఫరెన్స్ తానంతవరకు కట్టుబడి వున్న సామ్యవాదం లౌకికవాద్యాలకు తిలోదకాలు ఇచ్చింది కొత్త ఢిల్లీలో హిందూమిత వాదం అధికారంలో వుంది జమ్మూ-కాశ్మీర్ చరిత్రలోనే అతిక్లిష్టమైన ఘడియ ఇది కార్గిల్ ఎత్తుల్లో ప్రవేశించి ఆ ప్రాంతాన్ని పాకిస్తాన్ ఆక్రమించుకోవడానికి తోడ్పడిన భద్రతా వైఫల్యాలకన్నా జమ్మూ-కాశ్మీర్ సమస్య పట్ల భారతీయ జనతాపార్టీ (బి జె పి ) వైఖరి సిద్ధాంతాల్లోని తప్పులే ఆ రాష్ట్రానికి దేశానికి మరింత ప్రమాదకరంగా పరిణమించగలవు

1996 తరువాత కాశ్మీర్

1996 ఎన్నికలు కీలకమైన తరుణంలో దశాబ్దంగా జమ్మూ-కాశ్మీర్‌లో సాగుతున్న తీవ్రవాద కార్యకలాపాలను అరికట్టడం సాధ్యమేనని అనిపించిన సమయంలో వచ్చాయి ఇదేమంత ఆశ్చర్యకరమైన అంశం కాదు సుమిత్ గంగూలి 1991 లోనే చెప్పినట్టు భారత్ శాంతిని నెలకొల్పలేకపోయినా భద్రతనందించడం సాధ్మమే 1996 లోక్‌సభ శాసన సభలకు జరిగిన ఎన్నికలను విమర్శించిన వారు అవి బలవంతంగా రుద్దినవని ఆరోపించారు నేనలా అనుకోవడం లేదు వేరే సందర్భంలో అదే చెప్పాను కూడా ఇప్పుడా చర్చ పున ప్రారంభించకుండా పలు మౌలికమైన ముఖ్యమైన ప్రయోజనాలు చేకూరాయని చెప్పుకుంటే చాలు అంతకు ముందు కన్నా 1997లో పౌరులు భద్రాతా దళాల హత్యలు తగ్గాయి ఒక భారతీయ సైనికుడు మరణిస్తే ప్రతిగా చనిపోయే తీవ్రవాదుల సంఖ్య పెరిగింది తీవ్రవాద వ్యతిరేక కార్యకలాపాల సాఫల్యానికిది ముఖ్య సూచిక

ఐతే నిజమైన ప్రయోజనాలు రాజకీయ రంగంలో కలిగాయి జమ్మూ-కాశ్మీర్‌లో ప్రజాస్వామిక బహుళపక్ష పాలనా వ్యవస్థ ఎర్పాటుకు ఇంకా అవకాశం వుందని 1996 ఎన్నికలు భరోసా ఇచ్చాయి హింసనెదుర్కోవడానికి కేవలం సైనిక చర్యలే కాక ఇతర మార్గాలు కూడా వున్నాయని తెలిపాయి తీవ్రవాద కార్యకలాపాలను అంతం చేసి రాష్ట్ర అర్థిక వ్యవస్థకు కొత్త ఊపిరినిస్తామనే అజెండాతో వచ్చిన కొత్త నేషనల్ కాన్ఫరెన్స్ ప్రభుత్వం ప్రజలలో ఆశలు రేకెత్తించింది గ్రామాలు పంచాయతీల స్థాయి వరకు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు అధికార వికేంద్రీకరణతో సహా గత మూడు దశాబ్దాల కాలంలో నీరు గారిపోయిన రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని పునరుద్ధరించే పథకాలు తిరిగి రూపొందించి తమ చర్యల ఫలితాలు కనబడేందుకు తాము అధికారంలో

వున్నది అతి తక్కువ కాలమని ప్రభుత్వం సాకు చెప్పవచ్చునేమోగాని అసలు ఆ పథకాలు అమలు చేసిన జాడే కనబడదు

బి జె పి అధికారంలోకి వచ్చేనాటికి ఆ వాగ్దానాలు కార్యరూపం దాల్చే సూచనలు కానరాక ప్రజలలో ఆశల స్థానంలో కోపం చోటు చేసుకుంటోంది అసమర్థత అవినీతి ఆరోపణలతో నలిగిపోయిన ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లా పార్టీకి చారిత్రక వారసత్వంగా వస్తున్న లౌకికవాదాన్ని వదిలివేసి హిందూవాదులతో చేయి కలపడమే ఉత్తమం అని భావించారు హిందువులపై తీవ్రవాదుల హింసాకాండ ఒకవైపు హిందూత్వవాదం మరోవైపు పెరుగుతుండడం వల్ల రాష్ట్రంలో మతపరమైన విభేదాలు మరింత పెరిగాయి బి జె పి అధికారంలోకి రాకముందు 50 ఎళ్లలో ఎన్నడూ లేనంతగా తీవ్రస్థాయికి చేరుకున్నాయి ప్రాంతీయ స్వయం ప్రతిపత్తి రాష్ట్రాన్ని మతప్రాతిపదికన చీల్చే కార్యక్రమంగా రూపుదిద్దుకుంది పోఖ్రాన్-2 దీనికి ఆజ్యం పోసింది జమ్మూ-కాశ్మీర్‌లో పాశ్చాత్య దేశాల జోక్యానికి తలుపులు తెరిచింది ఏ తీవ్రవాదాన్ని నిర్మూలిస్తామని కేంద్రప్రభుత్వం చెప్పిందో ఆ తీవ్రవాదం వారి హయాంలోనే పెచ్చుమీరడం విచిత్రం

ఇది కార్గిల్ సంఘటనల వెనుకనున్న నేపథ్యం ఎలాగైనా అమెరికా జోక్యం చేసుకునేలా చేయడమే కార్గిల్‌లో యుద్ధానికి తలపడిన పాకిస్తాన్ లక్ష్యం ఆ జోక్యంతో సమస్య తనకు అనుకూలంగా పరిష్కారమవుతుందని పాకిస్తాన్ ఎత్తుగడ భారత ప్రభుత్వమే తన అంగీకారంతో మొదటి అంశంలో అది విజయం సాధించింది జమ్మూ-కాశ్మీర్‌లో ప్రజాస్వామ్య వ్యాప్తికి అర్థవంతమైన చొరవ చూపని పక్షంలో అమెరికా ప్రేరేపణతో మత ప్రాతిపదికన రాష్ట్రాన్ని చీల్చే ప్రయత్నాలు తప్పక నెరవేరతాయి వాదన

ఈ పుస్తకంలో తదుపరి అధ్యాయాలు కార్గిల్ యుద్ధం ఎప్పుడు ఎలా ప్రారంభమైంది ఎలా సాగిందీ పరిశీలిస్తుంది సాయుధ చర్యకు విజయంగా అధికారులు వల్లిస్తున్న దానిలో నిజానిజాల నిగ్గు తేలుస్తుంది అమెరికా ఆదేశాలతో యుద్ధం పరిసమాప్తి కావడాన్ని మూడవ అధ్యాయం వివరిస్తుంది కార్గిల్ యుద్ధం మొదలు కావడానికి అమెరికా జోక్యానికి' పోఖ్రాన్-2 అణుపరీక్షలకు మధ్యగల సంబంధాన్ని కనుగొనే ప్రయత్నం చేస్తుంది జమ్మూ-కాశ్మీర్‌లో రాజకీయం మతం రంగు పులుముకోవడాన్ని ఆరవ అధ్యాయం మత విద్వేషంతో సాగిన నరమేధం దాని ప్రభావాన్ని పరిశీలిస్తుంది ఎడవ అధ్యాయం బి జె పి ప్రభుత్వం దేశ భద్రతకు ఎర్పడిన ఈ కొత్త సవాలును ఎలా ఎదుర్కొన్నదో పరిశీలిస్తూ శాంతినెలకొనడం తథ్యమని

ప్రభుత్వం చెప్పడాన్ని ప్రశ్నిస్తుంది ఎనిమిదవ అధ్యాయంలో యుద్ధాన్ని నడపడంలో అవకతవకలని కప్పిపుచ్చుకోవడానికి చేసిన ప్రయత్నాలని ముఖ్యంగా యుద్ధం నేర్పిన పాఠాలను సమీక్షించేందుకు నలుగురు సభ్యుల సంఘాన్ని నియమించడాన్ని నేను విశ్లేషిస్తాను చివరగా పాకిస్తాన్ భారత్‌లపై ఈ యుద్ధ పరిణామాలు ఎలా వుండబోతున్నదీ సమీక్షిస్తూ ముగిస్తాను

ఈ పుస్తకంలో చేయనున్న చర్చకు ఉపఖండం అణ్వస్త్రమయం కావడానికి కార్గిల్ యుద్ధానికి మధ్యనున్న సంబంధమే కేంద్రబిందువు జమ్మూ-కాశ్మీర్‌లో తన లక్ష్యాల సాధనకు పాకిస్తాన్‌కున్న అవకాశాలలో పోఖ్రాన్-2 వల్ల మౌలికమైన మార్పు వచ్చింది దరిమిలా పాకిస్తాన్ చాఘాయ్ కొండల్లో అణు పరీక్షలు జరిపింది ఇతమిద్ధంగా చెప్పలేకపోయినా ఇరు పక్షాలకు తెలిసిన ఒక స్థాయికి మించి జమ్మూ-కాశ్మీర్‌లో హింసాత్మక ఘటనలు పెరగడం సాంప్రదాయిక యుద్ధానికి దారి తీస్తుందనే అభిప్రాయాన్ని ఈ సంఘటనలు చావుదెబ్బ తీసాయి ఛాఘాయి పరీక్షల వల్ల అణుశక్తి సమతూకం ఎర్పడడమే కాక సైనిక చర్యల వల్ల అమెరికా జోక్యం చేసుకునే అవకాశాలువుండడం భారత్ మెరుగైన తన సాంప్రదాయక సైనికి శక్తిని రంగంలో దింపకుండా అడ్డుపడింది

కాశ్మీర్‌లో సామ్రాజవాద జోక్యాన్ని ఆహ్వానించే చర్యల్లో కార్గిల్ మొట్టమొదటిదని నేను భావిస్తున్నాను యుద్ధ సమయంలో దౌత్య వ్యవహారాల నిర్వహణకు బి జె పి ప్రభుత్వం తీరుకూడా దీనికి మరింత తోడ్పడింది యుద్ధ సమయంలో తిరుగుబాటుదారుల హింస కూడా పెరిగింది జమ్మూ-కాశ్మీర్‌పై విభజన తర్కాన్ని బలవంతంగా రుద్దడానికి 'రాజకీయ పథకాలకు హింస తోడయింది

ఈ పుస్తకంలో ఒక ముఖ్యమైన అంశాన్ని ముందుగా ప్రస్తావించాల్సివుంది ఇందులోని సమాచారం చాలా వరకు యుద్ధ విలేకరిగా సేకరించినదే స్వతంత్ర సంస్థల నుంచి సమగ్రం విశ్వసనీయమైన సమాచారం లభ్యంకానందున చాలా వరకు సైనికాధికార్లు గూఢచార విభాగాలు ఇతర మార్గాల ద్వారా సంపాదించినవి రానున్న కాలంలో యుద్ధానికి సంబంధించిన పలు అంశాలపై మరింత లోతైన అవగాహన సాధ్యమవుతుంది అప్పుడు కూడా ఈ పుస్తకంలో నేను పేర్కొన్న మౌలిక అంశాలు పరీక్షకు నిలబడతాయని నా నమ్మకం

# కార్గిల్ శిఖరాల కోరకు జరిగిన పోరు

చొరబాటుదారులను తరిమి వెయ్యడానికి సెప్టెంబరు దాకా సమయం పడుతుందని రక్షణమంత్రి జార్జి ఫెర్నాండెజ్ చెప్పడంలో అతిశయోక్తి ఎమీ లేదు నిజంగానే ఆ పని పూర్తిచేయడానికి అవసరమైన కనీస సమయం

**ఇండియాటుడే 1999 జూలై 12**

కార్గిల్ కొండల నుంచి పాక్ సైనికులు చొరబాటుదార్లను ఉపసంహరించుకుంటున్న సమయంలో వారు ఎంతో నష్టపోతున్నపటికీ ఆక్రమించుకున్న ప్రాంతాల నుంచి ఉపసంహరించుకోవాలసినంత సైనికపరమైన ఒత్తిడి ఎమి లేదు పాకిస్తాన్ ఉసపంహరణ ప్రారంభం కావడానికి కొన్ని రోజుల ముందే భారత సైనికాధికారులు ప్రముఖ మీడియా ప్రతినిధులతో మాట్లాడుతూ కార్గిల్ యుద్ధం మరికొన్ని వారాలు లేదా నెలల పాటు కొనసాగవచ్చునిచెప్పడం గమనార్హం జూలై నెలాఖరునాటికి విజయం మనదే నని ప్రకటించిన కేంద్ర ప్రభుత్వం ఈ వాస్తవాన్ని మరుగుపరిచింది యుద్ధంలో ప్రత్యక్షంగా పాల్గొంటున్న సైనికులు సైనికాధికారులకు మరికొంత కాలం బాగానే పోరాడక తప్పదని స్పష్టంగా తెలుసు పాకిస్తాన్ సైనికులు చొరబాటు దార్లతో చెదురుమదురుగా కాల్పులు మొదలయింది లగాయతు అసాధ్యమైన పరిస్థితులను అధిగమించి భారత సైన్యం కార్గిల్ యుద్ధం ముగిసిన నాటికి ఆక్రమిత ప్రాంతాల్ని చాలా వరకు తిరిగి స్వాధీనం చేసుకోగలిగింది నిజమైన అర్ధమీ పాకిస్తాన్ చొరబాటుదారులను ఖాళీ చేయించే భారత సైనిక చర్య మధ్యలోనే ఆగిపోయింది పాకిస్తాన్ ఉపసంహరణ మరింత ప్రాణ నష్టాన్ని నివారించిన మాట వాస్తవం కాని ఈ పోరాట విరమణ షరతులు దీర్ఘకాలికంగా అపారమైన ప్రభావం చూపగలవు ఆ ప్రభావం హిందూ ఛాందసవాదుల విజయోత్సాహాన్ని చెల్లా చెదురు చేసే రోజు ఎంతో దూరంలో లేదు

**చొరబాట్ల గుర్తింపు**

పాకిస్తాన్ సైనికులు చొరబాటుదార్ల కదలికలను తొలిసారి జుబ్బార్ కొండలపై 1999 మే నెల 3వ తేదీన పసిగట్టినట్లు ఇప్పుడు నిర్ధారణ అయింది [1] బారత రక్షణ వ్యవస్థలోని నిర్లక్ష్య వైఖరిని కొన్ని సందర్భాలలో దాని అసమర్ధతను కార్గిల్ యుద్ధం బయట పెడుతుంది చొరబాటుదార్లు తిష్టవేసిన ప్రాంతంలో వేగు బృందాలను కానీ గస్తీ దళాలను కాని నియోగించిన దాఖలా లేదు

గార్ఖున్ ఓ కుగ్రామం ఆ గ్రామానికి చెందిన గొర్రెల కాపర్లు తాషినాంగ్యాల్

మొరుప్‌సెరింగ్ అలిరజా స్తాంబా గొర్రెలు మేపేందుకు బాంజు ఎత్తులపైకి వెళ్లారు అందరి గొర్రెల్ని ఒకే మందగా కలిపేసి ఎత్తునవున్న పచ్చిక బయళ్లలో మేపుకురావడానికి వంతుల ప్రకారం ఇద్దరు ముగ్గురికి అప్ప చెప్పడం కార్గిల్‌లోని గొర్రెల కాపర్ల రివాజు ఆ వేసవి రోజుల్లో అంత పెందలాడే జుబార్ పర్వతాలపైకి ఎందుకు వెళ్లారో చెప్పమంటే నాంగ్యాల్ అతని మిత్రులు సంకోచించడానికి కారణం లేకపోలేదు కొండ గొర్రెల వేట కోసం వారు అక్కడికి వెళ్లారు కొండ గొర్రెలను వేటాడడం ఆ ప్రాంతంలోని వారికి ఎంతో ప్రియమైన క్రీడ సెరంగ్ ఆ ఏడాదే లేహ్‌లో కొన్న శక్తివంతమైన బైనాక్యులర్స్ (దుర్భిణి)ని తనవెంట తీసుకెళ్లాడు అది వేటకెంతో అక్కరకొచ్చే సాధనం

నాంగ్యాల్ మే నెల మూడో తేదీ ఉదయం జుబ్బార్ పర్వాతాల్లోని జుబ్బార్ లాంగ్‌పా (కొండవాగు) వెంబడి ఐదు కిలో మీటర్లు దూరం వెళ్లాడు సెరింగ్ తెచ్చిన బైనాక్యులర్స్‌తో కొండచరియల్ని పరికిస్తున్న నాంగ్యాల్‌కి పఠాన్ దుస్తుల్లో గోతులు తవ్వుతూ తాత్కాలిక బంకర్లని ఏర్పాటు చేసుకుంటున్న కొందరు వ్యక్తులు కనిపించారు వారెందరున్నారని కాని వారి బలాన్ని కానీ అతను అంచనా వేయలేకపోయినా స్థానికంగా వున్న 3 పంజాబ్ రెజిమెంట్ అధికారులకు వారి ఉనికి గురించి సమాచారం అందించాడు

స్థానికుల కథనం ప్రకారం నాంగ్యాల్ తెచ్చిన కబురుపట్ల అధికారులు చురుగ్గా స్పందించలేదు దరిమిలా మే నాలుగున ఒకటి రెండు గస్తీ బృందాలని యాల్దోర్ ఖాబరోర్ ప్రాంతాలకి పంపించినట్లు 15 కార్ప్స్ కమాండర్ లెఫ్టినెంట్ జనరల్ కిషన్‌పాల్ చెప్పారు ఆ బృందాలు కుకెర్‌థాంగ్ చరియపై ఏడుగురు ఖాబరోకు ఎగువన ఇద్దరు చొరబాటుదారులను కనుగొన్నట్లు ఆయన చెప్పారు మే నెల ఎడో తేదీ రాత్రి మరో రెండు గస్తీ బృందాలను పంపించారు కుకెర్‌థాంగ్ వైపు వెళ్లిన బృందంపై అదే రాత్రి జరిగిన దాడిలో ఒక సైనికుడు మరణించాడు రెండో బృందంపై జరిగిన దాడిలో మే నెల పదో తేదీ ఉదయం ఇద్దరు సైనికులు ప్రాణాలు కోల్పోయారు చాలామంది గాయపడ్డారు అంత తీవ్ర ఘటనను ఆ గస్తీ దళాలు ఊహించలేదన్నది స్పష్టం [2]

**మొదటిదశపోరు**

కార్గిల్‌లోని ఇతర ప్రాంతాలకు గస్తీ బృందాలని ఎప్పుడు పంపారు? వారిగతి ఎమయింది? అనే విషయాలపై సైనికాధికారులు పెదవి విప్పడం లేదు లెఫ్టినెంట్ సౌరభ్ కాలియా నేతృత్వంలో గస్తీ బృందం దురదృష్టవశాత్తూ మే నెల 14న కక్సార్‌లాంగ్‌పా దిగువకు వెళ్లినట్లు ఇపుడు నిశ్చితంగా తెలుస్తోంది కాని అధికారులు మాత్రం మొదట్లో ఆ బృందం అంతకు పది రోజుల ముందే గస్తీకి వెళ్లినట్లు చెప్పారు

కానీ ఎ ఏ గస్తీ బృందాలను పంపారు వారికి పాకిస్తాన్ సైనికులు ఎక్కడ తారసపడ్డారు అన్నది నిర్ధారించేందుకు తగిన ఆధారాలు దొరకడం లేదు నాంగ్యాల్ అందజేసిన తొలి సమాచారంపై సైన్యం ఎ స్థాయిలో, ఎ విధంగా స్పందించింది అనేది సమగ్ర స్వతంత్ర విచారణ ద్వారా తేల్చవలసిన అనేక అంశాలలో ఒకటి మే నెల సగం గడిచేనాటికి కార్గిల్ సెక్టారులో పశ్చిమాన ముష్కోలోయ నుంచి తూర్పున ఛోర్బత్‌లా వరకు భారత సైన్యం ఆందోళనకర రీతిలో ఒకదాని వెంబడి ఒకటిగా పాక్ ఆక్రమిత స్థావరాలను కనుగొంటూనే వుందన్న విషయం ఒక్కటే బయటికి తెలిసింది

సైన్యం తొలి ప్రతిస్పందనను ప్రభావితం చేసిన ఆలోచనా సరళి గురించి 15వ కార్ప్స్ కమాండర్ లెఫ్టినెంట్ జనరల్ కిషన్‌పాల్ చూచాయగా కొన్ని విషయాలు తెలిపారు కార్గిల్‌పై వైమానిక దాడులు ఆరంభం కాబోతున్న సమయంలో ఏర్పాటు చేసిన పత్రికా సమావేశంలో పాక్ ఆక్రమిత ప్రాంతాన్ని అన్‌హెల్డ్ ఏరియాస్' (అనాధీన ప్రాంతాలు) గా పాల్ వర్ణించారు తరువాత మరొక ఇంటర్వ్యూలో తాను వాడుకలోకి తెచ్చిన సూత్రీకరణను వివరిస్తూ వారిని నేను పట్టించుకోకపోయినా పోయేదేమీ లేదు వేసవిలోగాని వారు ఆ కొండలు దిగి వస్తే వారిని నరికేస్తాం శీతాకాలంలోనూ ఆ ప్రదేశాన్ని వీడకపోతే వారే చనిపోతారన్నారు [3] ఈ మాటల్లో నిజమైన అంతరార్థాల్ని తీవ్రంగా పట్టించుకోలేదు ఆ దశలో సైనికాధికారులు ఈ తాజా చొరబాటును జమ్మూ-కాశ్మీర్‌లో కొత్త ప్రాంతాలలోనికి విద్రోహ చర్యలు వ్యాప్తి చెందించే లక్ష్యంతో సైనికేతర చొరబాటుదార్లని ప్రవేశపెట్టేందుకు చేస్తున్న విఫల ప్రయత్నమనో లేదా స్థానికంగా పరిమితమైన చిన్నా చితక సంఘటనలనో భావించినట్లు స్పష్టమవుతుంది

మే నెల మధ్యకు వచ్చేసరికి కొంత ఆందోళన మొదలయింది బాగా ఎత్తు నుంచి చూస్తే కొండల్లో తిష్ట వేసిన చిన్నచిన్న పాక్ సైనిక విభాగాలని కనిపెట్టడం సాధ్యంకాదు గనుక విస్తృతస్థాయి నిఘా చర్యలు చేపట్టి వాసో (వైడ్ ఏరియా సర్వీవలన్స్ ఆపరేషన్స్-డబ్ల్యు ఎ ఎస్ ఒ) హెలికాప్టర్లతో తక్కువ ఎత్తు నుంచి గాలింపు చర్యలు జరపాలని కిషన్ పాల్ ఆదేశించారు వాసో హెలికాప్టర్లు మూడింటిపై మెషిన్ గన్‌లతో కాల్పులు జరిగాయి వాటిలో రెండింటికి గుండ్లు తాకినా అవి సురక్షితంగా వెనక్కి రాగలిగాయి ఈ సంఘటన తరువాత వాసో' ఆపరేషన్లకు ఉపయోగించే చీటా హెలికాప్టర్లకు మెషిన్‌గన్‌లు అమర్చారు వసంతకాలంలో కుప్వారా ప్రాంతంలో ఈ ప్రయోగం జరిపి చూపారు కాని దీనివల్ల రక్షణ ప్రయోజనం పరిమితమేనని తేలింది

కార్గిల్‌లోనికి పాకిస్తాన్ చొరబాటు వెనుక ఉద్దేశ్యం పైన కాని అందుకు ఉపయోగించిన బలంపైనకాని సక్రమమైన అవగాహన లేకపోవడంతో వ్యూహారచనలో

తరచూ తికమక పడ్డారు  పాకిస్తాన్ చొరబాటును వీలైనంత త్వరగా తిప్పికొట్టాలనే ఆదుర్దాతో అక్కడి వాతావరణం ఏమాత్రం అలవాటులేని బలగాలను కొండలపైకి పంపించారు  వారికి కవచంగా తగిన స్థాయిలో ఆర్టిలరి (ఫిరంగులు) తోడ్పాటు కూడా లేదు  కార్గిల్ చర్యల మొదటి దశలో ఏ వారంలో ఎందరు సైనికులు మృతి చెందిందీ తెలిపే వివరాలు లభ్యం కావడం లేదు  అవి లభిస్తే ఆ సమయంలో సైన్యం అనుసరించిన వ్యూహాలు  వాటి ఫలితాల గురించి ఆసక్తికరమైన అంశాలు వెలుగులోకి రావచ్చు

కార్గిల్ యుద్ధం మొదటిదశలో రక్షణ మంత్రి జార్జి ఫెర్నాండెజ్ చేసిన అరకొరప్రకటనలు ఒకవంక  మేనెల 25 వరకు రక్షణ విషయాలకు సంబంధించిన కేబినెట్ కమిటీ (సిసిఎస్) సమావేశం జరగకపోవడం మరో వంక  ఆ దశలో యుద్ధ నిర్వహణ  వ్యూహాల సమీక్ష ఎంత అస్తవ్యస్తంగా  ఎంత దయనీయంగా వున్నదీ తెలియజేస్తాయి

**రెండవ దశ   విమాన దాడులు**

రక్షణ విషయాల కేబినెట్ కమిటి సమావేశంతో రెండవ దశ కార్గిల్ యుద్ధం ఆరంభమైంది  ఈ సమావేశం జరిగిన మరుసటి రోజు ఉదయమే భారత యుద్ధ విమానాలు ముష్కోలోయ నుంచి బతాలిక్ వరకు వున్న అర్ధచంద్రాకార ప్రాంతంలోని పాక్ ఆక్రమిత స్థావరాలపై బాంబులు కురిపించాయి  జనాంగీకంగా కానీ ప్రచారమాధ్యమాలలో అధిక భాగం కానీ దీనిని కార్గిల్ యుద్ధం అసలు ప్రారంభంగా భావించడం జరిగింది  తొలి విమాన దాడులు అద్భుతమైన ఫలితాలనిచ్చాయని చెప్పలేం  మే 27న స్క్వాడ్రన్ లీడర్ అహూజా నడిపిన మిగ్-21 యుద్ధ విమానం స్ట్రింగర్ క్షిపణి దాడికి కూలిపోయింది  ఫ్లయిట్ లెఫ్టినెంట్ కె  నచికేత నడుపుతున్న మిగ్-27 విమానం ఇంజన్ సరిగా పని చేయక నియంత్రణ రేఖ (Loc) అవతల కూలి పోయిన కొద్ది నిముషాలకే ఈ దుర్ఘటన జరిగింది  ఆ మర్నాడు ద్రాస్ సబ్‌సెక్టారులో రాకెట్లు అమర్చిన MI 17 హెలికాప్టరును శత్రువు కూల్చివేయడంతో అందులోని నలుగురు సిబ్బంది మరణించారు

పాకిస్తాన్ వైమానిక దళం స్ట్రింగర్ క్షిపణులను  ఉపయోగించగలదని భారత వ్యూహకర్తలు ఊహించలేక పోయారు  ఈ క్షిపణులు వేడిమిని పసిగట్టి ఆ దిశగా కదులుతాయి  నష్టాలు తెచ్చిపెట్టిన అనుభవంతో భారత యుద్ధ విమానాలు స్ట్రింగర్ క్షిపణులను తప్పుదోవ పట్టించే రక్షణ పద్ధతులను అవలంబించి మరింత ఎత్తునుంచి దాడులు సాగించ వలసి వచ్చింది  ఎమ్ ఐ- 17 హెలికాప్టర్లను ఆయుధ ప్రయోగానికి

వినియోగించడం తగ్గిపోయింది ఈ పరిస్థితుల్లో విమానదాడుల వల్ల ప్రయోజనం ఎమిటి? వైమానిక శక్తి పరిమిత వినియోగం తెచ్చిపెట్టగల పరిణామాలను ప్రభుత్వానికి వివరంగా తెలిపినట్లు శ్రీనగర్‌లో ఒక విలేకరుల సమావేశంలో ఎయిర్ ఫోర్స్ ఛీఫ్ ఎయిర్ మార్షల్ ఎ వై టిప్నిస్ స్పష్టం చేసారు బహుశా యుద్ధ విమానాలను అవి ఏ ప్రయోజనాల కోసం రూపొందాయో వాటి కోసం వాడడం లేదని చెప్పడం ఆయన ఉద్దేశ్యం అయి వుండవచ్చు ప్రధాన పాక్ సరఫరా కేంద్రాలు ఆర్టిలరి స్థావరాలపై దాడులు చేయాలంటే నియంత్రణ రేఖను దాటి పోవలసి వుంటుంది ప్రచార మాధ్యమాలు ఈ దాడుల వల్ల ప్రయోజనాలను మరింతగా ఎక్కువ చేసి చూపించిన మాట నిజమే అయినప్పటికీ అవి చేకూర్చిన ప్రయోజనం పరిమితమేనని చాలా మంది నిపుణులు నమ్ముతున్నారు [4]

ఎమైనా విమాన దాడుల వల్ల రెండు ముఖ్యమైన పరిణామాలు సంభవించాయి మొదటిది ఇండియా ఈ యుద్ధాన్ని తీవ్రంగా పరిగణిస్తున్నట్టు నియంత్రణ రేఖకు ఈవల భారత భూభాగంలో తిష్ట వేసిన పాక్ సైనికులకు ఇతర చొరబాటు దార్లకు సంకేతం అందింది బలహీనంగా వున్న శత్రువుని శీతాకాలం వరకు నిలువరించ వచ్చని వారు పెట్టుకున్న ఆశల్ని ఆ దాడులు పటాపంచలు చేసాయి రెండవది మరింత ముఖ్యమైన పరిణామం నిబ్బరం కోల్పోతున్న భారత సైనికులకు విమాన దాడులు ఇచ్చిన ఉత్తేజం అంతా ఇంతా కాదు కొండల పైకి ఎగబాకేందుకు పోరాడుతున్న భారత సైనికులు తమ శత్రువు కూడా విమాన దాడుల మూలంగా ఆత్మరక్షణలో పడ్డాడని తెలిసి మరింత ధైర్యంగా ముందుకు కదిలారు

విమాన దాడులు ఆరంభమయ్యాక ద్రాస్‌కు అభిముఖంగా వున్న టోలోలింగ్ పర్వతాల స్వాధీనంతో భారత్‌కు తొలి విజయం లభించింది అనంతరం రాజపుటానా రెజిమెంటుకు చెందిన సైనికులు 4590 మీటర్ల ఎత్తుకు దూసుకు పోగలిగారు అటుపైన వారు ద్రాస్ నుంచి చూస్తే అత్యంత ఎత్తుగా కనిపించే పీక్-5140 శిఖరం పైకి చేరుకో గలిగారు ఆరు వారాల నిరంతర ఫిరంగి కాల్పులతో పాటు సాగిన ఈ శిఖరాధిరోహణ [5] అలవాటు లేని వాతావరణ పరిస్థితులతో ఒక్కోసారి మనస్థైర్యం కోల్పోతూ వున్న భారత సైనిక దళాలకు తాము ఈ హిమాలయ యుద్ధాన్ని గెలువ గలమన్న నమ్మకాన్ని తెచ్చిపెట్టింది ఆ వెనుకనే ద్రాస్‌కు పశ్చిమంగా 4560మీ ఎత్తున్న టైగర్ హిల్ పైన మార్పోలా వద్ద ఎయంత్రణ రేఖకు ముఖద్వారంగా పేర్కొన్న పీక్-5062 శిఖరం (సాండోలాంగ్ పా వెనుక తట్టున వుంది) పైన జరిపిన దాడులు కూడా అదే విధంగా విజయవంతమయ్యాయి ప్రసార మాధ్యమాలు ఈ విజయాలను

ఆకాశానికెత్తేసాయి జాతీయ రహదారిని గమనించే అవకాశం కలిగిన పాక్ సైనికులను ఖాళీ చేయించడం వ్యూహాత్మక ప్రాధాన్యంగల చర్యగా అధికారులు చెప్పుకున్నారు

అందులో కొంత నిజం లేకపోలేదు కాని ద్రాస్ చర్యల వల్ల సమకూరిన నిజమైన విజయం సైనిక దళాలకు అందిన నైతిక బలం మాత్రమే టైగర్ హిల్ వద్ద జరిగిన యుద్ధం గురించి జూలైలో ఒక వాఖ్యాత ఇలా అన్నారు

టైగర్ హిల్‌పై పట్టు కోసం జరిగిన యుద్ధం సైన్యం మానసిక స్థైర్యానికి పరీక్షగా నిలిచింది కీలకమైన శిఖరాలపై నుంచి పాక్ దళాలను తరిమి వెయ్యడం కోసం మే నెల నుంచి మెరికల వంటి మూడు ఇన్‌ఫాంట్రి దళాలు విఫల ప్రయత్నం చేస్తున్నాయి పరిస్థితి ఎ మాత్రం ఆశాజనకంగా లేదు అసలే కొండ చరియ 80 డిగ్రీల కోణంలో వాలుగా 15వేల అడుగుల ఎత్తులో వుంది ఆపైన ఎముకలు కొరికే చలిలో జీరో డిగ్రీ కన్నా తక్కువ ఉష్ణోగ్రతలో వీపున 40 కిలోల బరువుతో తాడుపట్టుకుని ఎగబాకాల్సి వుంటుంది అక్కడ శత్రువు తుపాకి గుళ్లే కాదు పైనుంచి జారిపడే రాళ్లు కూడా ప్రాణాలు తీయగలవు మృతుల సంఖ్య పెరిగి పోతోంది '[5]

ద్రాస్‌కు పడమటి దిశగా కూడా కొంత పురోగతి సాధ్యమయింది ఐనా యుద్ధమింకా ముగిసిపోలేదు జూలై నెల ఆరంభమయినా ఇంకా ఎన్నో సెక్టార్లలో పరిస్థితి అసంతృప్తి కలిగిస్తోంది బతాలిక్‌లో మే 28న శిఖరం 4250 పై నున్న పాక్ స్థావరంపై దాడి జరిగింది ఆ సందర్భంగా మరణించిన మేజర్ మరియప్ప శరవణన్ మృతదేహం ఇంకా దొరక లేదు దానిని వెతకడానికి ఆటంకంగా వున్న పాక్ సైనికుల కాల్పులు తప్పించుకోవడానికి భారత సైనికులు మరింత ఎత్తు ప్రాంతాలకు చేరుకోక తప్పదు ముష్కోలోయలో నాలుగు వేల అడుగుల ఎత్తులో జాడ తెలియకుండా పోయిన వారి జాబితాలో చనిపోయిన మెకనైజ్‌డ్ ఇన్ ఫాంట్రి ఆఫీసర్ మేజర్ రాజేష్ అధికారి పేరు కూడా చేరింది భారత సైన్యం పురోగతికి ఇది మరో సూచిక

కక్సార్‌లో నియంత్రణ రేఖ వద్ద వున్న కీలక స్థావరాలను ముఖ్యంగా బజరంగ్ పోస్ట్'గా పేరొందిన కీలక ప్రాంతాన్ని తిరిగి కైవసం చేసుకోవడానికి భారత్ చేసిన ప్రయత్నాలలో గణనీయమైన విజయం ఎదీ నమోదు కాలేదు అనేక ప్రాంతాలలో భారత సైన్యం తీవ్రమైన ప్రతిఘటనను చవి చూసింది జూన్ 10వ తేదీన 12 జమ్ము కాశ్మీర్ లైట్ ఇన్‌ఫాంట్రి డిజర్ట్ స్కార్పియన్స్ పారా కమాండో దళాలు యాల్డోర్ లాంగ్‌పాకి ఎగువన పటిష్టమైన స్థావరాన్ని ఎర్పరుచుకున్న కొత్త పాక్ దళాల నడుమ చిక్కుకున్నాయి సైన్యం చెబుతున్న దానికి విరుద్ధంగా పాకిస్తాన్ సరఫరా మార్గాలు ఇంకా తెరుచుకునే వున్నాయని ఇది రుజువు చేస్తోంది

చొరబాటుదారులను ఖాళీ చేయించడానికి ఇంకా రెండు నుంచి నాలుగు నెలలు పట్టవచ్చునని రక్షణ విషయాల విశ్లేషకులు నిపుణులు అభిప్రాయపడుతున్నట్లు జూన్ నెల చివరలో ఇండియా టుడే పత్రిక తెలిపింది

'ద్రాస్ సమీపంలో రహదారిని ఆనుకుని 15వేల అడుగుల ఎత్తున వున్న టోల్‌లింగ్ టైగర్ హిల్ ఎత్తుల నుంచి చొరబాటుదార్లను ఖాళీ చేయించడం సైన్యం తొలిదాడుల లక్ష్యం ఈ ప్రయత్నం ద్వారా ద్రాస్ లేదా కార్గిల్‌ను ఆక్రమించుకోవాలన్న పాకిస్తాన్ పన్నాగాన్ని విఫలం చేయగలిగింది ఐతే రహదారులకు పొంచివున్న ప్రమాదాన్ని ఇంకా నివారించలేక పోయింది రెండవ దాడి లక్ష్యం బతాలిక్ వద్ద జుబ్బార్ కుకర్‌ధాంగ్ మీదుగా పెద్ద ఎత్తున చొరబాటు జరగకుండా నిరోధించడం భారత్ కొన్ని కొండ కొమ్ముల్ని పట్టుకోగలిగినా జుబ్బార్‌తో సహా కీలకమైన ఎత్తుల్ని తన స్వాధీనంలో వుంచుకోవడంలో పాక్ విజయం సాధించింది ఇదిలా వుండగా కొండలపై నుంచి ముష్కోలోయ వరకు చొరబాటుదార్లను భారత సైన్యం ఇంత వరకు ఖాళీ చేయించలేక పోయింది [6]

మహా బలీయమైన భారత సైనిక యంత్రం కదులుతోందన్న మాటే గాని ప్రగతి మాత్రం ఆశించినంత చురుగ్గా లేదు యుద్ధంలో రెండవ దశను సాధించిన విజయాలను సుస్థిరం చేసుకునే దశగా పేర్కొనవచ్చు ద్రాస్ సెక్టారులో 121 బ్రిగేడ్‌కు విశ్రాంతి నివ్వడానికి వచ్చిన 56 బ్రిగేడ్ మునార్‌లాంగ్ పాకు పశ్చిమంగా నిలదొక్కుకోవడం ప్రారంభించింది లాజిస్టిక్ సమస్యల వల్ల సైనికులకు చాలా సార్లు తగినంత తిండి దుస్తులు మందు గుండు అందేవి కావు ఇపుడా సమస్యలు తీరాయి టింగెల్ లాంగ్ పాకు పడమరగా ముష్కోలో పోరాడడానికి కొత్తగా వచ్చిన 79 బ్రిగేడ్ సంసిద్ధమయింది ఇంకా అదనపు బలగాలు వచ్చి చేరుతూనే వున్నాయి పోరాటం ముగిసే నాటికి ఐదుకు పైగా అదనపు బ్రిగేడ్‌లు రంగంలో వున్నాయి యుద్ధం తొలి దశలో అపఖ్యాతిపాలైన కొందరు సైన్యాధికారులను వారి స్థానాల నుంచి తొలగించారు బోఫోర్ శతఘ్నులు పినాక రాకెట్ లాంచర్లతో ఆయుధ స్థావరాలను బలోపేతం చేశారు

**చివరి దాడి**

రెండవ దశలో కొనసాగించిన విమాన దాడుల వల్లనూ ఫిరంగులతో కురిపించిన గుళ్ల వర్షంతోనూ జూలై నెల ఆరంభంలో చివరిదాడికి మార్గం తేలికయింది బటాలిక్ ఎత్తుల్లో కొండ పార్శ్వం వెంబడి ముందుకు చొచ్చుకొచ్చిన గఢ్‌వాల్ రైఫిల్స్ బీహార్ రెజిమెంట్ గూర్ఖా రైఫిల్స్ గ్రెనేడియర్స్ దళాలు చెప్పుకోదగిన విజయాలు

అందించాయి యల్డోర్‌కు తూర్పున వున్న ఖలుబార్ శిఖరం (ఎత్తు 5287 మీ.) జూలై రెండున మన చేతుల్లోకి వచ్చింది గూర్ఖా దళాలు కేవలం మూడు రోజుల్లోనే ఈ శిఖరంమీద చొరబాటుదారుల ఆనవాలు లేకుండా చేశాయి ఆ వెనువెంటనే ఉర్దూస్ లాంగ్ పాకి పశ్చిమంగా భారత సైనికులు డాగ్ హిల్ అని వ్యవహరించే 4812 శిఖరం కూడా స్వాధీనమైంది ఈ రెండు పార్శ్వాలను పట్టుకోగలగడం వల్ల మంధోదాలా స్థావరం నుంచి అదనపు పాక్ దళాలు ఈ ప్రాంతాలకు రాకుండా నిలువరించడం ఇప్పుడు సాధ్య పడింది

కొన్ని వారాలుగా ఈ స్థావరంపై ఎడ తెరిపి లేకుండా విమాన దాడులు జరుగుతున్నాయి జుబ్బార్‌ను పట్టుకోవడంలో మాత్రం అదృష్టం కలిసి వచ్చింది జుబ్బార్ పర్వత ప్రాంతాన్ని కాపాడేందుకనువైన చిన్న శిఖరం బాంజును ఉర్దూస్‌లాంగ్‌పా మీదుగా చేరుకోవడంలో భారత సేనలు విజయం సాధించాయి జుబ్బార్ శిఖరం సమీపంలో వున్న పాకిస్తానీయుల భారీ మందుగుండు నిల్వపై కాకతాళీయంగా ఒక ఫిరంగి గుండు పడి అది ప్రేలిపోయింది లేకుంటే ఆ కొండ చరియపై తలపెట్టిన చివరి దాడి ఆత్మహత్య సదృశ్యమయ్యేది మొత్తానికి జుబ్బార్ మీదుగా 4924 ఆపైన 4927 శిఖరానికి మార్గం తెరుచుకుంది గార్ఖున్‌లాంగ్ పా తూర్పు దిక్కునుంచి కూడా సైన్యం చురుకుగా కదిలింది యల్డోర్ గ్రామం నుంచి కుకెర్‌థాంగ్ పర్వతం పైనున్న 4621 శిఖరాన్ని చేరుకోవడానికి చాలా సమయం పట్టింది ఈ ప్రయత్నంలో ఎంతో మంది సైనికులు మృతి చెందారు చివరికి ఆ కొండ వెను వెంటనే 5103 మీ ఎత్తున్న ధారు స్వాధీనమయ్యాయి ఎత్తైన ఈ ప్రాంతాలు స్వాధీనం కావడంతో సైన్యం గార్ఖున్ లాంగ్ పా బొరోరో ఖాబొరోరో గ్రామాలపై పట్టు బిగించగలిగింది ఇకపై పాకిస్తాన్‌కు గర్‌గుర్దు గార్ఖున్ యాల్డోర్ లాంగ్ పాల వెంబడి వున్న తన స్థావరాలకు అదనపు బలగాలను పంపి వాటిని పటిష్టం చేసుకోవడం దాదాపు అసంభవం

బతాలిక్ ప్రాంతంలో భారతీయ సైనికుల పురోగతి వల్ల మొదటి సారిగా నియంత్రణ రేఖ ఇవతల భారత భూభాగంలో పాకిస్తాన్ సైనికుల ఉనికిని రుజువు చేసే తిరుగులేని సాక్ష్యాలు లభించాయి జూలై రెండున మన సైన్యం 5 నార్తరన్ లైట్ లైట్ ఇన్‌ఫాంట్రికి చెందిన నాయక్ ఇనాయత్ ఆలీని బందీగా పట్టుకుంది బతాలిక్ ప్రాంతంలో తమ దళానికి చెందిన 200 మందిలో అందరూ హతులైనట్లు అతడు ఇంటరాగేషన్‌లో వెల్లడించాడు అంతకు ముందు కూడా పాక్ సైనికుల పాత్రను నిరూపించే మరికొన్ని సాక్ష్యాధారాలు దొరికాయి నార్తరన్ లైట్ ఇన్‌ఫాంట్రిలో అదే

ప్రాంతాలకు చెందిన వారు ఆ ఎత్తుల్లో జీవనానికి అలవాటు పడిన సైనికులు వున్నారని అందువల్లనే ఆ దళాన్ని అక్కడకు పంపారని అమెరికాకు చెందిన 'టైమ్' పత్రిక పేర్కొంది

వారంతా ముజాహిదీన్లుగ కనబడేందుకు సైనిక దుస్తులకు మారుగా సల్వార్ కమీజులు గాని ట్రాక్ సూట్లు గాని ధరించాలని పై అధికారులు ప్రోత్సహించారు వారు గడ్డాలు పెంచారు సాంప్రదాయబద్ధమైన తెల్లని టోపీలు ధరించారు ఫిబ్రవరిలో ఆ ఎత్తులకు తాము చేరుకొనే సరికే అక్కడ ఖాళీగా పడివున్న భారతీయ స్థావరాలలో కొందరు అసలైన ముజాహిదీన్‌లు వున్నారని ఆ సైనికులు చెప్పారు అలవాటు లేని ఆ ఎత్తుల్లో ప్రాణాపాయం వున్నందున కొద్ది రోజుల్లోనే వారు ఆ ప్రాంతం నుంచి వెళ్ళిపోయారు వారినిపుడు బరువులు మోసేందుకూ వేగులు గానూ ఉపయోగించుకుంటున్నారు [8]

పాకిస్తాన్ సైనికుడొకడు ఒక ఇంటర్వ్యూలో కార్గిల్ రంగంలోనికి తమను ఎలా పంపించారో పాక్ సైన్యం అందుకు అవసరమైన భౌగోళిక సమాచారాన్ని అందించి ఎలా సహాయ పడిందో సవివరంగా వెల్లడించాడు తాము తొలిసారిగా భారత సైనికులతో తలపడినది మే నెలలోనే అని అతను చెప్పినది జుబ్బార్‌లో మే నెల మూడున తాను శత్రువులను చూశానని నాంగ్యల్ చెప్పిన కథనంతో సరిపోతోంది [9]

**పాక్ ఉపసంహరణ సందిగ్ధ విజయం**

పాకిస్తాన్ సైనికులను ఉపసంహరించుకుంటోందనే ప్రకటన జూలై 11న వెలువడింది అధికారులు చెపుతున్న దానికి విరుద్ధంగా ఆ సమయానికి బతాలిక్‌లోను, కార్గిల్ లోను మూడవ దశలోకి ప్రవేశించిన యుద్ధం ఇంకా కొనసాగుతోంది ఉపసంహరణ ప్రారంభం కావడానికి కొద్ది రోజుల ముందే అధికారులు యుద్ధం చాలా కాలం పాటు జరగడం అనివార్యమని ప్రధాన ప్రచార మాధ్యమాలకు పదే పదే చెప్పడం గమనార్హం

"సైన్యం ముందుకు సాగుతున్నప్పటికీ పురోగతి చాలా మందకొడిగా వుంది 31 స్థావరాలలో పన్నెండింటిని స్వాధీనం చేసుకోగలిగినప్పటికీ శత్రువు తిరిగి కొత్త స్థావరాలు ఏర్పరుచుకున్నాడని హెడ్ క్వార్టర్స్‌లోని సీనియర్ సైన్యాధికారి ఒకరు తెలిపారు 'టైగర్ హిల్ టోల్‌లింగ్‌లలో మాదే పైచేయి అయ్యింది కాని కక్సార్ బతాలిక్ రంగాలలో కొత్త శత్రు స్థావరాలు పుట్టుకొచ్చాయి దీన్ని బట్టి చూస్తే పోరు చాలా కాలం సాగవచ్చుననీ, మృతుల సంఖ్య కూడా పెరగగలదనీ అనిపిస్తోంది అన్నారాయన సెప్టెంబరులో శీతాకాలం మొదలై ఆ ప్రాంతమంతా మంచుతో కప్పడిపోయేలోగా శత్రువును తరిమి వెయ్యాలంటే సైనిక చర్యలు ముమ్మరం చెయ్యక

తప్పదన్నది ప్రత్యక్షంగా యుద్ధరంగంలో పాల్గొంటున్న సైనికాధికారులు ఇచ్చిన సమాచారం [10]

పాక్ ఉపసంహరణ ప్రారంభం కానున్న తరుణంలో మరి కొందరు అధికారులు కూడా ఇదే విధంగా స్పందించారు చొరబాటుదారులను తరిమి గొట్టడానికి సెప్టెంబరు వరకూ పట్టవచ్చని రక్షణ మంత్రి జార్జి ఫెర్నాండేజ్ చెప్పిన దానిలో అతిశయోక్తి ఏమీ లేదు నిజానికి అందుకు కనీసం అంత వ్యవధి అవసరం ద్రాస్ సబ్ సెక్టారులో టిలో లింగ్‌ను స్వాధీనం చేసుకోవడం తదితర విజయాలు సాధించినది వాస్తవమే కాని సైన్యం కాస్తో కూస్తో పురోగతి సాధించినది ద్రాస్ సెక్టార్‌లోనే తిరిగి స్వాధీన పరుచుకోవలసిన ప్రాంతాలు మరో 20 30 వరకు వుంటాయని కార్గిల్ చర్చల్లో పాల్గొన్న బ్రిగేడియర్ ఒకరు చెప్పారు [11]

ఈ రకమైన అభిప్రాయాలు కలిగించిన సాక్ష్యాధారాలపై ఇంకేవిధమైన భావానికి అస్కారం లేకుండా పోయింది జుబార్ నుంచి వెనక్కి తగ్గుతున్న పాక్ దళాలు నియంత్రణ రేఖకు కిలో మీటరు లోపలనే 5121 5327గా వ్యవహరించే శిఖరాల వద్ద పునరేకీకృతమైన మొహరించ సాగాయి వీటిపై దాడికి దిగివుంటే భారత్ భారీ మూల్యం చెల్లించవలసి వచ్చేది యాల్డోర్‌కు తూర్పుగా 5065 మీ ఎత్తైన ముంథోదాలో శిఖరం వుంది బతాలిక్ సెక్టారులో పాక్ సైనికులకు ఇది ప్రధాన సరఫరా కేంద్రం ముంథోదాలో పై దాదాపు జూలై 9 వరకు నిర్విరామంగా బాంబు దాడులు కొనసాగుతూనే వున్నప్పటికీ దానిని పూర్తిగా ఆక్రమించుకునేందుకు ఇంతే సమయం అవసరమైంది ముంథోదాలో నుంచి పాక్ ఉపసంహరించుకుని వున్నట్లయితే భారత సైన్యం దాదాపుగా ఎలాంటి ప్రతిఘటన లేకుండా ఆ ప్రాంతాన్ని తిరిగి ఆక్రమించుకునే వీలు కలిగేది 5123 5327 శిఖరాల దగ్గర తిరిగి సమీకృతమవుతున్న పాక్ దళాలు ఎదురు దాడులు జరిపిన దాఖలాలేవీ లేవు

ద్రాస్ నుంచి పాక్ దళాలు వైదొలగడం వల్ల టైగర్ హిల్స్ శ్రేణిలో అనేక చోట్ల తీవ్ర నష్టం కలిగించగల చిన్న చిన్న సంఘర్షణలు జరిగే ముప్పు తప్పింది ఉపసంహరణ వరకు టైగర్ హిల్స్ పశ్చిమ పార్శ్వంలో చెక్కుచెదరకుండా పాక్ స్థావరం ఒకటి వుంటే 5163 4875 శిఖరాలపైనే ఎదురు దాడులు జరుగుతూనే వున్నాయి ఆసక్తికరమైన విషయమేమంటే టైగర్ హిల్ ప్రాంతానికి జూలై 8వరకు పాకిస్తాన్ అదనపు సైనిక బలగాల్ని పంపుతూనే వున్నట్లు కనబడుతుంది ఆ రోజునే ఇద్దరు పాక్ సైనికులు 12 నార్త్ లైట్ ఇన్‌ఫాంట్రీకి చెందిన కెప్టెన్ ఇంతియాజ్ మాలిక్, 165 మోర్టార్ రెజిమెంటుకు చెందిన కెప్టెన్ కర్నాల్ షేర్‌ల మృతదేహాలు లభ్యమయినట్టు తెలియ

వచ్చింది తమ సైనికులు ఎవరూ అక్కడ లేనేలేరన్న పాకిస్తాన్ బుకాయింపులలో పస లేదని ఎప్పుడో తేలిపోయింది అంత త్వరలో పాక్ ఉపసంహరణ జరగడం మార్పోలా వంటి స్థలాలను భారతదేశం తిరిగి ఆక్రమించుకుందుకు అనుకూలించిందనడంలో సందేహం లేదు మార్పోలా స్వాధీనమైందని సైన్యం ప్రకటించడానికి కొన్ని వారాల పూర్వమే అక్కడి స్థావరాలను భారత సైనికులు ఆక్రమించుకున్నారని అధికారుల సంతకంతో వున్న ఒక పత్రం ఢంకా బజాయించి చెప్పడం విచిత్రం [12]

పాకిస్తాన్ దళాల ఉపసంహరణ ప్రభావం ముష్కోలోయ కక్సార్‌ల పైనే అధికంగా వుంది జూలై 7న లోయ దిగువకు దాడి ప్రారంభమై మర్నాటికి 23 మంది సైనికులు చనిపోయారు తరువాత కూడా మరి కొందరు చనిపోయినట్లు వార్తలందాయి ముష్కోలోయకు ఎగువన 4342 శిఖరం నుంచి ప్రవహించే మున్‌ధాంగ్ వాగు వెంబడి జరిగిన పోరే అతి భయంకరమైనది ఇక్కడి నుంచి నియంత్రణ రేఖకు దూరం సరళ రేఖలో ఐదారు కిలోమీటర్లు వుంటుంది ఆ ప్రాంతంలో పాకిస్తాన్ సైనికులు అధిక సంఖ్యలో స్థావరాలు ఏర్పరుచుకుని వుండే అవకాశం లేదు ముష్కో లోయకు ఉత్తరాన గల మంచు ప్రవాహాల వల్ల అక్కడి అత్యల్ప ఉష్ణోగ్రతల్ని ఎక్కువ కాలం భరించడం కష్టం టైగర్ హిల్ పైన పీక్ 5100 పైన పాక్ ఎదురు దాడులు జరపడం ముష్కో లోని తమ స్థావరాలపై పెరుగుతున్న ఒత్తిడిని తగ్గించడానికేననిపిస్తుంది

కక్సార్‌లో కూడా సంకుల సమరం తప్పని పరిస్థితి కక్సార్ వాగుపై ఆధిపత్యం కల్పించే భజరంగ్ స్థావరాన్ని పీక్ 5299ని పాక్ దళాలు ఆక్రమించి వున్నాయి వాటిని స్వాధీనం చేసుకునేందుకు భారత సైన్యం జరిపిన దాడులను ఆ దళాలు మూడు సార్లు విఫలం చేసాయి జూలై ఆరున భారీ ఎత్తున ఆరంభించిన దాడి కూడా పాక్ ఉపసంహరణ వరకు చెప్పుకోదగ్గ ఫలితాల నివ్వలేదు పక్షం రోజుల కిందటే భారత-పాక్ దళాల మధ్య బాహా బాహీ యుద్ధం జరుగుతున్న సమయంలోనే పాకిస్తాన్ అదనపు బలగాన్ని పంపి తన స్థావరాల్ని బలోపేతం చేయగలిగింది పీక్ 5299ని భారత్‌కు చెందిన చివరి స్థావరం భజరంగ్ పోస్టును చేరడానికి దారి నియంత్రణ రేఖకు అవతల నుంచి వున్నందున పరిమితి స్థాయిలోనైనా నియంత్రణరేఖ దాటి దాడులు నిర్వహించడానికి అనుమతించ వలసిందిగా అధికారులు ఢిల్లీని ప్రాధేయపడుతూనే వచ్చారు లేదంటే ప్రాణాలకు తెగించి కొండపైకి వరుస దాడులు జరపాలి అలాచేస్తే చాలామంది సైనికులు చనిపోవడం ఖాయం

ఆ దృష్ట్యా కార్గిల్ యుద్ధం రక్తపాతంతో ముగియకుండా పాక్ ఉపసంహరణ

తోడ్పడింది  జూలై 11న జాతీయ రక్షణ విషయాల సలహాదారు బ్రజేష్ మిశ్రా కక్సార్ ముష్కో సబ్ సెక్టార్లలో ఉపసంహరణ ఆరంభమైనట్లుగా ఆధారాలు లభించాయని చెప్పారు  అంతేకాదు నియంత్రణ రేఖ దగ్గర వారం రోజుల్లో యధా పూర్వ స్థితి నెలకొంటుందని ఆశాభావం ఆయన వ్యక్తం చేశాం [13]

రెండు రోజుల తరువాత మే నెలలో కక్సార్ ప్రాంతానికి గస్తీకని వెళ్ళి ఆచూకి తెలియకుండా పోయిన లెఫ్టినెంట్ అమిత్ భట్టాచార్య మరో ఐదుగురు సైనికుల మృత దేహాలను కనుగొన్నారు  ఒక వార్తా పత్రిక మీదికి వస్తున్న భారత సైనికులను ఎదుర్కోలేక పాక్ చొరబాటుదార్లు వెనక్కు తగ్గిన తరువాతనే' భరద్వాజ దేహం లభించినట్లు వర్ణించింది [14]

ఉపసంహరణకు భారత సైనికుల విజయం కన్నా అమెరికా నుంచి వచ్చిన ఒత్తిడి కారణం కాదనే ప్రస్తావన ఎక్కడా లేదు

జూలై 23న కూడా మార్పోలా ముంధోదాలో షాంగ్రూటి స్థానాల్లో నియంత్రణ రేఖ వద్ద పోరాటం జరుగుతున్నట్లు ప్రధాన ప్రసార మాధ్యమాలన్నీ తెలియ జేసాయి [15] మొదటిసారి ఇరుపక్షాలు కాల్పులు జరుపుకున్నది ఇక్కడే ఇప్పుడే! నియంత్రణ రేఖపై కీలక స్థానాలకు భారత సేనలు జూలై మూడవ వారంలోఉపసంహరణ జరిగిన అనంతరం చేరుకోగలిగాయని ఇది సూచిస్తోంది  ఈ ప్రాంతాల్లో నిర్విరామ పోరాటాలు కొనసాగాయి  మార్పోలా వద్ద ఐదుగురు పాకిస్తాన్ సైనికులను కనుగొన్నారు  పాకిస్తాన్ ఆ ప్రాంతాన్ని అంటిపెట్టుకుని వుండే ప్రయత్నం చేస్తోందని భారత సైన్యాధికారులు జూలై 30న పేర్కొన్నారు  బలప్రయోగంతోనైనా నియంత్రణ రేఖను మార్చాలని కోరారు  ముష్కో లోయలో పోరాటాలు గురించి అడపా తడపా ఆర్టిలరీ కాల్పుల్లో సైనికులు చనిపోతుండడం గురించి వార్తలు అందుతూనే వున్నాయి  పాక్ సైనికులు చొరబాటుదారుల ఉపసంహరణ అనంతరం నియంత్రణ రేఖపై నున్న భారత సైనిక స్థావరాలను పటిష్ట పరచడానికి 15రోజులు పట్టింది  కనుక యుద్ధం కొనసాగిస్తే ఎంత వ్యయమయ్యేదో ఎంత కాలం పట్టేదో వేరే చెప్పనక్కర లేదు

పాక్ ఉపసంహరణ సమయానికి వున్న వాస్తవ పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని చూస్తే బేషరతు విజయం సాధించినట్టు ప్రకటనలు చేయడం సమసాటిక సమయంలో భారత సైన్యం ముందుకు చొచ్చుకు పోయిన మాట  పాక్ దళాలు, చొరబాటుదారులు చాలా మంది మరణించారనే మాట నిజమే కాని చాలా పోరాటం ఇంకా మిగిలేవుందనేది మరింత వాస్తవం  ఉపసంహరణ వల్ల భారత దేశానికి ఆర్థిక ప్రాణ నష్టాలు తప్పిపోయాయి  కాని అందువల్ల బేషరుతుగా సైనిక విజయానికి బదులు

సమస్యాత్మకమైన సంక్లిష్ట పరిస్థితి ఉత్పన్నమైందని నా వాదన ఉపసంహారణలో ఇమిడి వున్న షరతులు వాటి స్వరూప స్వభావాలే అందుకు కారణం బి జె పి ప్రభుత్వం ప్రకటించినట్లు కార్గిల్ యుద్ధం విజయోత్సాహంతో ముగియలేదు జమ్ము-కాశ్మీర్ భవిష్యత్తుకు సంబంధించిన విస్తృత ఘర్షణ విరామ చిహ్నంగా కోల్పోయిన సైనికుల ప్రాణాలు ఆర్థిక వ్యయం స్వల్ప కాలిక నష్టాలు కాగా దీర్ఘ కాలికంగా జమ్ము కాశ్మీరు ప్రజలు తరతరాలుగా ఈ విజయానికి మూల్యం చెల్లించ వలసి వుంటుంది

అమెరికా దక్షిణాసియా మొత్తాన్ని ముక్కలు చేసే ప్రయత్నంలో వుంది భవిష్యత్తులో ఆ ప్రక్రియను ఎదుర్కోవలసి రావడమే జమ్ము-కాశ్మీర్ ప్రజలు ప్రస్తుత విజయానికి చెల్లించవలసిన మూల్యం ఈ రకమైన వ్యూహానికి భారత ప్రభుత్వం ఇష్టపూర్వకంగా ఇమిడికోవడం దురదృష్టకరం

# రణరంగానికి ఆవల యుద్ధం: పడక కుర్చీ పటాలం

చొరబాటుదారులు క్షేమంగా వెనక్కి మళ్లే అవకాశం కల్పించడాన్ని పరిశీలించడం గురించి మొదట్లో రక్షణ మంత్రి మాట్లాడారు అప్పుడాయన మాటల్ని గేలిచేసి తిరస్కరించినా ప్రస్తుతం జరుగుతున్నది అదే ఎవరేమి చెప్పినా ఖచ్చితంగా అది కాల్పుల విరమణే చొరబాటుదారులను క్షేమంగా వెనకకు పోనివ్వడమే!

**మాజీ ప్రధాని చంద్రశేఖర్**

కార్గిల్ కొండల్లో పోరాడింది సైనికులు కాని ఆ యుద్ధానికి ముగింపు పలికింది వారు కాదు ఆ కొండల్లో సైనికులు ప్రాణాలు కోల్పోతున్న సమయంలో కుర్చీల్లో సుఖంగా ఆసీనులై వున్న బి జె పి కి చెందిన దౌత్య విధానకర్తలు రక్షణ వ్యవస్థ ప్రతినిధులు పాకిస్తాన్‌కు చెందిన దౌత్య రక్షణ వ్యవస్థల ప్రతినిధులు అమెరికా విధాన రూపకర్తల పటాలాలు చర్చలు ప్రారంభించాయి కుర్చీల్లో కూర్చొని నిర్వహించిన ఈ తతంగాన్ని కార్గిల్లో సైనిక చర్య కన్నా ఘన విజయంగా చాటుకున్నారు కాని దానివల్ల కలిగిన పరిణామాలు వినాశకరంగా వున్నాయి ఈ వైఫల్యం వల్ల అర్ధ దశాబ్దంగా జమ్మూ-కాశ్మీర్‌లో అమెరికా జోక్యాన్ని అడ్డుకునేందుకు భారతదేశం చేస్తున్న ప్రయత్నం వ్యర్ధమైంది ఆ జోక్యానికి మార్గం సుగమమయింది

**ఫీల్డ్ మార్షల్ జార్జి ఫెర్నాండెజ్**

1998 వసంత కాలంలో సియాచిన్ పర్వతాలపై యుద్ధ దుస్తుల్లో రక్షణ మంత్రి జార్జిఫెర్నాండెజ్ కొత్త అవతారంలో కనిపించారు ఎంతో జాగ్రత్తగా రూపొందించుకున్న ఆ చిత్తరువుకు టి వి ప్రాచుర్యం కల్పించింది జాతీయతా వాదంతో జబ్బలు చరుస్తున్న కొత్త ప్రభుత్వం రక్షణ విధానానికి ఆయన సరైన ప్రతీక తన పాత్రకి పూర్తి న్యాయం చేకూరుస్తూ సైనికుల్లో నైతిక స్థైర్యం పెంపొందించేందుకు సరిహద్దు ప్రాంతాలను ఆయన సందర్శించారు అధికారులను శంకరగిరి మాన్యాలు పట్టించారు అది చాలక గుర్రం ఎక్కి శూలం ఎత్తి పట్టి ఇండియా భద్రతకు చైనా ముప్పుగా తయారయిందని ఆరోపణలు లంకించుకున్నారు కార్గిల్ యుద్ధ సమయంలో ఫెర్నాండెజ్ చేసిన దుష్ట వ్యాఖ్యలు మే నెల ప్రారంభంలో మొదలైన యుద్ధం భారత రక్షణ వ్యవస్థని ఆశ్చర్యంతో ముంచెత్తిందనడానికి నిదర్శనం లెఫ్టినెంట్ కాలియా గస్తీ బృందం జాడ తెలియకుండా పోయిన భారత వేగు బృందాలకి అడుగడుగునా పాకిస్తాన్ స్థావరాలు కానవచ్చిన మే 14వ తేదీనాడే జార్జి ఫెర్నాండెజ్ లడఖ్ అటానమస్ హిల్ డెవలప్‌మెంట్ కౌన్సిల్ సమావేశంలో పాల్గొనడానికి లెహ్ సందర్శించారు కార్గిల్‌లో శత్రువు గుళ్ళవర్షం

కురిపించడాన్ని ఫెర్నాండెజ్ చెదురు మదురు సంఘటనగా కొట్టి పారేశారు 121 బ్రిగేడ్‌కు చెందిన మందుగుండు నిల్వలు ఇంకా ఎన్నో రక్షణ స్థావరాలను ధ్వంసం చేసిన అంతటి తీవ్రమైన దాడిని ఆయన విచిత్రమైన రీతిలో చెదురుమదురు ఘటనగా అభివర్ణించారు భారత సైన్యం ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కోవడానికి సర్వసన్నద్ధంగా వుందని ఫెర్నాండెజ్ అన్నారు ఆ మర్నాడు ఫెర్నాండెజ్ ఢిల్లీలో మాట్లాడుతూ చొరబాటుదారులను 48 గంటలలో తరిమి వేస్తామని హామీ ఇచ్చారు ఒక రోజు తరువాత ఆ (కార్గిల్) ప్రాంతాన్ని భారత సైన్యం చుట్టుముట్టిందని రెండు రోజులలో అనుకున్న లక్ష్యాలను సాధించగలదని ఫెర్నాండెజ్ చెప్పినట్లుగా ధన్‌బాద్ నుంచి యు ఎన్ ఐ వార్తా సంస్థ వార్త పంపింది భారత అదనపు సైనిక బలగాలని అక్కడికి పంపుతున్న సమయంలోనే ఈ ప్రకటన వెలువడడం గమనార్హం రక్షణమంత్రి వ్యాఖ్యలకు విశాల హృదయంతో వివరణ ఇచ్చుకోవాలంటే వాటిని నైతిక స్థైర్యాన్ని పెంపొందించేందుకు కల్పించిన అబద్ధాలుగా భావించుకోవాలి కాదంటే ఉన్నత సైనికాధికారులు వాస్తవ పరిస్థితుల గురించి ఫెర్నాండెజ్‌ను తప్పు దోవ పట్టించారనైనా అనుకోవాలి అది నమ్మ శక్యం కాదు అంత తీవ్రమైన నేరానికి ఇంతవరకు ఎవరిని శిక్షించకపోవడాన్ని బట్టిచూస్తే అలాటిదేమీ జరిగి వుండకపోవచ్చు ఇక మిగిలిన ఒకే ఒక్క కారణం ఫెర్నాండెజ్ గాని రక్షణ మంత్రిత్వ శాఖ గాని జరిగినదేమిటో తెలుసుకునేందుకు చిత్తశుద్ధితో ప్రయత్నించలేదు వీరే కాదు బి జె పి సంకీర్ణ ప్రభుత్వంలోని వారెవరూ కూడా అందుకు ప్రయత్నించ లేదని ఇప్పుడు విశదమవుతోంది జమ్మూ–కాశ్మీర్ ముఖ్యమంత్రి ఫరూక్ అబ్దుల్లా ఢిల్లీ వచ్చి కార్గిల్ పరిస్థితిని తీవ్రంగా పరిగణించాలని ప్రధానిని అభ్యర్థించే వరకు ఈ విషయాన్ని ఎవరూ పట్టించుకోలేదు ఆ మరునాడు మే 25నగానీ రక్షణ వ్యవహారాలపై ఉన్నత స్థాయి మంత్రివర్గ సంఘ సమావేశం జరగనే లేదు సమావేశం జరిగాకనే ప్రధాని 'లాహర్‌మత్తు' నుంచి బయట పడి కార్గిల్‌లో యుద్ధ వాతవరణం నెలకొని వుందని గ్రహించారు కాని అప్పటికి 50 మందికి పైగా సైనికులు మృతిచెందారు

అప్పుడికి ఫెర్నాండెజ్ తన మంత్రిత్వశాఖ రక్షణ సంస్థల తప్పిదాలను కప్పిపుచ్చే ప్రయత్నాలు ఆరంభించారు మే నెల 29న భారత సైన్యం ద్రాస్ సబ్‌సెక్టారు నుంచి చొరబాటు దార్లను తరిమివేసి నియంత్రణ రేఖవద్ద యధాపూర్వ స్థితిని నెలకొలిపిందని ఆయన ప్రకటించారు ఇది పచ్చి అబద్ధం ఆ సమయానికి భారత సైనికులు టోలోలింగ్ కొండల మాట అటుంచి దిగువనున్న టైగర్ హిల్ ప్రాంతానికే చేరలేదని ఇపుడు నిశ్చయంగా తెలుస్తోంది పాక్ సైన్యం ఉపసంహరించుకున్నాక గాని భారతసైన్యానికి

సరిహద్దులో అతికీలకమైన భారతీయ స్థావరం మార్పొలోని చేరుకోవడం సాధ్యపడలేదు లాహోర్ వ్యవహారాలను ప్రభుత్వం నిర్వహించిన తీరును కూడా ఫెర్నాండెజ్ సమర్థించే ప్రయత్నం చేసారు ఆ చర్యల్లో భాగస్వామి అయిన నవాజ్ షరీఫ్‌ను నిర్దోషిగా నిరూపించడానికి ప్రయత్నించారు టెలివిజన్‌లో మాట్లాడుతూ 'ఈ వ్యవహారంలో సూత్రధారి నవాజ్ షరీఫ్ ప్రభుత్వానికి ప్రధాన పాత్ర లేదు చొరబాటు దార్లను పంపడం పాకిస్తాన్ సైన్య కుతంత్రం ఇటువంటి చర్యలను ప్రోత్సహించేదిగా పేరు పొందిన ఐ ఎస్ ఐకి కూడా ఇందులో ప్రమేయం లేదు అని సెలవిచ్చారు

కార్గిల్ విషయంలో తాను వ్యవహరిస్తున్న తీరుపై విమర్శలు పెరిగేకొద్ది ప్రభుత్వం మరింత గందరగోళంలో పడింది పాక్ సైనికులు, చొరబాటుదార్లకు నియంత్రణ రేఖ ఆవలకు క్షేమంగా తిరిగి పోయేందుకు అవకాశమిస్తామని జూన్ ఒకటవ తేదీన ఫెర్నాండెజ్ చేసిన ప్రతి పాదన తదనంతర దౌత్యక్రమాన్ని ఎంతో ప్రభావితం చేసింది ఒక వంక 'మా భూభాగం నుంచి మీ సేనలని ఉపసంహరించండి లేదా మేమే గెంటివెయ్య వలసి వస్తుందని గర్జిస్తూ మరోవంక పాకిస్తాన్ విదేశాంగ మంత్రి సర్తార్ అజీజ్ ఉపసంహరణ ఎలా జరగాలన్న అంశం చర్చించదలిస్తే 'వారు సురక్షితంగా తిరిగి వెళ్లడం గురించి చర్చించ వచ్చు' అని చెప్పారు ఫెర్నాండెజ్ ప్రకటనలు రేపిన కల్లోలం గురించి ప్రధానికి తెలియనట్లు కనబడుతోంది ఎందుకంటే జూన్ రెండున ముంబాయిలో ఐఎన్‌ఎస్ మైసూరుకు ప్రారంభోత్సం జరుపుతూ వాజ్‌పేయి అదేవైఖరిని కొనసాగించారు అలాంటి అభ్యర్థన వస్తేవారు సురక్షితంగా వెనుదిరిగే విషయం చర్చించవచ్చు దాన్ని పరిశీలిస్తాం' అన్నారు

అలాంటి ప్రకటనలు చేయలేదని తరువాత ఖండనలు వచ్చినప్పటికీ వాటివల్ల ఒక ప్రయోజనం సిద్ధించింది లాహోర్ ప్రక్రియ శుష్కమైందని కార్గిల్‌లో యుద్ధవాతావరణం నిర్వివాదంగా తేల్చి చెప్పిన సమయంలో దానిని రాజకీయంగా సమర్థించుకునేందుకు ఈ ప్రకటనలు అవకాశాన్ని కల్పించాయి దీనివల్ల సైన్యపరంగా ఎర్పడే పరిణామాలు తీవ్రంగా వుంటాయి చొరబాటుదారులకు ప్రమాదం లేకుండా తప్పించుకు పోయే అవకాశం కల్పిచడంపై ఫెర్నాండెజ్ చేసిన ప్రకటనలో ఆంతర్యం సాయుధ ఘర్షణకు దౌత్యపరమైన పరిష్కారం సాధించటం కాదు అపఖ్యాతి పాలైన పాకిస్తాన్ ప్రభుత్వ విధానాన్ని ఒడ్డున పడేసే ప్రయత్నం అది ప్రధాని వాజ్‌పేయి బస్సు యాత్రకి పవిత్ర సిద్ధాంతస్థాయి కల్పించడం సైనిక విధానాలని ప్రభావితం చేసింది పోఖరన్-2 తరువాత నెలకొన్న వాస్తవ పరిస్థితుల నేపథ్యంలోనే సాంప్రదాయిక రీతిలో ఒక పరిమితమైన ఒప్పందం కోసం పాకిసాన్ ప్రయత్నించే అవకాశాన్ని చేజార్చింది

## యుద్ధానికి సిద్ధంగాని ఆర్మీ జనరళ్ళు

సైనిక యంత్రాంగంలో కొందరు ఆయనకు చెబుతూ వచ్చిన అంశాల మీద ఆధారపడి ఫెర్నాండెజ్ అలాంటి ప్రకటనలు చేసారనడం న్యాయంగా వుంటుంది బతాలిక్ సెక్టారులో పాకిస్తాన్ చొరబాటు మొదటిసారి వెలుగులోనికి వచ్చిన 15 రోజులకు అంటే 1999 మే 19న శ్రీనగర్‌లో మధ్యాహ్న 12 గంటలకు యూనిఫైడ్ హెడ్ క్వార్టర్స్ సమావేశం జరిగింది కార్గిల్‌లో చొరబాటు ఫలితంగా భద్రత విషయంలో తలెత్తిన అత్యవసర పరిస్థితి గురించి చర్చించడానికి ఏర్పాటయిన తొలి అధికారిక సమావేశం ఇది జమ్మూ కాశ్మీర్‌లో పనిచేసే భద్రత విభాగాలన్నిటికి పైన యూనిఫైడ్ హెడ్ క్వార్టర్స్ సమన్వయ కర్తగా వ్యవహరిస్తుంది దీనికి ముఖ్యమంత్రి అధ్యక్షుడు ఆయనకి రక్షణ విషయాల సలహాదారుగా 15 కార్ప్సు కమాండర్ వుండడం సంప్రదాయం ముఖ్యమంత్రి లేనపుడు ఈయన యు హెచ్ క్యూ కి అధ్యక్షుడిగా వ్యవహరిస్తారు చర్చల్లో ఆయన కీలక పాత్రధారి ఈ సమావేశంలో చర్చ కొచ్చిన అంశాలను వెల్లడించడం వల్ల కార్గిల్ కొండల్లో 400 మందికి పైగా సైనికులు ఎందుకు చనిపోయారో తెలిసే అంశాలు చాలావరకు అర్థమవుతాయి

శ్రీ నగర్‌లోని అన్ని భద్రతా వ్యవస్థల ప్రతినిధులు హాజరవడాన్ని బట్టి ఆ సమావేశం సాధారణమయింది కాదని అర్థమవుతోంది ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లాతో పాటు హోంశాఖ సహాయమంత్రి ముస్తాక్ అహ్మద్‌లోన్ ప్రధాన కార్యదర్శి అశోక్ జైట్లీ,ప్రిన్సిపల్ సెక్రటరీ బి ఆర్ సింగ్ ఇతర అధికారులు కూడా అందులో పాల్గొన్నారు సరిహద్దు భద్రతా దళం (బిఎస్‌పి) నుంచి ఇద్దరు ఇన్‌స్పెక్టర్ జనరళ్ళు ఇండో టిబెటన్ బోర్డర్ పోలీసుల నుంచి ఇద్దరు డిప్యూటి ఇన్‌స్పెక్టర్ జనరళ్లు సెంట్రల్ రిజర్వు పోలీసు దళం నుంచి ఒక డిప్యూటి ఇన్‌స్పెక్టర్ జనరల్ ఒక అదనపు డిప్యూటి ఇన్‌స్పెక్టర్ జనరల్ సమావేశానికి వచ్చారు పోలీస్ డైరెక్టర్ జనరల్ గురుచరణ్ సింగ్ జగత్ నేతృత్వంలో అదనపు డైరెక్టర్ జనరల్ ఆర్ టికూ ముగ్గురు ఇన్‌స్పెక్టర్ జనరళ్లు ఒక సీనియర్ పోలీస్ సూపరింటెండెంట్ వచ్చారు ఇంకా ఇంటెలిజెన్స్ బ్యూరో జాయింట్ డైరెక్టర్ రిసెర్చి ఎండ్ ఎనాలిసిస్ వింగ్ కమిషనర్ డిప్యూటి కమిషనరు కూడా పాల్గొన్నారు

15వ కార్ప్సు బ్రిగేడియర్ జనరల్ స్టాఫ్ ఎ కె చోప్రా కార్గిల్ సంఘటనల గురించి క్లుప్తంగా వివరించి సమావేశాన్ని ప్రారంభించారు ఆ వివరాలు 'మినిట్స్‌లో నమోదు కాలేదు కార్గిల్ సెక్టారులో చొరబాటుదారుల ఉనికిని గురించిన ఆ వివరణ రేఖామాత్రంగా క్లుప్తంగా వున్నట్లు సమావేశంలో పాల్గొన్న అధికారులు చెబుతున్నారు

తరువాత 15వ కార్ప్స్ కమాండర్ పాల్ మాట్లాడుతూ ఆరు అంశాలు ప్రస్తావించారు మొదటిరెండు సాధారణమైనవి చొరబాటు జరిగిన ప్రాంతాలు ఎంతో ఎత్తున దుర్భరమైన వాతావరణ పరిస్థితులు దుర్గమమైన వాతావరణంలోనివి అవి భారత్ పాకిస్తాన్ రెండిటి ఆధీనంలో లేనివి ఇరుపక్షాలు విమాన సర్వేలు గస్తీచర్యల ద్వారానే ఆధిపత్యంచలాయిస్తాయి' అధిపత్యం అటుపైన ఆయన వివిధ సబ్‌సెక్టార్లలో చొరబాటు జరిగిన క్రమాన్ని సైన్యం ప్రతిక్రియలను వివరించారు గస్తీదళాలు విమానాల సర్వే ద్వారా అధిపత్యం 'అనే ప్రకటన నెవరూ ప్రశ్నించక పోవడం విచిత్రం యు హెచ్ క్యూ సమావేశంలో పాల్గొన్నవారెవరూ అలాంటి ప్రదేశంలోకి వేల సంఖ్యలో చొరబాటు దారులెలా వచ్చారో అడగడం అవసరమని అనుకోలేదు

పాల్ ఆపైన మరో నాలుగు అసంబద్ధమైన ప్రకటనలు చేసారు విద్రోహ కార్యకలాపాల అణచివేతకు ఉద్దేశించిన కార్యక్రమాలకోసం కార్గిల్‌కు సైన్యం తరలింపు వల్ల ఎలాంటి అంతరాయం కలగలేదని పైగా లోయలో సైన్యం మొహరింపు పూర్తిగా సమతూకం కలిగివుందని నొక్కి చెప్పారు జమ్ము-కాశ్మీరులో విధులు నిర్వహిస్తున్న సైనిక దళాలను సరిహద్దుల్లోకి తరలించారు అందువల్ల విద్రోహచర్యలను నెదుర్కొనేందుకు ఏర్పాటు చేసిన వ్యవస్థకు తూట్లుపడడంపై ఆందోళన చెందుతున్న భద్రతా అధికారులను శాంతింపచేయడానికే ఈ వ్యాఖ్యలు చేసి వుండవచ్చు కార్గిల్ సంఘటనలవల్ల జమ్మూ-కాశ్మీర్‌లో భద్రతా విధులు నిర్వర్తిస్తున్న దళాలు భారీ సంఖ్యలో తరలిపోతాయని సైనికాధికారులు ఊహించలేక పోయారని పాల్ వ్యాఖ్యలు రుజువు చేస్తున్నాయి ఇది చాలా పెద్ద పొరబాటు కార్గిల్ యుద్ధం ముగిసేనాటికి కార్గిల్‌కు తరలిపోయిన దళాల స్థానంలో సరిహద్దుల రక్షణ కోసం 58 బెటాలియన్లను పంపవలసి వచ్చింది ఇంతకన్న పెద్ద పొరపాటే ఈ పొరపాటు? కారణం ఎకంగా సమావేశం మినిట్లలో 4 (iజ) పేరాలో 'పాకిస్తాన్ వైపు దళాల దట్టమైన మొహరింపు లేదు యుద్ధం లేదా పరిమిత స్థాయిలో ఘర్షణలు జరిగే సూచనలు కూడా లేవు' అని పాల్ చెప్పారు ఈ వ్యాఖ్యల్లో వాడిన భాష రెండు విషయాలను స్పష్టం చేస్తోంది మొదటిది నార్తరన్ లైట్ ఇన్‌ఫాంట్రి, గిల్‌గిత్ స్కౌట్స్ నుంచి సమీకరించిన పాకిస్తాన్ సైన్యం ఆ సరికే సరిహద్దుల్లో మోహరించి భారత భూభాగంలోకి సైనికులని పంపుతున్న విషయం భారత సైన్యం గుర్తించలేకపోయింది స్పెషల్ సర్వీసెస్ గ్రూపుకు చెందిన విభాగాలతో సహా 10కి పైగా బెటాలియన్లను పాకిస్తాన్ కార్గిల్ యుద్ధంలో దించిందని పాల్ స్వయంగా చెప్పినట్లు రికార్డుల్లో వుంది పాకిస్తాన్ సైన్యం కదలికలకు సంబంధించిన ఎంతో సమాచారం లభ్యమవుతున్నా సైన్యం దాన్ని పరిగణించలేదన్నది సుస్పష్టం

కార్గిల్లో చొరబాటును సాంప్రదాయిక సాయుధ సంఘర్షణగా పరిగణించలేదని 'మినిట్స్' తెలుపుతున్నాయి ఇది మరొక తీవ్రమైన తప్పిదం' 'యుద్ధం గాని చిన్ని చిన్న సంఘర్షణలుగాని జరిగే సూచనలు లేవన్న పాల్ వ్యాఖ్యలు ఎంత అసంబద్ధమైనవో ఇప్పుడు తెలుస్తుంది కార్గిల్ సెక్టారులో పశ్చిమాన ముష్కోలోయనుంచి తూర్పున టర్టోక్ వరకు భారీ ఎత్తున ఫిరంగులతో పరస్పరం జరుపుతున్న కాల్పులని తరచు జరిగే పరస్పర కాల్పులుగా భావించి పొరబడి వుండాలి ఆ సమయంలోనే నియంత్రణ రేఖ వద్ద భారత సైన్యం నుంచి భారీగా ప్రతి క్రియ ఆరంభం కావచ్చని ఊహించిన పాకిస్తాన్ కార్గిల్లోనికి పూర్తి బ్రిగేడ్లనే దింపడం ఆరంభించింది భారత్ కూడా ఇలాంటి పరిస్థితులకు సన్నద్ధంగా వుండాలి కాని కార్గిల్ సంఘర్షణ ఎక్కడికి దారి తీస్తుందనే విషయంలో సైన్యానికి కొంచెంకూడా అవగాహన లేదు తొలిదశలో కార్గిల్ సంఘటనల పట్ల భారత్ స్పందన ఎంత అస్తవ్యస్తంగా దిక్కుతోచని స్థితిలో వుందో UHQ నివేదిక వెల్లడిస్తుంది

కార్గిల్లో చొరబాటును సులభంగా అరికట్టువచ్చునన్న తన సిద్ధాంతాన్ని విడిచిపెట్టకుండా పాల్ పరిస్థితి స్థానికమైంది ఆ స్థాయిలోనే పరిష్కారమవుతుంద ని చెబుతూ వచ్చారు పరిస్థితి అదుపులోనికి రావడానికి జమ్ము-కాశ్మీర్కు వెలుపల నుంచి కనీసం ఐదు బ్రిగేడ్ల సైనికుల్ని రప్పించాల్సి వచ్చింది అందువల్ల UHQ సమావేశంలో పాల్ చేసిన వ్యాఖ్యలు పూర్తి అవగాహనా రాహిత్యాన్ని సూచిస్తాయి 15 కార్ప్స్ కమాండరుకి శ్రీనగర్ – లెహ్ రహదారిపై తరలిస్తున్న దళాలకి పాకిస్తాన్ ఆర్టిల్లరి కాల్పులవల్ల ప్రమాదం పొంచి వుందని కూడా తెలియదు ద్రాస్కి ఎగువగా టోలోలింగ్ టైగర్హిల్స్పై చొరబాటుదారులు నిఘాస్థావరాలు ఏర్పాటు చేసుకున్నారని వారు ఫిరంగి కాల్పులని నిర్దేశిస్తున్నారని తెలియదు సైనిక శకటాలు నిరాఘాటంగా సాగిపోతున్నాయి త్వరలోనే పౌరశకటాలు కూడా నడుస్తాయ ని ఆయన చెప్పారు పాక్ చొరబాటుదారుల ఉపసంహరణ పూర్తయ్యే వరకు పౌరవాహనాల రాకపోకలు మొదలు కాలేదన్నది వేరే విషయం

కార్గిల్ చొరబాటు సైనిక స్వభావంపై ఇంతటి తప్పుడు అవగాహనపై ఎవరైనా ఎలా వివరణ ఇవ్వగలరు? మే 19 నాటికి కూడా సైన్యానికి ఏం జరుగుతోందో సరిగా తెలియకపోవడం బహుశ ఇందుకు ఒక కారణం కావచ్చు కాని పాల్ స్వయంగా ఆ అవకాశాన్ని త్రోసి పుచ్చారు

"ఫొటోలు వేగులు అందించిన సమాచారాన్ని సరిపోల్చి చూసిన తర్వాతనే మేం తుది అంచనాలు తయారు చేశాం మే 17 నాటికి జరుగుతున్న దేమిటో స్పష్టంగా

తెలుసుకున్నట్లు నాకు బాగా గుర్తు శ్రీనగర్‌లో మే 19న విలేకరులతో తొలిసమావేశంలో చొరబాటు దారులెంత లోపలికి ఎంతమేరకు చొచ్చుకొచ్చారు వారికి లభిస్తున్న లాస్టిక్స్ మద్దతు కాల్పుల ద్వారా కలుగుతున్న రక్షణ వీటిని బట్టి ఇది ఖచ్చితంగా పాకిస్తాన్ సైనిక కేంద్రం మద్దతిస్తున్న చర్య అనడంలో నాకెలాంటి సందేహం లేదని చెప్పినట్లు నాకు గుర్తుంది 5'

'పాకిస్తాన్ సైనిక కేంద్రం మద్దతుతో కూడిన చర్య అనేది ఇక్కడ కీలకమైన పదబంధం పశ్చిమ అంతర్జాతీయ సరిహద్దులోని నియంత్రణ రేఖ వద్ద ఎప్పటివలే చొరబాట్లకు సహాయ పడేందుకు పాక్‌సైన్యం జరిపే కాల్పులుగా సైనికాధికారులు అర్థంచేసుకుని వుంటారని UHQ సమావేశం మినిట్సు సూచిస్తున్నాయి కాని కార్గిల్ చొరబాటు సైన్యం నేతృత్వంలో సాగుతున్న సాంప్రదాయక సంఘర్షణ అనేది వారు అర్థం చేసుకోలేకపోయారు ఫరూక్ అబ్దుల్లా వీరితో విభేదించారు

తాజా చొరబాటు తాత్కాలిక పదకం కాదు రాజోరి–పూంచ్ ప్రాంతంలో మాదిరిగానే కొన్ని ప్రాంతాలను దిగ్బంధనం చేసి కార్గిల్–లెహ్‌లను లోయనుంచి వేరు చేయాలన్నది పాకిస్తాన్ కుట్ర అంటారాయన వాళ్లు కేవలం తీవ్రవాదులు కాదని పాక్ సైనికులు కూడా వారిలో వున్నారని ఆయన అభిప్రాయపడ్డారు

ఆ సమావేశంలో వున్న వారందరికన్నా పార్లమెంటులో తాను మద్దతిస్తున్న పార్టీ కన్నా ఫరూక్ అబ్దుల్లాకు అవగాహన శక్తి హెచ్చని అనిపిస్తుంది

కొసావో సమస్య సద్దుమణగగానే పాకిస్తాన్ కాశ్మీర్ సమస్యని అంతర్జాతీయ స్థాయిలో లేవనెత్తుతుంది అని ఆయన భావించారు అనువుగాని దుర్గమ ప్రాంతాలలో సైన్యాన్ని కట్టిపడేయడంద్వారా కొత్త చోట్ల పోరాటం విస్తరించడం మరో ఉద్దేశ్యం కావచ్చని ఆయన అంటారు

అబ్దుల్లాకు బహుశా పోలీసు శాఖనుంచి సమాచారం అందుతూ వుండి వుంటుంది గిల్ గిత్ స్కౌట్లు నార్త్ లైట్ ఇన్‌ఫాంట్రీల ఉనికి గురించి వారు మే నెల మధ్య నుంచి హెచ్చరిస్తున్నా ఎవరూ పట్టించుకోలేదు ఇంటిలిజెన్స్ బ్యూరోగాని 'రా (Raw) గాని UHQ సమావేశంలో పాల్ తప్పుడు అభిప్రాయాన్ని సరిదిద్దే ప్రయత్నమేది చెయ్యలేదు సమావేశం జరుగుతున్న సందర్భం ఏమిటనే స్పృహలేకుండా 'నేపాలు తదితర మార్గాల గుండా చొరబాటుదారుల సందడి పుంజుకోవడం పై దృష్టి కేంద్రీకరించడం మరీ విడ్డూరం మినిట్సులోని ఆరవ పేరాగ్రాఫ్‌లో ఇలా వుంది

గూఢచర్య సమాచారం ఎమిటని చీఫ్ సెక్రటరీ అడిగినదానికి జవాబుగా ఐబి జాయింట్ డైరెక్టర్ అందించిన సమాచారం ఇలా వుంది కొట్టి, కెల్ ప్రాంతాల్లో జనవరి

నుంచి సుమారు 200 మంది అల్ బదర్ తీవ్రవాదులు వేచి వున్నారని వారిని నిరోధించడానికి తీసుకున్న చర్యల వల్ల చొరబాటుకు సాహసించలేక పోయినట్లు చెప్పారు దానివల్ల నిస్పృహచెందిన తీవ్రవాదులు కార్గిల్ సెక్టారులో చొరబాటుకు ఒడిగట్టి వుంటారు

ప్రత్యేకించి ఇంటెలిజెన్సు బ్యూరో ఈ సమావేశంలో ఎందుకు మిన్నకుండి పోయిందనేది అర్థంకావడం లేదు 1999 ఎప్రిల్‌లో చొరబాట్లను సమాయత్తంచేసే నిమిత్తం ఓల్థింగ్ థాంగ్ వద్ద పాకిస్తాన్ సైనికేతర వ్యక్తులకు శిక్షణ నిస్తోందని హెచ్చరిస్తూ 1998 అక్టోబర్ నుంచి అందుతున్న హెచ్చరికల గురించి ఈ పుస్తకంలో నేను చర్చించిన రిపోర్టుల గురించి ఐబి జాయింట్ డైరెక్టర్‌కు ఖచ్చితంగా తెలిసే వుంటుంది బహుశా 15 కార్ప్సు కమాండరుతో వాదించే అవకాశాన్ని ముఖ్యమంత్రికి వదిలేయడానికి ఐబి జాయింట్ డైరెక్టర్ మౌనం వహించి వుండచ్చు ఇంటెలిజెన్సు బ్యూరో మరో పక్క పాల్ వీరిద్దరి వాదన ఎమిటన్నది మినిట్స్‌లో సరిగా ప్రతిబింబించడం లేదు ఐనప్పటికి మినిట్స్‌ని సరిదిద్దమని కోరుతూ వారిలో ఎవరూ యుహెచ్‌క్యూ కార్యాలయానికి లేఖలు రాసిన దాఖలాలు లేవు సరిదిద్దిన మినిట్స్ ప్రతులు సభ్యుల కందక పోవడం దీనికి నిదర్శనం కనుక మినిట్స్ సమావేశం గురించి నమ్మదగ్గ వివరణ అనే అనుకోవచ్చు

కార్గిల్‌లో పాకిస్తాన్ లక్ష్యాల గురించి పాల్ అంచనాలు నిర్దుష్టంగా వుండడం ఆసక్తి కరమైన అంశం 'చొరబాటు వెనుక ఉద్దేశ్యం ఏమై వుండచ్చు అని అడిగినపుడు రక్షణ విషయాల్లో సలహాదారు 'స్థూలంగా పరిస్థితిని అంతర్జాతీయం చెయ్యడం యుద్ధోన్మాదాన్ని రేకెత్తించడం, తృతీయ పక్షజోక్యం కోసం తమ వాదనను పటిష్ఠం చేసుకోవడం పాకిస్తాన్ లక్ష్యం కావచ్చు'ని వ్యాఖ్యానించారు కానీ యుద్ధోన్మాద పరిస్థితిని సృష్టించడమే కాదు పాక్ యుద్ధానికి కూడా సాహసించగలదని ఊహించడంలో ఆయన విఫలమయినట్లు కనబడుతుంది చొరబాటుదారుల వ్యూహాన్ని జమ్మూ - కశ్మీర్‌లో విద్రోహకారులు అనుసరించిన వ్యూహాల గురించి వున్న అనుభవంతోనే విశ్లేషించారు ఆచరణలోకొచ్చేసరికి 'ఈ చొరబాటుదారులు ఖాల్సి లేహ్ సెక్టార్లలో కీలకమైన సమాచార వ్యవస్థల విధ్వంసానికి ప్రయత్నించవచ్చని అల్లర్లు సృష్టించవచ్చని ఆయన అభిప్రాయపడ్డారు!

దక్షిణాసియాలో అణ్వస్త్ర రంగప్రవేశం వల్ల సాంప్రదాయ యుద్ధావకాశం లేదనే భద్రతా వ్యవస్థల హ్రస్వదృష్టి ఈ పరిస్థితికి కారణం అణ్వస్త్రదేశ హోదా లభించాక సైనిక వ్యూహాత్మక కారణాల వల్ల సాంప్రదాయ యుద్ధానికిగల అవకాశాలు

క్షీణిస్తాయన్న బి జె పి రక్షణ వ్యవస్థ అభిప్రాయాన్ని సైన్యం కూడా విశ్వసించిందని వాదించారు ఈ సాకుతో కార్గిల్ సంక్షోభానికి 'అణ్వస్త్రరంగంలో పరిణామాలకి ఎవిధమైన సంబంధం లేదని వాదించడానికి పూనుకున్నారు

బహుశా కాశ్మీర్‌లో అది సాగిస్తున్న ప్రచ్ఛన్న యుద్ధంతో మరింత సన్నిహిత సంబంధం వుండివుండవచ్చు అదే ఇంకా ఎక్కువ సమంజసంగా కనబడుతుంది ఇప్పుడు జరిగినదానికి 1947లోను 1965లోను ముజాహిదీన్‌లను, కచైలాలను అడ్డంపెట్టుకుని పాకిస్తాన్ చేసినదానికి సామ్యం కనిపిస్తోంది అలాగే ఎత్తుగడలు కూడా ఆఫ్ఘనిస్టాన్‌లో ఎత్తుగడలకు నకలుగా వున్నాయి (6)

మరోలా చెప్పాలంటే పోఖ్రాన్-2 తర్వాత గొలుసుకట్టు పరిణామాలలో జమ్మూ-కాశ్మీర్ సంఘటనలకి ఎలాంటి సంబంధం లేదు రాజకీయ ప్రోద్బలంతోకూడిన ఈ రెండు వేర్వేరు సంఘటనలు కార్గిల్ యుద్ధక్రమం పట్ల లోపించిన చారిత్రక అవగాహనకు సైనికుల ప్రాణాల రూపంలో భారత్ భారీమూల్యం చెల్లించింది ఇక ముందూ చెల్లిస్తూనే వుంటుందేమో!

జరగనున్న సంఘటనల గురించి చీకూచింతా లేని అధికారి పాల్ ఒక్కరేకాదు 1998 వసంత కాలంలో పాక్ కార్గిల్‌పై దాడికి తుది మెరుగులు దిద్దేపనిలో వుండగా లెహ్‌లోని 3 ఇన్‌ఫాంట్రి డివిజన్‌లో ఎప్పుడూ యుద్ధానికి సిద్ధంగా వుండాలన్న స్పృహే మృగ్యమైంది ఆ సమయంలో 3 ఇన్‌ఫాంట్రి డివిజన్ కమాండర్ లెఫ్టినెంట్ జనరల్ బుధవార్ ఆ చిన్న పట్టణంలో ఒక జంతుప్రదర్శనశాల నెలకొల్పే పనిలో తలమునకలై వున్నారు ఉద్దేశ్యం మంచిదే కాని, ఆ పని చట్టసమ్మతమేనా అనేది సందేహాస్పదం తన అధీనంలోని జవాన్లను ఆ జంతుప్రదర్శనశాల నిర్మించేందుకు వెళ్లాలని ఆయన ఆదేశించారు బ్రిగేడ్‌లన్నీ ఆ ప్రాంతంలో వుండే జూకి పనికొచ్చే జంతువులను పక్షులను పట్టుకొని/సేకరించి 1998 మార్చి 31లోగా 3 ఇన్‌ఫాంట్రి డివిజన్ సిగ్నల్స్ రెజిమెంట్‌కు అప్పచెప్పాలని జిఓసి ఆదేశిస్తున్నారు అయితే దీర్ఘసుషుప్తిలో (హైబర్‌నేషన్) వున్న జంతువులు/పక్షుల విషయంలో వాటికోసం తగిన బోనులు/పంజరాలు నిర్మించేందుకు వాటి కొలతలని 3 ఇన్‌ఫాంట్రి డివిజన్ సిగ్నల్స్ రెజిమెంట్‌కు తెలపాలి ప్రతి ఒక్కరు ఇందుకు కృషి చెయ్యాలి (7)

మే నెలలో పోఖ్రాన్ అణుపరీక్షలు జరిగిన వెంటనే కార్గిల్‌లో భారీగా ఆర్టిలరి కాల్పులు ఆరంభమైనప్పటికి 3 ఇన్‌ఫాంట్రి డివిజన్ ధ్యాసంతా జూ నిర్మాణంపైనే కేంద్రీకృతమై వుంది కార్గిల్‌లో నిర్విరామంగా కాల్పుల బెడద ఎదుర్కొంటున్న బ్రిగేడ్ హెడ్ క్వార్టర్స్ వాటి అధికారులు లెఫ్టినెంట్ కల్నల్ ఎ కె సింగ్ నుంచి జూన్ 8న

మరో అత్యవసర శ్రీముఖం అందుకున్నారు 6361/200/క్యు1 అనే నంబరుతో అందిన ఆ లేఖలో వన్య మృగాల కోసం వేట వేగంగా సాగాలని ఆదేశాలు వున్నాయి

ఈ ఆదేశాలు జారీ అయిన రోజునే బ్రిగేడియర్ సురీందర్‌సింగ్ కార్గిల్‌లోని 121 ఇన్‌ఫాంట్రి బ్రిగేడ్ నాయకత్వ బాధ్యతలు స్వీకరించారు 1980లో కక్సార్‌లో పీక్ 5108ని పట్టుకున్న ఘనత ఆయనదే సైన్యానికి జూ నిర్మాణంకన్నా ముఖ్యమైన బాధ్యతలు వున్నాయని సింగ్ నిర్ణయించారు ఆ ప్రాంతంలోనికి తిరుగుబాటుదారులు చొరబడే అవకాశంవుందని పదేపదే హెచ్చరిస్తూవచ్చారు అందుకు ప్రతిఫలంగా సహజ న్యాయ ప్రాధమిక సూత్రాలన్నింటిని త్రోసిరాజనే విధంగా ఆయనపై సైనిక దర్యాప్తుకు ఆదేశించడమే చివరికి ఆయనకు దక్కిన పురస్కారం!

సింగ్ తన ఆందోళనను మొదట ఛీఫ్ ఆఫ్ ఆర్మీస్టాఫ్ వి పి మాలిక్‌కే తెలియచేశారు 1998 ఆగస్టులో మాలిక్ కార్గిల్ సందర్శించనున్నందున ఆయనకు తెలుపవలసిన అంశాల గురించి ఒక నోట్' తయారు చేసి 3 డివిజన్ హెడ్ క్వార్టర్స్‌కి పంపవలసిందిగా 121 బ్రిగేడ్‌కు ఆదేశం వచ్చింది సింగ్ మాలిక్ దృష్టికి తేగల అంశాల గురించి బుధ్‌వార్‌కు ముందుగా తెలిసివుండడం మంచిదే ఇందులో అసహజమైందేమీ లేదు బ్రీఫ్ కోస్ నె 124/జిఎస్‌డి/విఐఎస్ అనే నోట్‌ను 121 బ్రిగేడ్ 1998 ఆగస్టు 28న పంపించింది దీన్నే ఛీఫ్ ఆఫ్ ఆర్మీస్టాఫ్‌కు లేఖ అనే పేరుతో ఔట్‌లుక్ (8) పత్రిక పొరపాటుగా పేర్కొంది 1999 సెప్టెంబర్ 2న మాలిక్ అటువంటి లేఖనేదీ అందుకోలేదని అధికారికంగా ఆ వార్తను ఖండిస్తూ ప్రకటన వచ్చింది సంకుచిత అర్థంలో ఈ ఖండన సబబే కాని 1998 ఆగస్టు 28న ఆ లేఖలోని అంశాలే మాలిక్‌కు తెలియచేసినట్లు సైన్యం ఒప్పుకుంది అంటే మాలిక్‌కు సింగ్ హెచ్చరిక గురించి తెలుసనేది నిశ్చయం

సార్క్ (దక్షిణాసియా దేశాల ప్రాంతీయ సహకార సమాఖ్య) అలీన దేశాల సమావేశాలు జరగనున్నందున పోఖ్రాన్–2 అణుపరీక్షలు జరిగిన వెంటనే పాకిస్తాన్ జమ్మూ–కాశ్మీర్‌లో హింసను ప్రోత్సహిస్తుందన్న సింగ్ దూరాలోచనను అగస్టు 21 నాటి ఆ నోట్‌లోని పేరా 5(ఎ) తేటతెల్లం చేస్తోంది కార్గిల్‌లో నియంత్రణరేఖ మీదుగా తిరుగుబాటుదార్లను పంపేందుకు పెద్ద ఎత్తున ప్రయత్నాలు జరగవచ్చని కూడా ఆ నోట్ సూచించింది ఈ అభిప్రాయానికి రావడం వెనుకగల కారణాలను 8వ పేరాలో 'విపత్తు గురించి మెరుగైన అవగాహన అనే శీర్షిక కింద వివరించారు గిల్‌గిత్‌లోని రిజర్వు యూనిట్ అయిన 24 సింధ్ రెజిమెంట్ ఓల్‌థింగ్‌థాంగ్ వద్దనున్న పాకిస్తానీయుల సరిహద్దు హెడ్ క్వార్టర్స్‌కు చేరుకుంది ఆ సమయానికి ఖచ్చితంగా

ఎక్కడుందో తెలియకపోయినా ఒక బెటాలియన్ సియాల్ కోట నుంచి స్కర్దు దిశగా కదిలింది ఈ సెక్టారులోనికి ఎమ్-198 హోవిట్జర్‌లు ఎమ్-11 క్షిపణులు వీటితో పాటు25 భారీ, 5 మధ్య తరగతి ఫిరంగులు కూడా చేర్చారని ఈ నోట్ పేర్కొంది

15వ పేరాలో ముష్కొలోయలో దోడానుంచి పానిఖర్ యాల్డోర్ వైపుగా నల్లా' ల ద్వారా చొరబాటుకు అవకాశాలున్నందు వల్ల కొత్త పరికరాలను (ఎక్విప్‌మెంట్ ఇవ్వాలని) కోరారు వాయుమార్గంలో పరిశీలనకు, ఆర్టిల్లరి కాల్పుల నియంత్రణకు మృతుల తరలింపుకు ఒక విమానం కావాలని సింగ్ కోరారు సింగ్ ఒక చోదకుడు వుండని (రిమోట్ పైలెట్‌లెస్ వెహికల్-ఆర్‌పివి) విమానం కూడా కావాలన్నారు ఇజ్రాయిల్‌లో తయారయిన ఇలాటి విమానాలు భారత్‌వద్ద నాలుగున్నాయి ఇంకా ఎడు మోర్టారు గన్నులను పసిగట్టేరాడార్లు విమానం నుంచి తీసిన ఫోటోలు ఉపగ్రహం పంపే ఛాయా చిత్రాలు ఒక ఎలక్ట్రానిక్ యుద్ధ విభాగం కూడా కావాలని సింగ్ కోరారు స్వతంత్ర రక్షణ నిపుణుల విశ్లేషణను ధిక్కరిస్తూ సైన్యం ఆయుధాలను పసిగట్టే రాడార్‌లు ఆర్‌విపిలు సైన్యం వనరుల జాబితా లోవి కావని వాదించింది అందుకు కారణాలేమిటో వారికే తెలియాలి ఒక వేళ సింగ్‌గాని సైన్యం వద్దలేని పరికరాలు కావాలని అడిగివుంటే అసమర్థతతోపాటు, చిత్తచాంచల్యం వుందనే ఆరోపణలు ఎదుర్కోవలసి వచ్చేది

సెప్టెంబరునాటికి సింగ్ అనుమానాలు మరింత బలపడ్డాయి 1998 సెప్టెంబరు 1న మేజర్ హెచ్ సి ద్వివేది 3 ఇన్‌ఫాంట్రి డివిజన్ హెడ్‌క్వార్టర్స్‌కి పంపిన ఒక లేఖ (132/జిఎస్‌ఐ/పిఎకె/చైనా)లో నియంత్రణరేఖవల పాకిస్తాన్‌వైపు తిరుగుబాటుదారుల కదలికలను ప్రస్తావించారు 'మన భూభాగంలోనికి ప్రవేశపెట్టడం కోసం గురికోట్ (మేప్‌లో చూపినది) ఎన్‌జి 7559 వద్ద 500 మంది ఆఫ్ఘన్ తీవ్రవాదులను సమీకరించినట్లు గూఢచారి వర్గాలు తెలిపాయని ఆ లేఖ పేర్కొంది కిల్‌నుల్లా సఫెయిద్‌నుల్లా కాబాల్‌గల్లిల గుండా ముష్కొలోయలోకి అక్కడ నుంచి పాన్‌గ్రాస్ ద్రాస్‌లలోనికి వారు ప్రవేశించవచ్చని చొరబాటు మార్గాలను కూడా ఖచ్చితంగా ఆనాడే ఆ లేఖలో పేర్కొనడం ఆశ్చర్యం కలిగిస్తుంది 1999 ఆగస్టు 30న ఇంటెలిజెన్స్ అండ్ ఫీల్డ్ సెక్యూరిటీ యూనిట్ రాసిన లేఖ ప్రతిని (నెం 1/1016) చొరబాటు సవ్యంగా జరిగేందుకు పాకిస్తాన్ ఆర్టిలరీ కాల్పులను ఉధృతం చేస్తుందని నియంత్రణ రేఖవైపు గురిపెడుతుందనే' హెచ్చరికతో లేఖ ముగుస్తుంది

సింగ్ హెచ్చరికలు పాకిస్తాన్ దాడులను నివారించగలిగేవా? సింగ్ లేఖలు

చొరబాటును సూచించాయేగాని పూర్తిస్థాయి దాడిని కాదని కొందరు వ్యాఖ్యాతలు వాటి ప్రాముఖ్యతను తగ్గించే ప్రయత్నం చేశారు కాని ఈ ప్రయత్నం హాస్యాస్పదం 1999 ఆగస్టులో పంజాబు-హర్యానా హైకోర్టులో దాఖలు చేసిన రిట్ పిటిషన్‌లో సింగే స్వయంగా శత్రువు కదలికలకు సంబంధించిన అంచనాలు ఎంచుకున్న చోట్లలో చొరబాటును గాని దాడిని గానినూచించలేద ని పేర్కొన్నారు ఏమయినప్పటికీ సింగ్ హెచ్చరికలకనుగుణంగా చర్యలు చేపట్టివుంటే పాకిస్తాన్ దాడులను ముందుగానే పసిగట్టడం సాధ్యమయివుండేది అప్పుడు యుద్ధానికి కాకపోతే చొరబాటుదారులను అడ్డుకోవడానికైనా సిద్ధంగా వుండేవారు కాని సింగ్‌పై లేనిపోని భయాలు కల్పించేవాడుగా సీనియర్ అధికారులు ముద్రవేశారు కాక్‌టైల్ పార్టీలలో సింగ్ హెచ్చరికలపై ఛలోక్తులు వేసి నవ్వుకునేవారు

ముప్పుందని అనుమానిస్తున్న ఆ తరుణంలో విమాన నిఘా ఎంతో కీలకమైంది 1999 జనవరిలో శీతాకాలపు విమాన నిఘాను మరింత ఉధృతం చేయాలని 121 బ్రిగేడ్ ప్రాధేయపడింది కార్గిల్‌లో ఒక హెలికాప్టర్‌ను శాశ్వతంగా వుంచాలని కోరింది గూఢచర్య నివేదికలను ఉటంకిస్తూ ముష్కోలోయలో నిఘాకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలని ఆ ప్రాంతంలోనే కాక మూమార్‌షుంగ్ టోలోలింగ్ నుల్లాలపై కూడా కనీసం వారానికొకసారైనా నిఘా విమానాలు తిరగాలని కోరారు ఈ ప్రతిపాదనలన్నింటిని తిరస్కరించారు శీతాకాలంలో మొత్తం కార్గిల్ సెక్టార్ ప్రాంతంలో నాలుగుసార్లే విమానాల ద్వారా నిఘా కార్యక్రమం నిర్వహించారు బటాలిక్‌కు తూర్పున, ముఖ్యంగా యాల్డోర్‌లో చొరబాటుదార్లను నిరోధించడంలో ప్రత్యేక పాత్ర నిర్వహించడానికి ఒక కంపెనీతో సహా అదనపు బలగాలు కావాలన్న విజ్ఞప్తిని కూడా తిరస్కరించారు పైపెచ్చు బటాలిక్‌పై పాక్‌దాడిని సులభతరం చేస్తూ అక్కడున్న 9 మహార్ రెజిమెంట్‌ను వేరేచోటుకు తరలించారు

యుద్ధానికి రంగం సిద్ధమైంది మే 6న బటాలిక్ ప్రాంతంలో మొదటిసారి భారతసైన్యం-పాకిస్థాన్ దళాలు ఇతరుల మధ్య కాల్పులు జరిగాయి దీనికి ప్రతిక్రియగా పూర్తిస్థాయిలో కొండలపైకి దాడి జరిపి చావుకొనితెచ్చుకోవడంకన్నా చొరబాటుదారుల సరఫరా మార్గాలను మూసివేయడం ఉత్తమమని సింగ్ తలపోశారు ఆయన వ్యూహం సరైనదే కాని మొదట్లో దాడులు ఎ స్థాయిలో జరిగాయన్నది కప్పిపుచ్చడానికి తర్వాత త్వరితంగా విజయాలు సాధించినట్లు చెప్పుకోవడానికి ఆరాటపడుతున్న రాజకీయ, సైనిక వ్యవస్థల పథకాలతో పొసగనిది సింద్ బుధ్‌వార్‌ల మధ్య ఘర్షణ పెరిగిపోయింది సీనియర్ అధికారులు కార్యనిర్వహణలో

సింగ్ అసమర్థుడని ఆరోపణలు చేస్తున్న నేపథ్యంలో ఎ క్షణంలోనైనా ఆయనకు ఉద్వాసన చెప్పే పరిస్థితి నెలకొంది

ఇక్కడ సమస్య సమర్థతకు సంబంధించినది కాదని వాస్తవాలు తెలుపుతున్నాయి 1999 ఎప్రిల్ 24 నుంచి 70 ఇన్‌ఫాంట్రి బ్రిగేడ్ అదుపులో వున్న ద్రాస్‌లో చర్యల నిర్వహణ బాధ్యతను సింగ్‌కు అప్పగించారు ద్రాస్‌లో పోరాటం మొదలయ్యాక సింగ్‌ను 70 బ్రిగేడ్ కమాండర్ నిర్వహిస్తున్న బాధ్యతలు స్వీకరించమన్నారు 4080 4590 శిఖరాలు టోలోలింగ్‌లో అత్యున్నత శిఖరం 5140 పైనా పొంచివున్న పాక్ సైనికులను అదుపుచేసేందుకు వారి వెనుక నుంచి దళాలను నడిపి ఉత్తర దిశగా మోహరించాలనేది సింగ్ వ్యూహం టైగర్‌హిల్ చుట్టూ 4195 4410 శిఖరాల వద్ద కూడా ఇలాంటి వ్యూహాన్నే అనుసరించారు ఈ వ్యూహం పాక్ స్థానాలను ఉక్కిరిబిక్కిరి చేసింది కొత్త ఢిల్లీ కోరినట్లు త్వరితంగా చొరబాటుదారులను ఖాళీ చేయించడానికి ప్రయత్నిస్తే అది ఆమోదయోగ్యంకాని రీతిలో సైనికుల ప్రాణాలను బలివ్వడమే అయ్యేది

కాని ఈ వ్యూహం ఫలితాలనిచ్చేదాకా వేచివుండే ఓపిక ఢిల్లీలోని బి జె పి నేతృత్వంలోని ప్రభుత్వానికి లేదు 1999 జూన్ 6న సింగ్‌ను శ్రీనగర్ వెళ్లమని ఆదేశించారు అక్కడ 15వ సైన్యం హెడ్ క్వార్టర్స్‌లో పనిచెయ్యమన్నారు నాలుగు రోజుల తర్వాత సింగ్ అభ్యంతరం చెప్పడంతో ఆ ఉత్తర్వులు రద్దుచేసి జూన్ 21న తిరిగి అవే ఉత్తర్వులు జారీ చేశారు ఆయన ఎడమ చెవికి తగిలిన గాయం పట్ల ఆదుర్దాతోనే బదిలీచేసినట్లు సింగ్‌కు తెలిపారు నిజానికాయన ఆ గాయం గురించి ఎన్నడూ చెప్పుకోనే లేదు మాలిక్‌ను కలవాలని పలుసార్లు ప్రయత్నించాక చివరికి జూన్ 28న ఇంటర్వ్యూ ఇవ్వనున్నట్లు సింగ్‌కు తెలిపారు చీఫ్ ఆఫ్ ఆర్మీస్టాఫ్ మాలిక్ తన మాట నిలబెట్టుకోలేదు నిరాశా నిస్పృహలతో ఢిల్లీలో ఆరు రోజులు వున్నాక సింగ్ తన ఫిర్యాదులు ఎకరువు పెడుతూ సంబంధిత పత్రాలతో సహా జూన్ 28న ఒక లేఖను (29734/ఎస్ఎస్/సిఓఎన్ఎఫ్‌డి) మాలిక్‌కు పంపారు ఆ లేఖ ముట్టినట్లు మాలిక్ కార్యాలయం నుంచి రశీదు కూడా అందింది శ్రీనగర్ తిరిగి వచ్చాక, జూలై 2న తనను సికింద్రాబాద్‌లోని ఆంధ్రా సబ్ ఎరియా కమాండర్‌గా వేసినట్లు సింగ్‌కు తెలియవచ్చింది ఆయన సామాన్లు సికింద్రాబాద్ చేరేలోగా అయనను రాంచీకి బదిలీచేస్తూ జూలై 17న కొత్త ఉత్తర్వులు అందాయి సైన్యానికి చెందిన విశాల ప్రాంతాన్ని డీ నోటిఫై చేయగా, అందులో పలువురు సీనియర్ సైనికాధికారులు ప్లాట్లు కొనుక్కున్న వ్యవహారంపై సింగ్ దర్యాప్తు చేపడతారన్న భయంతోనే ఈ బదిలీ జరిగిందనే ఆరోపణలున్నాయి నిజానిజాలెలావున్నా విసుగెత్తిపోయిన సింగ్ నెల రోజుల శెలవు

కోరారు జూలై 21న శెలవు మంజూరైంది కాని శలవును మధ్యలోనే రద్దుచేసి ఆగస్టు 22కల్లా రాంచీ చేరుకోవాలని ఆదేశాలు జారీ చేశారు అదీ ముణ్ణాళ్ళ ముచ్చటే బ్రిగేడియర్ సింగ్‌ను లేహ్‌లోని 3 ఇన్‌ఫాంట్రి డివిజన్‌కు తిరిగి వెళ్ళమని ఆదేశించారు ఎందుకని ప్రశ్నించిన సింగ్‌కు ఒక దర్యాప్తులో సహకరించడానికని సమాధానం వచ్చింది

వరుస బదిలీలతో వేసారిన సింగ్ పంజాబు-హార్యానా హైకోర్టు నాశ్రయించారు తన విధిని సక్రమంగా నిర్వహించినందుకే తనను శిక్షిస్తున్నారన్న ఆరోపణ ఆయన పిటిషన్‌లో ప్రతిఫలిస్తుంది 'ఛీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్‌కు పంపిన అనేక లేఖల్లో నిజాయితీని ప్రదర్శించినందుకే అధికారులు బెదిరి అక్రమం అసమంజసమైన పద్ధతిలో ఎదోవిధంగా కక్షసాధింపజూస్తున్నారని పిటిషన్‌లో సింగ్ వాదించారు తన ప్రాణాలకు ముప్పున్నట్లు కూడా భావిస్తున్నట్లు ఆయన పేర్కొన్నారు సుప్రసిద్ధ మిలిటరీ చట్టాల నిపుణుడు ఆర్ ఎస్ రణధవా సింగ్ తరపున వకీలు చివరకు పిటిషన్‌ను ఉపసంహరించుకున్నా బ్రిగేడియర్ లేహ్‌లో ప్రాసిక్యూషన్ ఎదుర్కోవలసి వస్తే మళ్లీ హైకోర్టును ఆశ్రయించేందుకు అనుమతి లభించింది

అలా జరిగే అవకాశం తక్కువ లేహ్‌లో అధికార పత్రాలు ప్రచార సాధనాలకు వెల్లడయిన అంశంపై బుధ్‌వార్ విచారణ కాదేశించారు ఈయనపైనే సింగ్ లిఖితపూర్వకంగా ఫిర్యాదు చేశారు బుధవార్ కింది ఉద్యోగి, డిప్యూటి జనరల్ ఆఫీసర్ కమేండింగ్ అశోక్ దుగ్గాల్ నేతృత్వంలో బ్రిగేడియర్లు సి ఎం నాయర్ దేవీందర్‌సింగ్‌లు విచారణ జరుపుతున్నారు

తమపై అధికారి తరఫునే విచారణ జరిపే వీరివల్ల న్యాయం చేకూరుతుందనే నమ్మకం లేదు తాను లీక్ చేసానని చెబుతున్న పత్రాలను చూసే అవకాశం వున్న ఇతర అధికారులను అంటే ఆర్మీ ఛీఫ్, అతని సిబ్బందితో సహా అందరినీ విచారించాలన్న సహేతుకమైన సింగ్ అభ్యర్ధనను 1998 సెప్టెంబర్ వరకు మన్నించలేదు

కార్గిల్ యుద్ధాన్ని రాజకీయ రక్షణ వ్యవస్థలు నిర్వహించిన తీరుపై పరిశోధించి వెల్లడించే అంశాలపట్ల అధికారుల స్పందనకు సింగ్‌ను వేధించిన తీరు అద్దం పడుతుంది విచారణ లక్ష్యం కార్గిల్ తరహా సంఘటనలు పునరావృతం కాకుండా చూడడం కావాలి కాని అందుకు భిన్నంగా ఎవరో కొందరు పై అధికారులు వారికి దన్నుగా నిలిచే రాజకీయవాదులకు రక్షణ కల్పించడమే రక్షణ వ్యవస్థకు అత్యంత ప్రధానమైపోయింది

## పాకిస్తాన్ లక్ష్యాలు - ముషారఫ్-ఖాన్‌ల మాటల తేడాలు

సైన్యం వైఫల్యాలకు వెనక చొరబాటుకు పాల్పడడంలో పాకిస్తాన్ ఉద్దేశ్యం ఎమైవుంటుందనే విషయంలో రాజకీయ వర్గాలలో అవగాహన కొరవడడం వుంది పాకిస్తాన్‌లో సైనిక పౌర అధికార కేంద్రాల మధ్య చెప్పుకోదగ్గ ఘర్షణ వుందనే ముఖ్యమైన భావన భారత రాజకీయ వర్గాలు సైనిక వ్యవస్థల ఆలోచనా సరళిని ప్రభావితం చేసింది చొరబాటు వెనక నవాజ్ షరీఫ్ ఇంటర్ సర్వీసెస్ ఇంటెలిజెన్స్ (ఐ ఎస్ ఐ)ల పాత్ర ఏమీ లేదని అందుకు పూర్తి బాధ్యత సైన్యందేనని వారు విశ్వసించారు సత్సంబంధాల పునరుద్ధరణ ప్రక్రియను లాహోర్ బస్ యాత్రతో ప్రధాని వాజ్‌పేయి ఆరంభించారు మత యుద్ధోన్మాదం (జిహాద్)తో వున్న సైన్యం దీనిని భగ్నం చేయాలని ప్రయత్నిస్తోంది కార్గిల్ యుద్ధం వైఖరికి సైన్యం ఈ మితవాది అయిన నవాజ్ షరీఫ్‌కి మధ్య ఆధిపత్యం కోసం జరుగుతున్న కుమ్ములాట ఫలితమనే వారు భావించారు ఈ భావనే బాగా బలపడి పాకిస్తాన్ చొరబాటుకు ఎందుకు పూనుకుందో సాంప్రదాయ యుద్ధాన్ని భారత్‌పై రుద్దడంలో దాని అంతర్యమేమిటో కొత్త ఢిల్లీలో ఎవరూ స్పష్టంగా గ్రహించలేక పోయారు

పాకిస్తాన్ ఛీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్ జనరల్ పర్వేజ్ ముషారఫ్ ఛీఫ్ ఆఫ్ జనరల్ స్టాఫ్ లెఫ్టినెంట్ జనరల్ అజీజ్ ఖాన్‌ల మధ్య జరిగిన సంభాషణను రికార్డు చేసిన టేప్ ఒకటి భారత్‌కు లభించింది దానిని భారత్‌కు ఎవరు అందచేశారో తెలియడం లేదు కాని అందులో^ అంశాలు అది విశ్వసనీయమైందేనని సూచిస్తున్నాయి 1999 మే 26న తిరిగి మే 29న ముషారఫ్ చైనాలో వున్న సమయంలో ఆయనకు అజీజ్‌ఖాన్‌కు జరిగిన సంభాషణ అందులో రికార్డు చేసినట్లనిపిస్తుంది టేపులోని సంభాషణ సారాంశం ఒకలా వుండగా అందుకు విరుద్ధమైన అభిప్రాయానికి ఫెర్నాండెజ్ ఎలా వచ్చారన్నది ఆశ్చర్యం ముషారఫ్ అజీజ్‌కు ప్రధాని నవాజ్ షరీఫ్‌తో తాను మాట్లాడినట్లు చెప్పారు 'మేం చాలాసార్లు చర్చించాం చివరకు నిన్న కూడా సంభాషణలు కొనసాగిస్తూ చర్చలకు అవకాశం కల్పించాలేగాని ఉన్న పరిస్థితిలో మార్పువుండకూడదు అని ఆయనకు చెప్పాను' అంటారు ముషారఫ్ ఆ తరువాత దశలో సైనిక కమాండర్‌తోపాటు పాకిస్తాన్ విదేశాంగ కార్యదర్శి షంషద్ అహ్మద్‌కు కూడా కార్గిల్ సంక్షోభం గురించి వివరించినట్లు ముషారఫ్ స్పష్టం చేశారు

యుద్ధంపై దౌత్య చర్యలు ఆరంభం కావడానికి ముందు మే నెల 29న జరిపిన సంభాషణలో ముషారఫ్ పాకిస్తాన్ లక్ష్యాలేమిటో స్పష్టం చేశారు ఢిల్లీలో త్వరలో జరగనున్న చర్చల్లో పాకిస్తాన్ విదేశాంగ మంత్రి సర్తాజ్ అజీజ్ వాస్తవ స్థితిపై ఎటువంటి అంగీకారానికి హామీకి ఆస్కారం ఇవ్వకుండా తాను చూస్తానని ఈ సందర్భంగానే

అజీజ్ ఖాన్ ముషారఫ్‌కు చెప్పారు మేము ఎప్పటి నుంచో ఇక్కడే వున్నాం' అని వాదించవలసిందిగా సర్తాజ్ అజీజ్‌ను ఆదేశించారు 'మొదట్లోలాగే విషయం ఒక్కటే – మనం ఎ స్థావరంపైనా దాడి చేయలేదు ఏ స్థావరాన్నీ ఆక్రమించుకోలేదు నియంత్రణరేఖ వెంబడి మా రక్షణరేఖపై మేమున్నాం ఉన్న పరిస్థితి ఇది అని ముగించారు వారితో తర్కించవచ్చుకాని యుద్ధ పరిస్థితిపై తొలి సమావేశంలో అజీజ్ సాహెబ్ దేనికీ మాట ఇవ్వకూడదని మా సలహా కాల్పుల విరమణకు కూడా అంగీకరించకూడదు కాల్పులు విరమిస్తే వాహనాల రాకపోకలు (శ్రీనగర్–లేహ్ రోడ్డుపై) మొదలవుతాయి మే 26 నాటి సంభాషణలో ఆయన షరీఫ్ విశ్వాసంగానే వున్నారని తెలిపారు

షంషద్ (హైదర్) ఎప్పటిలాగే మద్దతిస్తున్నాడు ఈ వేళ క్రితం రెండు గంటల నుంచి బి జె పి నిర్విరామంగా భారత విమాన దాడుల గురించే ప్రసారం చేస్తోంది వారినలా బాంబులు వేసుకోనివ్వండి ***అంతర్జాతీయీకరణ విషయానికొస్తే చాలా వేగంగానే అది సంభవించింది*** రెండు దేశాలు కూర్చుని మాట్లాడుకోవాలని ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి కోఫి అన్నన్ విజ్ఞప్తి చేసినట్లు పత్రికల్లో చూసేవుంటారు(10)

సర్తాజ్ అజీజ్ ఢిల్లీ పర్యటన విఫలం కావాలనే పాకిస్తాన్ కోరుకుంటోంది నిజానికి వైఫల్యమే దాని లక్ష్యం అజీజ్ అహ్మద్ ఎత్తి చూపినట్లు జూన్ నెల సగం గడిచేనాటికి యుద్ధానికి మూడు రకాల ప్రత్యామ్నాయ మార్గాలు అగుపడసాగాయి (11) మొదటిది అనేక కారణాల వల్ల భారత్ ఎంతో సంయమనం పాటించవలసి రావచ్చు అప్పుడు అక్టోబరు 15 తరువాత చలికాలం ప్రారంభమయ్యేవరకు పాకిస్తాన్ తమ స్థానాలను నిలబెట్టుకోగలుగుతుంది రెండవది కార్గిల్ పర్వతాలను ఎలాగైనా తిరిగి స్వాధీనం చేసుకోవాలని భారత్ గట్టి పట్టుదలతో వుంటుంది అలా జరగకపోతే ఎన్నికల్లో సర్వనాశనం తప్పదన్న భయమే ఆ పట్టుదలకు కారణమవుతుంది గత్యంతరం లేక నియంత్రణ రేఖ దాటేందుకు సైన్యం చేసే అభ్యర్థన మన్నించి పూర్తిస్థాయి యుద్ధానికి శ్రీకారం చుడుతుంది మూడవది భారత్ కార్గిల్ పర్వతాల నుంచి పాకిస్తాన్‌ను ఖాళీ చేయించేందుకు ఎదో ఒక రూపంలో అంతర్జాతీయ సహాయం కోరుతుంది అందుకు ప్రతిగా జమ్మూ–కాశ్మీర్‌కు సంబంధించి ఎదోవిధమైన కనీస ప్రయోజనాన్ని పాకిస్తాన్ కోరుతుంది

## కార్గిల్ నుంచి కొలోన్ మీదుగా వాషింగ్టన్

జూన్ నెల సగం గడిచేసరికి వీటిలో మొదటి ప్రత్యామ్నాయం నిజమయ్యే ప్రమాదం ముంచుకొస్తోందని భారత్ ప్రభుత్వానికి స్పష్టమయింది గొలుసుకట్టులో అది రెండవ ప్రత్యామ్నాయం అంటే నియంత్రణ రేఖదాటి పూర్తి స్థాయి భారత్ దాడి చెయ్యలేదనేది నిజమయ్యే పరిస్థితి తెచ్చింది అందుకు తగినట్లే ఆర్మీఛీఫ్ ఆఫ్ స్టాఫ్ జనరల్ మాలిక్ పాకిస్తాన్‌లోనికి దాడినారంభించేందుకు మంత్రివర్గం అనుమతికోరనున్నట్లు సూచనలందించనారంభించారు జూన్ 13న శ్రీనగర్‌లో ఒక పత్రికా విలేకరుల సమావేశంలో ప్రధాని వాజ్‌పేయి నియంత్రణ రేఖ దాటే అవకాశం లేదని చెప్పడానికి తిరస్కరించారు బహిరంగంగా వ్యూహాత్మక అంశాలు చర్చించబోమన్నారు (12) ఒక మధ్యవర్తిని పంపుతామన్న ఐరాస ప్రధాన కార్యదర్శి కోఫీ అన్నన్ ప్రతిపాదనను తిరస్కరించి, భారతదేశం అంతర్జాతీయ జోక్యాన్ని ప్రతిఘటిస్తున్న అభిప్రాయం కలిగించింది ఆ సమయంలో కొలాన్‌లోని జి-8 శిఖరాగ్ర సభ పాకిస్తాన్‌ను దురాక్రమణదారుగా పేర్కొనకుండా పోరు ఆపమని మాత్రం హితబోధ చేస్తూ పసలేని ఒక ప్రకటన జారీ చేసింది దాన్నే ఒక ఘనవిజయంగా వర్ణిస్తూ భారత దేశం అంతర్జాతీయ ద్రవ్యనిధి నుంచి ఆర్థిక సహాయం నిలిపివేతతో సహా తన పొరుగు దేశం (పాక్) పై చర్యలు తీసుకోవాలని కోరింది (13)

ఇది భారత ప్రభుత్వం అమెరికా సహాయం కోరుతూ నిర్ణయాత్మక నిస్పృహతో కూడిన విజ్ఞప్తి చేసిన సమయంలోనే అని యిప్పుడు స్పష్టమవుతోంది జూన్ 16న బ్రజేష్ మిశ్రా అమెరికా రక్షణ సలహాదారు సాండీ బెర్గర్‌కు అందచేసిన ప్రధాని వాజ్‌పేయి లేఖలో అంశాలేమిటో తెలియదు కాని వాషింగ్టన్ పోస్టు పత్రిక తెలిపినట్లు నియంత్రణ రేఖ మీదుగా దాడిని ఇక జాప్యం చేయడానికి కుదరదని ఆ లేఖ పేర్కొని వుంటుంది

జూన్ నెలలో అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ జెనీవాలోని అంతర్జాతీయ కార్మిక సంస్థలో ఉపన్యసిస్తుండగా ఆయన జాతీయ రక్షణ సలహాదారు శామ్యూల్ ఆర్ సాండీ బెర్గర్ భారతదేశ ప్రధాని అటల్ బిహారీ వాజ్‌పేయి నుంచి వచ్చిన ఆందోళన కలిగించే లేఖనందుకోవడం కోసం బయటకు వచ్చారు కాశ్మీర్‌లో వివాదాస్పదమైన భూభాగంలో పాకిస్తాన్ తాను ఆక్రమించిన భారతీయ స్థావరాల నుంచి సేనలను ఉపసంహరించకపోతే భారత్ పాకిస్తాన్ లోపలికి దాడి జరపవచ్చునన్నది వాజ్‌పేయి సందేశం

పాకిస్తాన్‌ను ఖాళీ చేయించే ప్రయత్నంలో అప్పటికే 100 సైనికులను కోల్పోయిన భారత్ కాశ్మీర్‌ను విభజించే కాల్పుల విరమణ రేఖను దాటి దాడి జరుపుతుంది లేదా పాకిస్తాన్‌తోగల సరిహద్దులో మరోచోట మరో రణరంగాన్ని సృష్టిస్తుందని, దానితో

గత సంవత్సరమే అణ్వస్త్రాలను పరీక్షించిన దాయాదుల మధ్య ఆయుధ సంఘర్షణ మరింత పెద్దదవుతుందనే అమెరికా భయాన్ని మరింత ఎగదోసింది (14)

కార్గిల్‌ల్లో పూర్తిగా కలుగజేసుకునే ఉద్దేశ్యం ఒకవేళ క్లింటన్‌కున్నా షరీఫ్‌ను ప్రక్కన బెట్టి అంతకన్నా ఛాందసుని అధికారంలోనికి రావడానికి దోవ ఏర్పరచే ఉద్దేశ్యం మాత్రం లేదు పాక్ కూడా భారత్ భావించినంత ఏకాకి కాలేదు పాక్ ప్రధాని షరీఫ్ అమెరికా పర్యటన గురించి ప్రకటన వెలువడడానికి ముందే జూన్ 29న ప్రతినిధి జేమ్స్ రాబిన్ అంతర్జాతీయ ద్రవ్యనిధిని ప్రభావితం చేసే ఉద్దేశ్యం అమెరికాకు లేదని స్పష్టం చేశారు పాక్‌లో యుద్ధ విమానాల తయారీకి ఒక ఫ్యాక్టరీ నిర్మించాలనుకుంటున్నట్లు చైనా ప్రకటించింది ఇస్లామ్ దేశాల సంస్థ (ఆర్గనైజేషన్ ఆఫ్ ఇస్లామిక్ కాన్ఫరెన్స్) షరీఫ్‌కు బాసటగా నిలిచింది

భారత్‌లో ప్రచార సాధనాలు వీటికి ప్రచారం కల్పించాయి కాని అంత ప్రాముఖ్యతనివ్వలేదు అన్నీ యధావిధిగా జరుగుతున్నాయి మార్పేమీ లేదనే నిజాన్ని మాత్రం చెప్పడానికి నిరాకరించాయి పాక్ అంతర్జాతీయ సమాజంలో ఏకాకి అయినదెక్కడా అంటే అది ఒక్క కార్గిల్‌లోనే నియంత్రణ రేఖ దాటిన మేరకే ఆ చర్చ ప్రారంభించడానికి ముందు పాకిస్తాన్ ఇవన్నీ ఊహించే వుంటుంది వారికి సంబంధించినంత వరకు తమను ఖండించేది ఎంత వరకు ఇంకేవిధమైన చర్యలుండబోతాయా అన్నదే ప్రశ్న (15)

వెనుదిరిగి చూస్తే జూన్ 26 27 కార్గిల్ యుద్ధంలో కీలకమైన తేదీలు ఒక వారం రోజులుగా పాకిస్తాన్‌లోనే వున్న అమెరికాదేశ జనరల్ కమాండర్ కమాండర్ ఇన్ ఛీఫ్ ఆంధోని జిన్ని డిప్యూటీ అసిస్టెట్ సెక్రటరీ ఆఫ్ స్టేట్ గిబ్సన్ లాంఫెర్‌లతో ముషారఫ్ విస్తృతంగా చర్చలు జరిపారు అనంతరం కరాచీలో షరీఫ్ త్వరలో క్లింటన్‌ను కలుస్తారని విలేకరులతో అన్నారు జిన్ని ముషారఫ్ మధ్య చర్చలకు కేంద్ర బిందువు పాకిస్తాన్ ఉపసంహరణ జరిగే కాలం/తీరు అని సండే టెలిగ్రాఫ్ పత్రిక తెలిపింది ముజాహిదీన్‌లు క్షేమంగా తిరిగిపోవడానికి సహకరించినందుకు ప్రతిఫలంగా కాశ్మీర్ సమస్య పరిష్కారానికి నిర్ధిష్ట కాల పరిమితి గల చర్చలు ఆరంభం కావాలని పాకిస్తాన్ డిమాండ్ చేసినట్టుగా 'డాన్' పత్రిక నమ్మకంగా చెప్పింది తనవంతుగా పాకిస్తాన్ శాశ్వత పరిష్కారంలో భాగంగా మొత్తంలోయ ప్రాంతాన్ని అజాద్ కాశ్మీర్ ప్రాంతంలోని జమ్మూలో వున్న ముస్లిం ఆధిక్యతగల ప్రాంతాలను చర్చల్లో చేర్చేందుకు అంగీకరిస్తుంది అంటే ఓవెన్ డిక్సన్ చూపిన పరిష్కార మార్గంలోనన్నమాట (16)

జూలై 4న షరీఫ్ క్లింటన్‌ను కలిసినపుడు ఆ దిశగా చర్చలేమైనా జరిగాయా

అనేది తెలియదు అయితే వారి సంయుక్త ప్రకటన మాత్రం నియంత్రణ రేఖ వద్ద యధాపూర్వ స్థితి నెలకొన్నాక ద్వైపాక్షిక చర్చలు (కాశ్మీర్‌తో సహా పాక్-భారత్‌లు విభేదించే అన్ని అంశాల పరిష్కారానికి) శీఘ్రంగా ప్రారంభమై చురుగ్గా సాగేలా చూసేందుకు క్లింటన్ వ్యక్తిగతంగా శ్రద్ధవహిస్తారని చెబుతోంది (17) షరీఫ్ ప్రత్యేక దూత నియాజ్ నాయక్ లాన్‌ఫర్‌లు ప్రధాని వాజ్‌పేయి బ్రజేష్ మిశ్రాలతో చర్చిస్తూ కొంతకాలం ఢిల్లీలో వున్నారని ఇపుడు వెల్లడయింది ముషరఫ్ జిన్నీల సంభాషణా సారాంశాన్ని బహుశా వారు ప్రధాని మిశ్రాలకు తెలిపి వుండవచ్చు ఆ తరువాత జరిగిన సంఘటనల క్రమాన్ని పరికించండి ప్రధాని షరీఫ్ అతి త్వరలోనే వాషింగ్టన్ సందర్శించబోతున్నారని ముషారఫ్ ప్రకటించిన జూన్ 27నే నాయక్ ఢిల్లీ నుంచి ఇస్లామాబాద్‌కు బయలుదేరారు చైనా నాయకులతో అతి ముఖ్యమైన సమావేశాన్ని ముగించుకున్న షరీఫ్ ఆ మర్నాడే తన బీజింగ్ పర్యటనను అర్ధాంతరంగా రద్దు చేసుకున్నారు బ్లెయిర్ పర్యటనను అర్ధాంతరంగా రద్దు చేసుకున్నారు బ్లెయిర్‌హౌస్‌లో షరీఫ్‌తో భేటీకి వీలుగా క్లింటన్ తన శలవులను సవరించుకున్నారు

దేశంలోపల ఒత్తిడుల వల్ల వాషింగ్టన్ వెళ్లడానికి వాజ్‌పేయి తిరస్కరించినా బ్లెయిర్ హౌస్ సమావేశం అమెరికా చొరవతో దక్షిణాసియాపై ఏర్పాటయిన శిఖరాగ్ర సభకు తక్కువేం కాదు ముషారఫ్ జిన్నీల సంప్రదింపులు ప్రాతిపదికగా అమెరికా-పాక్ అధికారులు ఒక ఆమోదయోగ్యమైన ప్రకటన పాఠం రూపొందించడానికి ఉపక్రమించారు వారు రూపొందిస్తున్న ప్రకటనలోని ప్రతి పదం గురించి బెర్గర్ మిశ్రాతో చర్చిస్తూ వచ్చారు అంత వరకు వాజ్‌పేయి క్లింటన్‌నుంచి తుది టెలిఫోన్ పిలుపు కోసం ఎదురు చూస్తూవచ్చారు అంబారీల బిజినెస్ అండ్ పొలిటికల్ అబ్జర్వర్ పత్రికకు సంపాదకుడుగా వున్న ఆర్ కె మిశ్రా వాజ్‌పేయి ప్రభుత్వానికి పెరటిదోవన దూతగా వ్యవహరించారు ఆయన మూడు పర్యాయాలు పాకిస్తాన్ సందర్శించిన సందర్భాల్లోనే బ్లెయిర్ హౌస్ ప్రకటన పాఠం చిత్తు ప్రతిని ఖరారు చేశారని ఇపుడు స్పష్టమవుతోంది

దౌత్యపరమైన విషయాన్ని సైనిక చర్య విజయంగా చూపేందుకు భారతదేశ అధికారవర్గం బి జె పి నేతలు తంటాలు పడుతున్నారు ఇంతకంటే అసత్యం వేరొకటి వుండదు పాకిస్తాన్ ఎకాకి కావడమనే మాటెలా వున్నా ప్రధానమైన జమ్మూ-కాశ్మీర్ సమస్యపై వ్యూహాత్మకమైన సంభాషణల ప్రక్రియలోకి అమెరికాను లాక్కురావడంలో పాక్ విజయవంతమైంది అదే దాని ప్రధాన లక్ష్యం కూడా జమ్మూ-కాశ్మీర్‌లో

ఎంతో విషాదాన్ని మిగిల్చిన తీవ్రవాదులు గత పదేళ్ళుగా పాక్ ప్రోద్బలంతో నియంత్రణరేఖను ఉల్లంఘిస్తునే ఉన్నారు కార్గిల్ యుద్ధం నడుస్తున్నంత కాలం అమెరికా ఆ అంశానెప్పుడూ ప్రస్తావించకపోవడం గమనార్హం అంటే ఒక అంతర్జాతీయ సమాజంగా ఒక దేశం తన సరిహద్దులను అతిక్రమించడం అణ్వస్త్ర యుద్ధానికి దారితీసే చర్యలకు పూనుకోవడం అభ్యంతరకరంగా గాని కనపడలేదు

జమ్మూ-కాశ్మీర్‌లో హింస పెరగడం కొనసాగడం అనివార్యం ఈ సంగతి మరో చోట ప్రస్తావిస్తాను ఈ పరిస్థితిని భారతదేశ అధికారవర్గం ఎలా సంబాళిస్తుందో అస్పష్టం అయితే మనకు అందిన తొలి సంకేతాలు కొంత ప్రోత్సాహకరంగానే వున్నాయి

# ఫోఖ్రాన్ నుంచి కార్గిల్ వరకు బస్సులో ....

అణ్వాస్త్రం ఆత్మరక్షణ కొరకే కాని ఎవరిపైనా దాడికుద్దేశించినదికాదు ఇది శాంతి పరిరక్షణకు సహాయ పడగల ఆయుధం

**ప్రధానమంత్రి అటల్ బిహారీ వాజ్‌పేయి**

పోఖ్రాన్-2 నేపథ్యంలో జమ్మూ-కాశ్మీర్ సమస్యపై అంతర్జాతీయంగా ఆందోళన వ్యక్తమయింది కార్గిల్‌పై అమెరికా దౌత్యానికి పూనుకోడం ఈ సందర్భంగానే జరిగింది కాగా దీనిపై ఎవరూ ఎమి వాఖ్యానించకపోవడమే విచిత్రం! పోఖ్రాన్-2 పరీక్షలో ఎగసిన అణుసంబంధమైన రాజకీయమైన సెగలు ఉత్తరదిశగా తిరిగి కార్గిల్ వైపే వ్యాపించాయి

**ఫోఖ్రాన్ 2 పరీక్షలు తెచ్చిన అంతర్జాతీయ ఒత్తిడి**

పోఖ్రాన్ అణుపరీక్షల తరువాత కొద్ది వారాలలోనే జూన్ 4న ఐక్యరాజ్య సమితిలోని భద్రతా మండలి శాశ్వత సభ్యులు ఐదుగురు సమావేశమై జారీచేసిన సంయుక్త ప్రకటనలో జమ్మూ-కాశ్మీర్ గురించి ప్రస్తావించారు భద్రతా మండలి ఈ అంశాన్ని ప్రస్తావించడం దశాబ్దాల తరువాత ఇది మొదటిసారి భద్రతా మండలి కాశ్మీర్ సమస్యలపై తృతీయపక్ష మధ్యవర్తిత్వాన్ని గురించి భారత్-పాకిస్తాన్ చర్చలలో కాశ్మీర్‌కి ప్రాతినిధ్యం గురించి ప్రస్తావించలేదని భారత పరిశీలకులు మురిసిపోయారు కాని కార్గిల్ ఇప్పుడు పరోక్షంగా అంతర్జాతీయ అంశమయిందని అమెరికా దౌత్యవేత్తలు ఖరాఖండిగా తేల్చి చెప్పారు

ఉదాహరణకి ఈ ప్రకటన వెలువడిన వెంటనే అమెరికా రక్షణశాఖ కార్యదర్శి విలియం కాహెన్ ఆ సమస్యపై ఎవిధమైన అంతర్జాతీయ జోక్యం కూడదని భారత్ తీవ్రంగా అభ్యంతరం పెడుతున్నా గాని కార్గిల్ పై బహుళపక్ష చర్చలు అవసరం అని సూచించారు ఆల్ పార్టీ హురియత్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడు సయ్యద్ ఆలీషా గిలాని భవిష్యత్తులో ఎం జరగనుందనేది స్పష్టంగా సూచించారు పోఖ్రాన్-2 తరువాత శ్రీనగర్‌లో జామియా మసీదులో మాట్లాడుతూ 'అంతర్జాతీయ ఒత్తిడి వచ్చినప్పుడల్లా భారతదేశం ద్వైపాక్షిక చర్చలకు అంగీకరిస్తోంది చర్చలు మొదలవగానే కాశ్మీర్ భారత దేశంలో అవిభాజ్య భాగ్యం అంటూ చర్చలకు అర్థం లేకుండా చేస్తోంది ఇప్పుడు అణుయుద్ధ ప్రమాదం పొంచివుంది కాబటి ప్రపంచ దేశాలు తప్పక జోక్యం చేసుకోవాలి అన్నారు [1]

పోఖ్రాన్ పరీక్షలను జమ్మూ–కాశ్మీర్ భవితవ్యానికి ముడిపెట్టడానికి హోంమంత్రి అద్వానీ నిర్ణయించడం ఈ భయానికి బలమైన కారణం జమ్మూ–కాశ్మీర్ పై విధాన నిర్ణయాలు తీసుకోవడం కోసం ప్రభుత్వం మే నెల 18న మొదటిసారి సమావేశం జరిపింది సమావేశం అనంతరం అద్వానీ మాట్లాడతూ అణ్వస్త్ర దేశం కావాలని భారత్ తీసుకున్న తిరుగులేని నిర్ణయం, భారత్–పాక్ సంబంధాల్లో ముఖ్యంగా జమ్మూ–కాశ్మీర్ సమస్యకొక శాశ్వత పరిష్కారాన్ని కనుగొనే విషయంలో గుణాత్మకమైన మార్పు తెచ్చింది " అన్నారు 'పోఖ్రాన్–2 తరువాత ఈ ప్రాంతంలోను ప్రపంచంలోను వచ్చిన వ్యూహాత్మక మార్పుల్ని ఇస్లామాబాదు గుర్తించాలి అని అయన అన్నారు 'ముందుగా (అణ్వస్త్ర) దాడి చెయ్యరాదనే సిద్ధాంతానికి భారత్ కట్టుబడి వుంటుంది అని చెబుతూనే పాకిస్తాన్ దుశ్చర్యలకు ఘాటైన జవాబు ఇవ్వాలని కృతనిశ్చయంతో వున్నట్లు కూడా అద్వానీ పేర్కొన్నారు [2]

బి జె పి ద్వితీయ శ్రేణి నాయకులు తమ జాతీయస్థాయి నాయకులకి వంత పాడారు మాజీ మంత్రి మదన్‌లాల్ ఖురానా తన ఇష్టమొచ్చిన చోట ఇష్టమైన సమయంలో పాక్ యుద్ధానికి తలపడవచ్చని సవాలు విసిరారు పాకిస్తాన్ ఛాఘాయ్ కొండల్లో అణుపరీక్ష జరపగానే ఈ వీరాలాపాలు తగ్గిపోయాయి కాని అలాంటి అలోచనలు రేకెత్తించిన అంశాలే విధాన రూపకల్పనను నిర్దేశించాయి [3]

**కుచ్చుటోపి**

జమ్మూ–కాశ్మీర్‌లో సాంప్రదాయిక యుద్ధాన్ని ఆరంభించి ఆ సమస్యలో అంతర్జాతీయ జోక్యం తప్పని సరిచేసేందుకు పోఖ్రాన్–2 ఒక అపూర్వ అవకాశాన్నిచ్చిందని పాక్ సైన్యంలోని వ్యూహ నిర్మాతలు సరిగ్గా అర్థం చేసుకున్నారు అందుకు విరుద్ధంగా భారత రక్షణ వ్యవస్థకు అటువంటి అవకాశం వుందన్న ఆలోచన కూడా రాలేదు ఒక విధంగా అటువంటి ఆలోచన చేసే పరిస్థితి కూడా లేదేమో! పోఖ్రాన్ పరీక్షలు వ్యూహాత్మక పొరపాటని అంగీకరించడం బి జె పి అణువిధానం అసంబద్ధమైనదని అంగీకరించడమే అవుతుంది అమెరికా ఒత్తిడి వల్లనే 1999 ఫిబ్రవరి నుంచి భారత్–పాకిస్తాన్‌లు 'లాహోర్ ప్రక్రియ ని ఆరంభించాయి

మొదట్లో చర్చలు ఫలప్రదం కావాలని పాకిస్తాన్‌కన్న భారత దేశమే ఎక్కువ ఆతృతతో వుందనేది స్పష్టంగా తెలుస్తోంది పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ మొక్కుబడి కావలింతకు వాజ్‌పేయి నాటకీయమైన అభివాదానికి మధ్య తేడా కొట్టొచ్చినట్లు కనిపించింది వాఘా సరిహద్దు వద్ద పాక్ ఆర్మీఛీఫ్ ముషారఫ్ ఇతర సైనిక ప్రముఖుల గైర్హాజరీ కొత్త చర్చల ప్రక్రియపట్ల సైన్యం సుముఖంగా లేదని తేటతెల్లం చేస్తోంది

కార్గిల్ యుద్ధం అరంభంకాగానే బస్ దౌత్యంపై వ్యాఖ్యానిస్తూ ఒక పరిశీలకుడు భారతదేశపు యుద్ధోన్మాదులపై పాకిస్తాన్‌లోని యుద్ధోన్మాదులు పై చేయి సాధించారని అన్నారు [4]

పాకిస్తాన్ నిర్ణయించుకున్న లక్ష్యాల గురించి రాజకీయ దూరదృష్టి లోపించడం సైనికపరంగా ఎన్నో పరిణామాలకి కారణమయింది 1998 శిశిర రుతువులో నియంత్రణరేఖ వెంబడి పాక్ ప్రారంభించిన ఫిరంగి కాల్పులు 97 యుద్ధం తర్వాత అంతులేని స్థాయిని చేరుకున్నాయి కార్గిల్ పట్టణంలో 17 మంది పౌరులు మృతి చెందారు పట్టణం బాగా దెబ్బతింది ఈ సంఘర్షణ మరింత విస్తృతమైతే అది కొత్తగా ఆరంభించిన సంప్రదింపుల ప్రక్రియను దెబ్బ తీస్తుందనే ఆదుర్దాతో భారతదేశం ఆర్మీచీఫ్ మాలిక్ పాకిస్తాన్ కాల్పులకు జవాబుగా హెవీ కాలిబర్‌గన్‌లు 155 మి మి బోఫోర్స్ హోవిట్జర్లతో కాల్పులు జరపవద్దని మన దళాలను ఆదేశించినట్లు భోగట్టా పాక్ సైనిక విశ్లేషకులు దానర్ధమేమిటో స్పష్టంగా గ్రహించారు నియంత్రణ రేఖ వెంబడి కావాలని రెచ్చగొట్టినా పోఖ్రాన్ అనంతర దశలో సంఘర్షణలు విస్తరించే ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి భారతదేశం ఇష్టపడని అసహాయస్థితిలో వుంటేపాక్ సైన్యం మరింత భారీ ఎత్తున సాహసాలకి పూనుకోవచ్చు గతంలో పాకిస్తాన్ ఎన్నోమార్లు జమ్మూ-కాశ్మీర్‌లో పరిమిత స్థాయిలోనైనా బలప్రయోగంతో భూమినిఆక్రమించుకోవాలనే ఆలోచన చేసినట్లు ఎందుకో విరమించుకున్నట్లు కొన్ని కధనాలు తెలుపుతున్నాయి అలా చేసి జమ్మూ-కాశ్మీర్‌లో జోక్యానికి అంతర్జాతీయ సమాజంపై ఒత్తిడి తేవాలన్నది పాక్ ఎత్తుగడ ఇప్పుడు అందుకు సాంప్రదాయికమైన ప్రతిబంధకాలేవీ లేవు

పోఖ్రాన్ పరీక్షల అనంతర దశలో పాకిస్తాన్ లక్ష్యాలేమిటో తెలిపే వ్యూహాత్మకమైన పథకం ఎదీ లేదని 1998 ఆగస్టు నుంచి జరిగిన సంఘటనలు వెల్లడిస్తున్నాయి పోఖ్రాన్ పరీక్షల అనంతరం ఆకురాలు కాలంలో పాకిస్తాన్ ప్రోత్సహిస్తున్న తీవ్రవాదులు భుజాన పెట్టుకుని ఉపరితలం నుంచి గాలిలోనికి ప్రయోగించే (ఎస్ ఎ ఎం ) క్షిపణులు కలిగివున్నట్లు విశ్వసనీయంగా తెలియవచ్చింది వీరిపై నిఘా వుంచేందుకు ఫోటోలు తీసే సరంజామా వున్న జాగ్వార్ విమానాలు ఇస్తామని ఎయిర్ ఫోర్స్ చీఫ్ ఎం కె సరీన్ ముందుకొచ్చారు బహుశా జమ్మూ కాశ్మీర్‌లో బాధ్యత కేవలం తనొక్కడిదే అనే దురభిప్రాయంతో కాబోలు మాలిక్ ఆ ప్రతిపాదనను తిరస్కరించారు ఎస్ ఎ ఎం ల గురించి అందిన గూఢచారి నివేదికలు ఊహాగానాలేనని వాజ్‌పేయి ఫెర్నాండెజ్ నమ్మినట్లు తెలుస్తోంది ఎస్ ఎ ఎం గురించి సమాచారం కట్టుకథేననుకున్నా పోఖ్రాన్ తరువాత జరిగిన సంఘటనలు చూశాకనైనా నిఘాను ముమ్మరం చేసివుండాల్సింది

1998లోనే జాగ్వార్ విమానాల సెవలు వాడుకుని వుంటే నియంత్రణరేఖను దాటి పాక్ దళాలు ఇతరుల చొరబాటును ముందుగానే పసిగట్టగలిగేవారు

కార్గిల్‌లో కనీసం 1998 స్థాయి ఫిరంగిదాడి నెదుర్కోవడానికైనా సైన్యం తయారుగా లేదు దీనికి కారణం ఎమిటో ఇంకా తెలియడం లేదు 1098-99 శీతాకాలం పొడవునా తీవ్రస్థాయిలో పరస్పర కాల్పులు సాగుతూనే వున్నాయి అనేక భారత స్థావరాలపై ఎడతెరిపి లేకుండా కాల్పులు కొనసాగుతున్నాయి అయినా గాని అక్కడ తగినంత ఆహారం మందుగుండు నిల్వలుచేర్చే ప్రయత్నం జరిగిన దాఖలా ఎవీ లేవు సోనామార్గ్‌నుంచి లేహ్ వెళ్లేమార్గంలోని జోజిలాపాస్ (కనుమ) ఈ ఎడాది త్వరగా రాకపోకలకోసంతెరుచుకుంది లేకుంటే భారత్ కార్గిల్‌లో సరఫరా సమస్యలు దళాల కొరతల నెదుర్కొని ఉండేది ఈ వైఫల్యానికి ప్రధాన బాధ్యత మాలిక్‌దే అయినా ఆయనకి కూడా ఎవో సమస్యలున్నట్లు కనబడుతుంది గత ఎడాదిగా ఆర్మీ ఛీఫ్ మాలిక్ సిగ్నల్స్ (దళం) గూఢచర్య సామర్ధ్యాన్ని పెంపొందించాలని శత్రువు రాకను కనిపెట్టి నిరోధించగలిగే సాధన సంపత్తి'ని ప్రవేశపెట్టాలని పదే పదే కోరుతూ వున్నారు కాని రక్షణ మంత్రిత్వ శాఖ తనకు పట్టునట్టు ఊరుకుంది మాలిక్ అడిగిన కొత్త సాధన సామాగ్రి తక్కువ పరిమాణంలో నైనా అందే సరికే అలస్యమయింది [5] ఆ సంఘటనల క్రమాన్ని సైనికాధికారులెవరూ ఇంత వరకూ ఖండించలేదు

పరిశోధన విశ్లేషణ విభాగం 'రా లోని వైమానిక పరిశోధనా కేంద్రం (ఎ ఆర్ సి) కూడా నియంత్రణ రేఖకు అవతల ప్రాంతాలపై నిఘా పెట్టాలన్న అభ్యర్ధనలను పెడచెవిన పెట్టింది ప్రత్యేక పరికరాలు అమర్చిన బోయింగ్ 707 విమానం ఒకటి ఎడు జంట ఇంజన్లుండే బీచ్ ఎయిర్ క్రాఫ్ట్‌లతో సహా 40 విమానాలు ఎఆర్‌సి వద్ద వున్నాయి కాని వాటిని వాడేందుకు రాజకీయ అనుమతి అవసరమని ఎ ఆర్ సి వాదించింది ఈ విమానాలు శత్రువు కళ్లుగప్పి ఎంతో ఎత్తున విహరి _ సామర్థ్యం కలవి కార్గిల్‌లో కాని నియంత్రణ రేఖవద్ద ఇతర ప్రాంతాలలో కాని ఎ ఆర్ సి విమానాల నిఘా కావాలి అని ప్రత్యేకంగా విజ్ఞప్తి చేసారా లేదా అనేది స్పష్టంగా తెలియడం లేదు ఈ విమానాలేవీ నిఘా నిర్వహించలేదనే వాస్తవం పలు సందేహాలకు తావిస్తోంది

ఇదే ఎ ఆర్ సి జమ్మూ-కాశ్మీర్‌లో బాగా సహకరించింది 1998 అక్టోబర్ నవంబర్ మధ్యకాలంలో ఓల్డింగ్‌థాంగ్ వద్ద కార్గిల్ చర్య కోసం శిక్షణా కార్యక్రమం పూర్తికావస్తున్న సమయంలో జమ్మూలోని కొన్ని ఎ ఆర్ సి విమానాల నుంచారు ధోడా పర్యటనలో పెద్ద సంఖ్యలో చొరబాటుదారులు చేరినట్లు వస్తున్న వార్తలని

నిర్ధారించుకునేందుకు అవి పనికి వస్తాయి కార్గిల్ చర్చలో పాల్గొన్న కొందరు పోలీసు అదికారులు ఆ విమానాలు తీసిన ఫోటోలు ఎంతో ఉపయోగకరంగా వున్నయని పేర్కొన్నారు కాని నియంత్రణ రేఖ వద్ద ఎ ఆర్ సి విమానాలు నిఘా చేపట్టనేలేదు బహుశా వారికి ఆదేశాలు వచ్చి వుండవు

పోఖ్రాన్ తరువాత పాకిస్తాన్‌కు లభించిన వ్యూహాత్మకమైన కొత్త అవకాశాలపై సమగ్రమైన అవగాహన లోపించిందని ఈ సంఘటనలు రుజువు చేస్తాయి ఢిల్లీ నేతలు, వారిపట్ల అణకువగా వుండే సైనికాధికారులు లాహోర్ ప్రక్రియ ఆరంభం కాగానే జమ్మూ- కాశ్మీర్‌లో పాకిస్తాన్ కొనసాగిస్తున్న దాడులు మెల్లిగా సమసిపోతాయనే ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు జమ్మూ-కాశ్మీర్ భవితవ్యం నిర్ణయించడంలో అంతర్జాతీయ జోక్యాన్ని సాధించేందుకు రెండు దశాబ్దాల కాలంలో పాకిస్తాన్‌కు అందివచ్చిన అపూర్వ అవకాశం ఇది మహత్తరమైన ఈ అవకాశాన్ని అమెరికా ఒత్తిడి వాణిజ్య ప్రయోజనాల దృష్ట్యా పాకిస్తాన్ వదులుకుంటుందని వారు భావించారు పైగా అణ్వస్త్ర వ్యాప్తి శాంతిని ప్రోత్సహిస్తుందనే గుడ్డి నమ్మకం ఒకటి వారిలో పాతుకుపోయింది ప్రముఖ పాత్రికేయుడు ఎన్ రామ్ ఇలా అన్నారు

"భారతదేశ అణుకార్యక్రమాన్ని సమర్థించేవారు అది తీవ్రస్థాయిలో సాంప్రదాయిక ఘర్షణ సంభవించే అవకాశాల్ని తగ్గించి శాంతికి దోహదం చేస్తుందని ఊదరకొట్టేస్తున్నారు లాహోర్ ప్రక్రియ ఆరంభమయ్యాక తొలిసారి జరిగిన విదేశాంగ కార్యదర్శుల సమావేశం విజయవంతం అయ్యాక ఇది మరీ ఎక్కువైంది కార్గిల్ పరిణామాలు అందుకు పూర్తిగా భిన్నంగా వున్నాయి ఇరు దేశాలూ అణుపాటవాన్ని ఏర్పరచుకున్న నేపథ్యంలో అతిశయోక్తులు వ్యాపించడం వల్ల ఉద్రిక్తతలు మరింత ఎక్కువై పరస్పర వైషమ్యాలకూ అపనమ్మకాలకూ దారి తీస్తున్నది ఇది సాంప్రదాయక యుద్ధానికి దారితీయవచ్చు మరింత జాగ్రత్త పడకపోతే సాధారణ పరిస్థితి కూడా ముదిరే ప్రమాదం వుంది [6]

**గ్రహణ శక్తి లేని గూఢచర్యం**

కార్గిల్ ప్రాంతంలో భారీదాడికి పాకిస్తాన్ సన్నద్ధమవుతోందని ఖచ్చితంగా అందిన తొలి సమాచారాన్ని ఢిల్లీలో అధికార వర్గం కొట్టిపారేసి వుంటుందని ఊహించవచ్చు 1998 అక్టోబరు మూడవ వారంలో లేహ్‌లోవున్న ఇంటెలిజెన్సు బ్యూరో కేంద్రం రెండు మార్లు ప్రత్యేక హెచ్చరికలు పంపిందని చాలా మంది పేర్కొంటున్నారు ఓల్డింగ్‌థాంగ్ వద్ద తన సరిహద్దు హెడ్ క్వార్టర్స్ సమీపంలోని రెండు శిబిరాలలో పాకిస్థాన్ సైనికేతరులకు శిక్షణనిస్తోందని లేహ్ కేంద్రం అధికారి తన మొదటి నివేదికలో

పేర్కొన్నారు  1999 ఎప్రిల్ నెలలో వాళ్ళు సరిహద్దు దాటడానికి పథకం పన్నారని ఆ నివేదిక స్పష్ట చేసింది

కార్గిల్‌లోని ఐ బి (ఇంటెలిజెన్స్ బ్యూరో) స్థావరం అధిపతి పిన్న వయస్కుడైనా లేహ్‌నివేదికలకి స్కర్దు నుంచి ఈ అధికారికి అందిన సమాచారమే ఆధారం  ఈ సమాచారం ఆధారంగా వెలువడ్డ లేహ్ కేంద్రం రెండవ నివేదిక శత్రువు శ్రీనగర్-లేహ్ జాతీయ రహదారి వెంబడి నిఘా కోసం పైలెట్ లేకుండానే సంచరిస్తూ ఫోటోలు తీసే వేగు విమానాలను వాడుతున్నట్లు తెలిపింది  ఈ రెండు నివేదికలు ఐ బి డైరెక్టర్ శ్యామల్ దత్తాకు చేరాయని వాటిని ప్రధాన కార్యాలయానికి పంపేవుంటారని ఐ బి అధికారులు చెబుతున్నారు  నివేదికల మాట అబద్ధం అనిఎవరూ అనడం లేదు కాని వాటినందుకున్న చిట్టచివరి ఉన్నతస్థాయి కార్యాలయంవారు మాత్రం మౌనం పాటిస్తున్నారు  ఓల్డింగ్‌థాంగ్ నుంచి అందుకున్న సమాచారాన్ని కార్గిల్‌లోవున్న ఐ బి కర్మచారులు స్థానిక 121 బ్రిగేడ్ మిలటరీ ఇంటెలిజెన్స్ (యం ఐ యంత్రాంగానికి నివేదించారని లభ్యమవుతున్న ఆధారాలు సూచిస్తున్నాయి  ఐ బి నుంచి వస్తున్న సమాచారం ఎప్పటికప్పుడు బ్రిగేడ్ ఇంటెలిజెన్స్ టీమ్స్ (బిట్స్)కు చెందిన మేజర్ భూపేందర్‌సింగ్‌కు  ఇంటెలిజెన్స్ ఎండ్ ఫీల్డ్ సెక్యూరిటీ యూనిట్‌కు చెందిన మేజర్ కె బి ఎస్ ఖురానాకు అందుతూనే వుంది  బిట్స్ ఐ నెఫ్ ఎస్ యులు ఓల్డింగ్‌థాంగ్ వద్ద శత్రువుల మోహరింపు గురించి రెండు నివేదికలు తయారు చేసినట్లు తెలుస్తోంది 1998 సెప్టెంబర్‌లో రూపొందించిన మొదటి  నివేదికలోని సమాచారం అంత నమ్మదగినదికాదని  రెండవ నివేదికలో సమాచారం అత్యంత విశ్వసనీయమైందని అవి పేర్కొన్నాయి

ఐ బి నివేదికల గురించి తమకు సమాచారం లేదని సైన్యం గట్టిగా చెబుతోంది వాస్తవంలో క్షేత్ర స్థాయినుంచి వచ్చే సమాచారాన్ని సామాన్యంగా అన్ని సంబంధిత విభాగాలకూ అందించడం రివాజు  బ్రిగేడియర్ సుందర్ సింగ్ జాబులు సూచిస్తున్నట్లు ఖురాన్ సింగ్ నివేదికలు పంపినట్లయితే అవి తప్పక సైన్యం ప్రధాన కార్యాలయానికి, శ్రీనగర్‌లోని 15వ సైనిక కార్యాలయానికి చేరే వుండాలి  వాటినెంత శ్రద్ధగా పరిశీలించారనేది వేరే విషయం [8]

నిజాన్ని రుజువు చేసే ఆధారాలు బయట పడుతూనే వున్నాయి  1998 డిసెంబరు 20న సరిహద్దు భద్రతా దళాలు (బి ఎస్ ఎఫ్) పూంచ్ ప్రాంతంలో హిజబుల్ ముజాహిదీన్ కార్యకర్త అజార్ షఫిమీర్‌ను పట్టుకుని బంధించాయి  దర్యాప్తులో అతను వెల్లడించిన వివరాలు శ్రీనగర్‌లోని ఇంటెలిజెన్సు వర్గాల్లో అమిత ఆసక్తిని రేకెత్తించేవిగా

వున్నాయి హిజబుల్ ముజాహిదీన్‌లో చాలాకాలం పనిచేసి విసుగెత్తిన అజార్ షఫీమీర్ పాక్ ఆక్రమిత కాశ్మీర్ పి ఓ కె ముఖ్యపట్టణం ముజఫరాబాద్‌లో ఆటో డ్రైవరుగా స్థిరపడ్డాడు జమ్మూ-కాశ్మీర్‌లో అతనికున్న అపారమైన అనుభవం కారణంగా పాకిస్థాన్‌కు చెందిన ఇంటర్ సర్వీసెస్ ఇంటెలిజెన్సు (ఐ ఎస్ ఐ) విభాగం అతన్ని తిరిగి జమ్మూ-కాశ్మీర్‌కు పంపింది ముందతన్ని ముజఫరాబాదులో నిర్లక్ష్యంగా వేగంగా ఆటో నడుపుతున్నాడనే నేరం మోపి అరెస్టు చేశారు ఆ తరువాత జైల్లో కాలం గడుపుతావో తిరిగి భారత్‌లో ప్రవేశిస్తావో తేల్చుకొమ్మన్నారు

ఆగస్టు నాటికి ముస్సెరా గిల్‌గిత్ రోడ్డుపైవున్న ఒక శిబిరంలో మీర్ శిక్షణ పూర్తి చేసాడు ఆ శిబిరంలో హిజబుల్ ముజాహిదీన్‌లో కొత్తగా చేరినవారు 110 మంది వరకు వున్నారని మీర్ చెప్పాడు వారిలో 30 మంది పాకిస్తాన్ ఆఫ్ఘనిస్తాన్ దేశీయులు వీరిలోనుంచి 5 విభాగాలను 1998 సెప్టెంబరు ఒకటిన అత్‌ముకాం వద్ద నియంత్రణ రేఖ దాటించి భారత్‌లో ప్రవేశపెట్టారు భయంతో వెనుకంజ వేసిన మీర్‌ను మరోసారి రేఖదాటించి పిరికితనం చూపితే చావు తప్పద'ని హెచ్చరించారు 9

మీర్ బృందంలో విశేషమేమీ లేదు కాని దాని లక్ష్యం ఆశ్యర్యం కలిగించేదిగా వుంది దర్యాప్తు నివేదిక ప్రకారం వారి లక్ష్యం 'బండిపూర్-గురెజ్ రోడ్డును ధ్వంసం చేసి గురేజ్‌లోని ఆర్మీ డివిజన్‌ను ఏకాకిని చెయ్యాలి అపుడు వారిమీద పూర్తి స్థాయిలో దాడి నిర్వహించవచ్చు' కాంగన్-లేహ్ రోడ్డును కూడా అలాగే ధ్వంసం చేసి ఆ ప్రాంతంలో సైనికులకు సరఫరాలు అందకుండా చేయడం మరో లక్ష్యం యురి-గురేజ్ ప్రాంతంలోని భారత సైన్యానికి చెందిన 19వ డివిజన్‌ను ఏకాకిని చెయ్యడం వల్ల అక్కడ తిరుగుబాటుదారులకు చేకూరే ప్రయోజనం ఏమీ లేదు ఆ సైనికులు స్థానికంగానే వారితో తలపడతారు అసలు లక్ష్యం గురేజ్ నుంచి కాంగన్-లేహ్ రోడ్డుపై ఒకానొక ప్రాంతానికి సహాయదళాలు పోకుండా నిరోధించడం – ఒకానొక ప్రాంతం అంటే కార్గిల్ ద్రాస్ ప్రాంతాలనే అర్థం చేసుకోవవాలి 1998 ఆగస్టు 9న జమ్మూ-కాశ్మీర్ స్పెషల్ ఆపరేషన్స్ గ్రూపు శ్రీనగర్‌లో కాల్చి చంపిన హిజబుల్ ముజాహిదీన్ కమాండర్ ఆలి మహ్మద్‌దార్ దుస్తుల్లో కార్గిల్ ద్రాస్ ప్రాంతాల మేప్‌లు లభ్యమయ్యాయి

ఈ సమాచారాన్ని విశ్లేషించి తగు చర్యలు తీసుకునే చొరవ కనబడకపోవడం విచారకరం కొందరు అధికారులు ఆందోళన వ్యక్తం చేసినా వ్యవస్థలో లోటుపాట్లపై ఆత్మపరిశీలన జరగలేదు 15వ సైనిక అధికారిక కమాండర్ మేజర్ జనరల్ ఎ ఎస్ సిహోతా జనవరి 11న మన స్థావరాలు కొన్నింటికి ఆక్రమించేందుకు పాకిస్తాన్

ప్రయత్నించవచ్చని హెచ్చరించారు [10] రాబోయే పరిణామాలెంత చేదుగా వుండబోతాయోననే అవగాహనే లేకుండా ప్రతి యేటా జరుగుతున్న మాదిరిగానే శీతాకాలంలో పాకిస్తాన్‌తో కాల్పులు జరగని స్థావరాల నుంచి దళాలను ఉపసంహరించారు

**ఎవరూ పట్టించుకోని రక్షణ స్థావరాలు (అన్‌హెల్డ్ డిఫెన్సెస్)**

ఈ స్థావరాలనిప్పుడు ఖాళీ చేసారు అనేది సైనికాధికారులు స్పష్టంగా చెప్పడం లేదు బి జె పి ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక రక్షణ చర్యల్లో శ్రద్ధ సన్నగిల్లిందనేది మాత్రం తెలుస్తూనే వుంది 1999 సెప్టెంబరు 5న పూనాలో పాత్రికేయులతో మాట్లాడుతూ జనరల్ మాలిక్ కార్గిల్ ద్రాస్ ప్రాంతాలలో గత రెండేళ్ళుగా స్థావరాలను ఖాళీ చేసినట్లు అంగీకరించారు అసాధారణమైన ఈ అంశాన్ని ఎక్కువమంది గుర్తించలేదు మాలిక్ చెప్పినట్లు

గత రెండేళ్ళుగా ఈ ప్రాంతంలో శీతాకాలాల్లో ఖాళీగా వుంటున్న చోట్లలో సైనిక సిబ్బందికి తగినసాధనసంపత్తి సమకూర్చి కొత్త స్థావరాలను ఏర్పాటు చేయవలసివుంది' (11)

మాలిక్ అంగీకరించిన ఈ వాస్తవం వల్ల కార్గిల్‌లో నియంత్రణరేఖ వెంబడి అంతా సవ్యంగా వుందన్న సైన్యం వాదనలో ఏ మాత్రం పసలేదని తేలుతోంది 15వ సైనిక కమాండర్ పాల్‌పాక్ ఆక్రమించిన ప్రాంతాలలో భారతదేశ స్థావరాలనేవి ఖాళీ చేయలేదనిచెప్పినట్టు రికార్డుల్లో వుంది అలా అయితే చొరబాటు ఎందుకు పసిగట్టలేకపోయారనే ప్రశ్న అలానే మిగిలిపోతుంది ఆయన చెప్పినదాని ప్రకారం పాక్ దళాలు 1987 నుంచే కాక అంతకు ముందు నుంచే ఎవరి దళాలు లేని ప్రాంతాలలోకి ప్రవేశించాయి కనుక ఖాళీ చేయడమనే ప్రశ్న ఉత్పన్నం కాదు ముందు అక్కడ వుంటే కదా ఆ ప్రదేశం నుంచి వైదొలగేది? సామాన్యంగా చలికాలంలో దళాలనుపసంహరించే కొన్ని స్థావరాలువున్నాయి అక్కడ నుంచే దళాలను ఉపసంహరించాం మరికొన్నింటిలోచలికాలంలో కూడా సైనికులు వుంటారు కానీ 15వ సైనిక ప్రాంతం (జోన్)లో ఒక్క స్థావరాన్ని కూడా పాక్ స్వాధీనం చేసుకోలేదని మే నెల 19న నేను స్పష్టం చేశాను గత 50 ఎళ్ళుగా ఎవరూ పట్టించుకోని రక్షణ స్థావరాలలోకే పాక్ చొచ్చుకు వచ్చి వాటిని ఆక్రమించింది [12] ఒక సీనియర్ అధికారి ఈ వాదనను కొట్టిపారేశారు 1967 నుంచి 1970 వరకు కార్గిల్‌లో 121 బ్రిగేడ్‌లో బ్రిగేడ్ మేజర్‌గా పని చేసిన మాజీ వైస్ ఛీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్ మోతిదార్ జమ్మూ-కాశ్మీర్‌లో వ్యూహాత్మక ప్రణాళికలు రూపొందించడంలో పాలు పంచుకున్న వ్యకి

చలికాలంలో కూడా నిఘా దళాలు పికెట్స్ తమ స్థానాల్లో వుండి వుంటే పాక్ చొరబాటు ప్రయత్నం ఫలించేదికాదని ఆయన దృఢాభిప్రాయం నిఘా దళాలే పికెట్లు వుండవలసిన స్థాయిలో తమ తమ స్థానాల్లో వుండి వుంటే మే నెల వరకు చొరబాటును గుర్తించకుండా వుండే అవకాశం వుందా? అనే ప్రశ్నకు సమాధానంగా వృత్తి రీత్యాగల అనుభవంతో తన అభిప్రాయం చెప్పమని అడిగినపుడు ఆయన 'ఖచ్చితంగా అందులో సందేహమేమీ లేదు చలికాలం పొడవునా ఆ ఎత్తుల్లో స్థావరాలు వుండి నిర్ణీత కాలవ్యవవధిలో వాటి మధ్య నిఘా చర్యలతో సంబంధాలు వుండి వుంటే చొరబాటును కనుగొనలేకపోవడమనే ప్రశ్నే లేదు చరియల (రిడ్జెస్) వెంబడి కదలికలను గుర్తించడం చాలా సులువు వాటిపై కన్నేసి వుంచమని ఆదేశించిన చిన్న గస్తీ బృందాలైనా అక్కడ వుండి వుంటే అవి చొరబాటుదార్ల రాకను వారి కార్యకలాపాలను ఖచ్చితంగా గమనించి వుండేవి పికెట్లకు బయట నెలకొల్పిన పరిశీలనా స్థావరాలు (అబ్జర్వేషన్ పోస్ట్స్) కూడా చొరబాటును పసిగట్టి వుండేవి ఆకాశ మార్గాన చరించే (నిఘా) వేదికలను మెరుగుపరచి ఎలక్ట్రానిక్ సెన్సార్లు వాడడం వంటి చర్యలు చేపట్టి మన నిఘా సామర్థ్యాన్ని పెంపొందించుకోవలసిన అగత్యాన్ని ఇవి స్పష్టం చేస్తున్నాయి అయినా వెయ్యి రెండు వేల మంది దాకా చొరబాటుదార్లు వచ్చినపుడు కూడా అది సాధారణ గస్తీ బృందం కంటబడలేదంటే నేను నమ్మలేను [13]

దీనినే మరికాస్త విపులీకరిస్తూ దార్ నియంత్రణ రేఖ వెంబడి ఇతర ప్రాంతాలలో చొరబాట్లను కనుగొనడం, నిరోధించడం నిరంతరం సాగుతూనే వుందనే విషయం గుర్తు చేశారు

ఆ (కుప్వారా, యూరి గురేజ్)రే ప్రాంతాలలో నియంత్రణ రేఖ వెంబడి దట్టమైన అడవి వల్ల మరుగు వుంది కార్గిల్‌లో కొండలు చెట్టు చేమా లేని కొండలు కనుక కార్గిల్‌లోకన్న చెట్ల మరుగున్న కుప్వారాలో చొరబాటును కనుగొనడం కష్టతరం అయినా సరే కుప్వారాలోను యూరిలోను చొరబాట్లను ఎప్పటికప్పుడు కనిపెడుతూనే వున్నారనేది గమనించాల్సిన అంశం ఆ ప్రాంతాలలో నియంత్రణ రేఖ వెంబడి పాకిస్తాన్ ఫిరంగి కాల్పులతో మన రక్షణ వ్యవస్థను నిర్వీర్యం చేసేందుకు ప్రయత్నిస్తున్నా మన గస్తీదళాలు అక్కడ ఇంచుమించు ప్రతిరోజు చొరబాటుదార్లపై ఎదురు కాల్పులు జరుపుతూనే వున్నాయి ప్రతి ఏటా నియంత్రణ రేఖ వద్ద వందల సంఖ్యలో పాకిస్తాన్ చొరబాటుదార్లను కాల్చివేస్తున్నారు వందలాది మందిని వెనక్కి తరిమేస్తూనే వున్నారు కార్గిల్‌లో చొరబాటుదార్లను కనుగొని వారిని ఎదుర్కొంటూ ఎవరో కొందరి చొరబాటును పసిగట్టలేక పోయివుంటే అది అర్థం చేసుకోవచ్చు కాని జరిగింది మాత్రం ఏ

విధంగానూ ఊహకందకుండా వుంది [14]

కొన్ని స్వతంత్రంగా సాగిన మీడియా పరిశోధనలు కూడా దార్ అభిప్రాయాలను బలపరుస్తున్నాయి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఇరుపక్షాలు పట్టించుకోని రక్షణ స్థావరాలుగా సైన్యం అభివర్ణించిన ప్రాంతాలలో బి ఎస్ ఎఫ్ స్థావరాలు వున్నాయని తమ గస్తీకార్యక్రమాన్ని రూపొందించుకునేటప్పుడు 121 బ్రిగేడ్ అధికారులు స్వల్పంగా పేరుకున్న మంచును పరిగణనలోనికి తీసుకోలేదని వెల్లడించింది [15] ఒక అజ్ఞాత పాకిస్తాన్ సైనికుడితో టైమ్ పత్రిక జరిపిన ఇంటర్వ్యూ సంఘటనలు జరిగినక్రమం ఎమై వుండవచ్చో వివరించింది చలికాలం ఆరంభంలోనే భారతీయ స్థావరాలను ఖాళీ చేసి గస్తీ నిలిపివేశారని దర్యాప్తులో తేలిన అంశాలతో ఇది సరిపోతుంది

నియంత్రణ రేఖను దాటి భానతీయుల అధీనంలోవున్న కొండలపైకి చేరుకోవలసిందిగా ఫిబ్రవరిలో నాకు ఆదేశాలు వచ్చాయి మా కమాండింగ్ ఆఫీసరు నన్ను ఎ కె 47 రైఫిల్ తీసుకు పోనీలేదు ఆయుధం లేకుండా భారతదేశపు కొండలపైకి వెళ్లడం నాకు ఇష్టంలేదు కాని నియంత్రణ రేఖను దాటేందుకు పంపబడిన వారంతా ఉత్తి చేతులతోనే వెళ్లడం నేను గమనించాను అదంతా గుట్టురట్టవకుండా ఉండేందుకేనని మాకు చెప్పారు కొండలెక్కి నడిచి కార్గిల్ వద్దవున్న భారతీయ స్థావరాల వద్దకు చేరుకోవడానికి మాకు సుమారు మూడు రోజులు పట్టింది ఆ స్థావరాలు ఖాళీగా వుండడం చూశాం అక్కడ తాత్కాలిక బంకర్లు ఎర్పాటు చేయడమే మాకప్పగించిన పని [16]

బలమైన ఆధారాలు తగినంతగా లేకపోయినా చాలా ప్రాంతాలలో చలికాలం వచ్చే వరకు స్థావరాలను బహుశా ఖాళీ చేసి వుండరని అనుకోవచ్చు 1998 అక్టోబరు 16 అంటే జోజిలా కనుమ ద్వారా పౌరుల రాకపోకలను నిలిపి వేసిన మరునాడు కార్గిల్‌లో తొలిసారి మంచుకురిసింది రెండు రోజులపాటు ఓ మోస్తరుగా మంచు పడినా తిరిగి జనవరి 4 రాత్రి వరకు తెరిపి ఇచ్చింది జనవరిలోను ఫిబ్రవరిలోను అడపాదడపా తేలికపాటి హిమపాతమున్నా కార్గిల్ ఎత్తుల నుంచి ఉపసంహరించుకునే పరిస్థితి తలెత్తలేదు మార్చి 8నమాత్రం పరిస్థితి దుర్భరమయిపోయింది అప్పటికే సరఫరాలు బాగా తరిగిపోయినందువల్ల తిరిగి వేసవిలో రావచ్చుననే ఉద్దేశ్యంతో బాగా ఎత్తునున్న స్థావరాలను ఖాళీ చేసి వుండవచ్చు సరిగా ఇదే సమయలోపాక్ చొరబాటుదార్లను ప్రవేశపెట్టి వుండాలి [17]

కార్గిల్ ప్రాంతంలో తీవ్రస్థాయిలో యుద్ధం జరిగిన ద్రాస్ సబ్ సెక్టారులోని అతి ఎత్తయిన స్థానాలలో 1082 వరకు చలికాలంలో సైతం కాపలా వుండే వారనే

సంగతి ఆసక్తిని రేకెత్తించేదిగా వుంది ఆ సంవత్సరం వరకు ద్రాస్ సబ్ సెక్టారు బి ఎస్ ఎఫ్ దళాల నియంత్రణలో వుంది ఎముకలు కొరికే చలిలో కూడా బి ఎస్ ఎఫ్ సైనికులు 5253 మి ఎత్తున్న మార్పోలా, 4268 మి ఎత్తున్న సాండో స్థావరాలను కనిపెట్టుకుని వున్నారు

రాజకీయంగాను, వ్యూహాత్మకంగానూ వాతావరణంలో వచ్చిన మార్పుల కారణంగా ఆ ఎత్తయిన స్థానాలను చలికాలంలో కూడా కనిపెట్టుకుని వుండడం వల్ల ఒనగూడే ప్రయోజనాలేమీ వుండవన్న నిర్ణయానికి వచ్చిన సైన్యం 1982లో బి ఎస్ ఎఫ్ దళాలను ఆ బాధ్యత నుంచి తప్పించినట్లు కనబడుతుంది 1997 నుంచి కార్గిల్ ప్రాంతంలో సరిహద్దు వద్ద ఉద్రిక్తత పెరుగుతూ రెండు పక్షాలు ఫిరంగి కాల్పుల జరపడం నిత్యకృత్యమవుతున్నా కూడా ఆలోచనలో లోపించిన చురుకుదనమే మునుపటి విధానాన్ని పున సమీక్షించకపోవడానికి కారణం మార్పొలా సాండో స్థానాల్లో చలికాలంలో కూడా దళాలను వుంచి వుంటే పాకిస్తాన్ సైనికులు ఇతరులచొరబాటును ముందుగానే పసిగట్టి వుండేవారు అంతకన్నా ముఖ్యంగా భారతీయ సైనికులు పటిష్టమైన స్థానాల్లో వుండి టోలోలింగ్ టైగర్ హిల్స్ ముష్కోలోయల్లోని తమ స్థావరాలకు పాకిస్థాన్ సరఫరాలను పంపడం కష్టమయ్యేది

కార్గిల్ ప్రాంతంలోనే తమకు అప్పగించిన ఇతర చోట్ల బి ఎస్ ఎఫ్ 1982 వరకూ అనుసరించిన స్థానే తీవ్రమైన చలికాలంలో శిఖరాగ్రాలకు కాపలా అవసరం లేదనే నూతన విధానాన్ని అనుసరించడం ప్రాముఖ్యత సంతరించుకుంటోంది ఎముకలు కొరికే చలిలో కూడా బి ఎస్ ఎఫ్ దళాలు బ్రేవో–1 ఛోర్బత్‌లా స్థావరాలను కని పెట్టుకుని వున్నాయి ఆల్ఫాటెక్రి పంజాబ్ టెక్రిల వద్ద కార్గిల్ సెక్టారులో 4500 మీ ఎత్తున వున్న స్థానాల నుంచి కూడా వారు కదల లేదు ఛోర్బత్‌లా వద్ద బి ఎస్ ఎఫ్ దళాలేగనుక లేకుంటే మియాన్ లాంగ్ పా సందు గుండా ఒక బ్రిగేడ్‌ను పంపి టర్టోక్‌ను వేరు చెయ్యడంలో పాకిస్తాన్ విజయం సాధించివుండేది ఛోర్బత్‌లా వద్ద తమపై ఎడతెరిపి లేకుండాకాల్పులు జరుగుతున్నా బి ఎస్ ఎఫ్ సైనికులు తట్టుకుని తిప్పి కొట్టడంలో సఫలమయ్యారు

నిపుణుల పేరుతో చెలామణీ అవుతున్న కొందరు ఒకరి తరువాత ఒకరుగా చలికాలంలో స్థావరాలను కనిపెట్టుకుని వుండాలంటే సియాచిన్ తరహా ప్రత్యేక పరికరాలు అవసరం అని బల్లగుద్ది చెపుతున్న సమయంలోనే బి ఎస్ ఎఫ్ స్థావరాల్లోఅటువంటి ప్రత్యేక పరికరాలే లేవని వారికి సరఫరాలు కంచరగాడిదలు బరువులూ మోసేవారి ద్వారానే జరిగాయన్నది గమనార్హం [18]

**రాజకీయ నమ్మకాలు సైనిక చర్యలు**

కార్గిల్‌లో చొరబాటుకు వీలు కల్పించిన సైనికపరమైన పొరపాట్లు ఎలా సంభవించాయి? రక్షణ వ్యవస్థ గూఢచర్య నివేదికలను పెడచెవిని పెట్టి కార్గిల్‌లో కొరగాని రక్షణ విధానాన్ని అనుసరించడానికి సైనిక సిద్ధాంతాలని ప్రభావితం చేసిన రాజకీయ అవగాహనే కారణమనేది స్పష్టం రక్షణ విషయాలకు సంబంధమైన వార్తలందించే పాత్రికేయుడు మనోజ్ జోషి 'ది సండే టైమ్స్ లో ఇలా పేర్కొన్నారు ఎన్నో సామాన్య అంశాల కలగూరగంపలా వున్న నివేదికలు పంపి అవే గూఢచారి నివేదికలనడం సబబు కాదు జరగనున్న దాని గురించి అని నిజంగా హెచ్చరికలు చేసాయా లేదా అనేది ఉన్నతస్థాయి దర్యాప్తు మాత్రమే నిర్ధారించగలదు [19] రీసెర్చి అండ్ ఎనాలిసిస్ వింగ్ (రా) కు చెందిన ఫీల్డు ఆఫీసర్లు తాము పాకిస్తాన్ చొరబాటుకు వేసుకున్న పథకాన్ని కనిపెట్టినట్లు చెప్పుకోలేదన్న విషయాన్ని పక్కన పెడితే జోషి వాదన తప్పకుండా పరిశీలించదగినది

మన గూఢచారి శాఖ నుంచి అందుతున్న సమాచారం చక్కదనంగా లేకపోయినా దారీతెన్ను లేనిదేమీ కాదు అయితే దీనిని గూఢచర్యంలో వైఫల్యాలు అనలేము గాని అసలు గూఢచారులందరీ పనితీరు ఇందుకు భిన్నంగా ఏమీ వుండదని అనుకోవచ్చు పరస్పర విరుద్ధంగా అందుతున్న గూఢచారి నివేదికల్ని సైద్ధాంతిక వ్యూహాత్మక రాజకీయ వడపోతకు గురి చేస్తేగాని వాటికి స్పష్టత చేకూరదు అలా జరగలేదనేది స్పష్టంగా తెలుస్తోంది జోషి ఇంకా ఇలా అంటారు

గూఢచర్య నివేదికలు తగిన స్థాయిలో లేకపోవడం కన్నా వున్న మేరకైనా వ్యూహాత్మక విశ్లేషణ చెయ్యలేకపోవడమే ఇక్కడ సమస్య కావచ్చంటారు 'రా' మాజీ ప్రత్యేక కార్యదర్శి వి బాలచంద్రన్ ఇంకా టూకీగా చెప్పాలంటే ఇక్కడో కొంత అక్కడ కొంతగా సమాచారం అందుతూనే వున్నా వాటిని గుదిగుచ్చి సమన్వయం చెయ్యగలిగిన వారు ఎవరూ లేకపోయారు [20]

కాని అలా సమాచారాన్ని క్రోడీకరించేవారు లేకపోవడానికి కారణం ఎమిటి? తప్పు ఎక్కడ జరిగిందో చెప్పడానికి పరిశీలకు లెవరూ సిద్ధంగా లేకపోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది రాజకీయ వర్గాలలోను అధికార యంత్రాంగంలోను వేళ్లూనుకుపోయిన సైద్ధాంతిక విశ్వాసాల పట్ల స్పష్టమైన అవగాహన లేదు సమాచారాన్ని వడపోసి విశ్లేషించే ప్రక్రియను ఈ సైద్ధాంతిక విశ్వాసాలే ప్రభావితం చేస్తుండగా ఆ ప్రక్రియలు కొన్ని అంశాలకు ప్రాధాన్యత కల్పించి కొన్ని అంశాల్ని చెత్త బుట్టలో వెయ్యడానికి కారణమయ్యాయి రాష్ట్రీయ స్వయంసేవక్ సమాజ్ (అర్ ఎస్ ఎస్) బి జె పి లకు

చెందిన రాజకీయ నేతలు అణ్వస్త్ర విరుగుడుకొక దైవత్వాన్ని ఆపాదించారు భారత్‌కేమీ కొత్తది కాని ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ 1999 మార్చి 15న వాజ్‌పేయి ఒక ప్రకటనలో ఇలా అన్నారు

'ఇప్పుడు భారత్ వద్ద పాకిస్తాన్ వద్ద అణ్వస్త్రాలు వున్నాయి ఇప్పుడిక సామరస్యంగా జీవించడం కన్న వేరే మార్గం లేదు అణు ఆయుధం దాడికి ఉద్దేశించినది కాదు ఆత్మరక్షణకు ఉద్దేశించినది శాంతి పరిరక్షణకు తోడ్పడే ఆయుధం ప్రచ్ఛన్న యుద్ధ సమయంలో బల ప్రయోగం జరగక పోవడానికి ఇరు పక్షాల్లోనూ భీతి సమతూకంలో వుండడమే కారణం [21]

ఈ రకమైన నమ్మకాలవల్లే భారత్‌కు వేల సంఖ్యలో మృతులు క్షత గాత్రులు శాశ్వతంగా అంగవైకల్యం పొందిన సైనికుల రూపంలో నష్టం వాటిల్లింది పాకిస్తాన్‌లోని కుడి పక్ష రాజకీయ వ్యవస్థ (రైట్ వింగ్)పై పోఖ్రాన్-2 వాస్తవంగా ఎంత లోతుగా ప్రభావం చూపిందో వివరిస్తూ అజీజ్ అహ్మద్ ఇలా అన్నారు

ఆఫ్ఘనిస్తాన్ యుద్ధం జియావుల్ హక్‌కు ఎలాగో అలాగే పొఖ్రాన్ అణు పరీక్ష నవాజ్ షరీఫ్‌కు ఒక వరం వంటిది తన వ్యూహాత్మక బలహీనతల నుంచి బయట పడాలని పాక్ 1971 నుంచి విఫల యత్నం చేస్తున్నది అణ్వాస్త్రాలలో సమతూకం ఆయుధాలను సమకూర్చుకోవడం ద్వారా పోటీ తత్వాన్ని ఆహ్వానించి వాజ్‌పాయి ప్రభుత్వం పాకిస్తాన్‌ను తనకు సమాన స్థాయికి పెంచింది ఇరు దేశాలు అణ్వస్త్రాలను పెంచుతున్న కొద్దీ కార్గిల్ వంటి వివాదాలు పునరావృతమవుతూనే వుంటాయి అంతేకాదు కారిల్ యుదం పొ।ఖాన్ పరిణామాలకు దర।ణం

ఇచ్చి పుచ్చుకోవడం వుండాలని పాకిస్తాన్ పట్టుపట్టింది ఉదాహరణకి ముజాహిదీన్‌లను వారి స్వస్థలాలకు పంపడంలో సహాయపడేందుకు ప్రతిగా కాశ్మీర్‌పై నిర్ణీత కాలవ్యవధిలో చర్చలు జరుపుతామని భారతదేశం హామీ ఇవ్వాలని కోరింది తనవంతుగా పాకిస్తాన్ మొత్తం లోయను ఆజాద్ కాశ్మీర్‌లోని జమ్మూలో ముస్లిం ఆధిక్యత గల ప్రాంతాలను శాశ్వత పరిష్కారంలో భాగంగా పరిగణించేందుకు సంసిద్ధత తెలుపుతోంది ఇది ఓవెన్ డిక్సన్ సూచించిన పరిష్కారానికి అనుగుణంగా వుంది

–పాకిస్తాన్ దిన పత్రిక డాన్

కార్గిల్ యుద్ధం పాకిస్తాన్ లక్ష్యాలకు సంబంధించి హేతుబద్ధమైన కారణాలేమిటనే దానికి భారతీయ అధికారుల వద్ద జవాబు లేదు శ్రీనగర్–లెహ్ రహదారిని భగ్నం చేసి సియాచిన్‌ను వేరు చేయ్యాలని పాకిస్తాన్ ప్రయత్నిస్తోందని పదేపదే వల్లిస్తున్న కారణం సంతృప్తికరంగా లేదు లేహ్‌కు అక్కడ నుంచి సియాచిన్‌కు చేరుకునేందుకు వాడకానికి అనుకూలంగా వున్న మరొక అతి చక్కటి మార్గం భారత్‌కు అందుబాటులో వుంది అది రోహతాంగ్ కనుమలోంచి పోయే కులు రహదారి పైగా ఎదో చిన్న ప్రాంతం కోసం బేరాలాడేందుకని పాకిస్తాన్ పూర్తిస్థాయి సాంప్రదాయిక యుద్ధాన్ని ఆరంభిస్తుందనేది నమ్మశక్యంగా లేదు అటు భారత్‌లోను ఇటు పాకిస్తాన్‌లోను వచ్చిన పరిణామాల ప్రోద్బలంతో సరిహద్దు రాజకీయ లక్ష్యాల ప్రమేయం ఇందులో వుందనేది స్పష్టం భారతదేశ రాజకీయ రక్షణ వ్యవస్థలు ఈ లక్ష్యాలను అర్థం చేసుకోవడంలోను వాటికి తగినట్లు వ్యవహరించడంలోను విఫలమయ్యాయి

కార్గిల్ యుద్ధం ఆరంభించడంలో పాకిస్తాన్ ప్రధాన ఆశయం రెండు అణ్వస్త్ర దేశాల మధ్య పూర్తిస్థాయి సాంప్రదాయిక యుద్ధాన్ని తెచ్చి తద్వారా జమ్మూ–కాశ్మీర్‌లో అంతర్జాతీయ మధ్యవర్తిత్వాన్ని అనివార్యం చేయడమేనని చాలా మంది వాదిస్తున్నారు కాని ఈ వ్యూహం వాస్తవ పరిణామాలెలా వుంటాయో ఎవరూ అర్థం చేసుకోలేదు పాకిస్తాన్ సైనిక చర్యకు పాకిస్తాన్ భారత్ అమెరికా దేశాల రాజకీయ వాదులే రంగాన్ని సిద్ధం చేశారని నా వాదన జమ్మూ–కాశ్మీర్‌ను మత ప్రాతిపదికన నిలువున చీల్చేందుకు వివిధ శక్తుల ప్రోద్బలంతో హిందూ–ముస్లిం రాజకీయవేత్తలు చాలా కాలంగా ప్రయత్నిస్తున్నారు పోఖ్రాన్–2 పరీక్షల అనంతరం ఈ వేర్పాటు కార్యక్రమానికి అమెరికా రహస్య ఆమోదం లభించింది వాషింగ్టన్‌లో వ్యూహకర్తలు దీనికి ప్రచారం కల్పించారు

జమ్మూ–కాశ్మీర్ భవితవ్యంపై సాగుతున్న చర్చలకు కార్గిల్ యుద్ధంతో అవరోధం ఏర్పడింది అమెరికా ఆశీస్సులతో కార్గిల్ పర్వతాల నుంచి ఉపసంహరించుకుంటే కాశ్మీర్‌ను

మరోసారి విభజించే లక్ష్యంవైపు పురోగమించవచ్చని పాకిస్తాన్ భావించింది విభజన కోసం చేస్తున్న తన తర్కానికి అనివార్యమైనందిగా తాను భావిస్తున్న ముగింపునివ్వాలనే డిమాండుపై పాకిస్తాన్ తాజా విధానం రూపొందింది ఈ అధ్యాయం ఆరంభంలో ఉటంకించిన డాన్ పత్రికలోని అజీజ్ అహ్మద్ కథనం పాకిస్తాన్ ఆర్మీచీఫ్ ముషరఫ్ అమెరికా జనరల్ కమాండ్ కమాండర్ ఇన్‌చీఫ్ వాల్టర్ జిన్నిల మధ్య సంప్రదింపులను ప్రస్తావించింది

లోయను జమ్మూలోని ముస్లిం ప్రాంతాలను ఆజాద్ కాశ్మీర్ ప్రాంతంలో విలీనం చెయ్యాలన్నదే పాకిస్తాన్ గరిష్ట డిమాండు దీనికి బహుశా భారత్ అంగీకరించవచ్చు ఈ పరిష్కారానికి ఇంత తీవ్రతలేని మరో మధ్యంతర ప్రత్యామ్నాయం రూపొందుతోందనడంలో సందేహంలేదు ఫరూక్ అబ్దుల్లా నియమించిన రీజియనల్ అటానమి కమిటీ ఎప్రిల్ 13న విడుదల చేసిన జమ్మూ-కాశ్మీర్ పునర్ వ్యవస్థీకరణ పదకం రూపురేఖలను బట్టి మనమీ నిర్ధారణకు కావచ్చు కార్గిల్ యుద్ధం ఇటీవలి పరిణామాల నేపథ్యంలో వరుసగా జరిగిన కొన్ని రాజకీయ సంఘటనల అధ్యాయం పరిశీలిస్తుంది వీటిలో దీనికే కార్గిల్ సంఘర్షణతో ప్రత్యక్ష సంబంధంలేదు కాని ప్రతి ఒక్కటి కార్గిల్ యుద్ధం మాదిరిగానే విస్తృతమైన ఒక రాజకీయ నాటకంలోని అంతర్భాగాలే భారత్‌కు లోపల వెలుపలా పనిచేస్తున్న అసంఖ్యాకమైన రాజకీయ స్వార్థశక్తులు కుమ్మక్కై జమ్మూ-కాశ్మీర్ అస్తిత్వానికి ప్రాతిపదికైన లౌకిక పునాదికి ప్రమాదకరంగా ఎలా పరిణమించాయోఈ సంఘటనలు కార్గిల్ వివరిస్తాయి

## ప్రాంతీయ స్వయం ప్రతిపత్తి కమిటీ నివేదిక

బహు విధాలుగా జమ్మూ-కాశ్మీర్‌లో లౌకికవాదం ప్రజాస్వామ్యాలపై దాడి జరుగుతున్న వైనాన్ని తెలుపుతున్న ఇటీవలి సంఘటనలకు ప్రాంతీయ స్వయం ప్రతిపత్తి నివేదిక నేపథ్యాన్ని అందిస్తుంది రీజియనల్ అటానమి కమిటీ (ఆర్ ఎ సి) విడుదల చేసిన ఈ నివేదిక చారిత్రకంగా ఏర్పడ్డ కాశ్మీర్ జమ్మూ లడఖ్ ప్రాంతాలను విడగొట్టి కొత్తరూపం ఇవ్వాలని చెబుతోంది ఇది మౌలికంగా లౌకికవాద ప్రజాస్వామ్య జమ్మూ-కాశ్మీర్‌కు లష్కరేతోయిబా తిరుగుబాటుదార్లకన్న మరింత ప్రమాదకరమైంది

ఆర్ ఎ సి ఎనిమిది కొత్త రాష్ట్రాలు (ప్రావిన్సెస్) ఏర్పాటు చేయాలని సిఫార్సు చేస్తోంది ప్రతి రాష్ట్రానికి ఎన్నికైన ప్రావిన్షియల్ కౌన్సిల్ వుంటుంది బారాముల్లా కుప్వారా జిల్లాలు కలిసి కమ్రాజ్ రాష్ట్రంగాను బడుగాం శ్రీనగర్‌లతో నుందాబాద్ రాష్ట్రం అనంతనాగ్ పుల్వామాలతో మరాజ్ రాష్ట్రం ఏర్పాడతాయి ఈ మూడు రాష్ట్రాల ఏర్పాటుకు చారిత్రకమైన కొన్ని ఆధారాలున్నప్పటికీ అందులో విజ్ఞత కనిపించదు ఈ జిల్లాల ప్రజలు స్థానికులకు మరింత అధికారం కోరుతున్న మాట నిజమేగాని లేనిపోనివి ఊహించుకుని

పాలనా పరమైన కొత్త సరిహద్దులు గీయమని కోరడంలేదు

ఆర్ ఎ సి ప్రతిపాదనలే కనుక కార్యరూపం దాలిస్తే నేషనల్ కాన్ఫరెన్సు ఝళిపిస్తున్న మతపరమైన విభజన ఖడ్గానికి దారుణంగా ముందుగా బలయ్యేది లడఖ్ ఈ కొండ ప్రాంతం బౌద్ధులు అధికంగా వుండే లెహ్ ముస్లింలు అధికంగా వుండే కార్గిల్ అనే రెండు కొత్త రాష్ట్రాలుగా చీలిపోతుంది సహేతుకమైన వివరణ ఎదీ లేకుండా 1985లో ఎర్పాటైన లడఖ్ అటానమస్ కమిటీ నుంచి కార్గిల్‌ను వేరు పరచడం జరిగిపోయింది ఇప్పడిక ఈ రెండు జిల్లాలని రెండు రాష్ట్రాలుగా రూపొందించడమంటే జాతి మతపరమైన సరిహద్దులు నిర్దేశించడమే 1996 నుంచి ఈ ప్రాంతంలో కుల ప్రాతిపదికపైనే ఓటింగ్ జరుగుతోంది 1989లో జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో నేషనల్ కాన్ఫరెన్సు కాంగ్రెస్(ఐ) బి జె పి అభ్యర్థులు ఇంచుమించు బాహాటంగానే తమ జాతి మత ప్రాతిపదికన ఓట్లు కోరడం దీనికి పరాకాష్ట కార్గిల్ శరణార్థులకు తమ జిల్లాలో ఆశ్రయం కల్పించడాన్ని లెహ్‌లోని బౌద్ధ ఛాందసవాదులు ప్రతిఘటించారంటే మత విభేదాలు ఇప్పటికే ఎంతగా ముదిరిపోయాయో అర్ధమవుతుంది

జమ్మూపై ఆర్ ఎ సి సిఫార్సులు చూపే పరిణామం మరింత నాటకీయంగా వుంటుంది దోడా జిల్లా పక్కనున్న ఉద్దంపూర్ జిల్లాలోని ముస్లిం ఆధిక్యత వున్న మాహోర్ తాలూకాలతో కొత్తగా చినాబ్‌వాలీ ప్రావిన్స్ ఎర్పాటవుతుంది హిందూ ఆధిక్యత గల జమ్మూ కటువా ఉదంపూర్ జిల్లాలు కలిసి జమ్మూ రాష్ట్రం ఎర్పడుతుంది పూంచ్ రాజోరి జిల్లాలతో పీర్ పంజాల్ రాష్ట్రం ఏర్పాటవుతుంది ఈ విధంగా ఇప్పుడున్న జమ్మూ రాష్ట్రం హిందూ ముస్లిం ఆధిక్యత అనే భౌగోళిక సరిహద్దుతో మూడు కొత్త రాష్ట్రాలుగా చీలిపోతుంది

తీవ్రమైన ఈ మార్పులకి ఆర్ ఎ సి చూపుతున్న కారణాలు ఎమిటి? ప్రావిన్సులు డివిజన్‌లుగా ఇప్పుడున్న వర్గీకరణ సామాజిక/మానవాభివృద్ధికి అవరోధంగా వుందని నివేదిక పేర్కొంటోంది 'రాష్ట్రం లోపల అట్టడుగుస్థాయిలో ప్రస్తుత ప్రజాస్వామిక భాగస్వామ్య ఎర్పాట్లు అవరోధంగా వున్నాయని కూడా కమిటీ అభిప్రాయపడింది ప్రస్తుతం వున్న జిల్లా రాష్ట్ర సరిహద్దుల లోపలనే అభివృద్ధి ఎందుకు సాధ్యం కాదో ఎక్కడా వివరించలేదు కొత్త రాష్ట్రాల ఎర్పాటు అభివృద్ధికెలా తోడ్పడుతుందనే అంశంపై లోతుగా చర్చ జరగనేలేదు కొత్త రాష్ట్రాలు జిల్లా కౌన్సిళ్ళ ఎర్పాటుకు వీలు కల్పిస్తూ జమ్మూకాశ్మీర్ రాజ్యాంగంలో కొన్ని మార్పులు తేవాలని చెప్పడం తప్ప ఎలాంటి మార్పు కావాలో ఎ మార్పులు కావాలో ఆర్ ఎ సి పేర్కోలేదు కొత్త కౌన్సిళ్ల అధికారాలేమిటో నిర్దిష్టమైన వాటి బాధ్యతలేమిటో తేల్చిచెప్పలేదు అటువంటప్పుడు ఆర్ ఎ సి ఈ సిఫార్సులు చేయడం దేనికి?

**అసలీ నివేదిక ఎలా తయారైంది?**

1996 అక్టోబరులో నేషనల్ కాన్ఫరెన్సు అధికారంలోనికి వచ్చిన కొద్ది కాలానికే

ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లా అధ్యక్షునిగా ఆర్ ఎ సి ఏర్పాటయింది అకాడమిషియన్ బల్‌రాజ్‌పురి వర్కింగ్ ఛైర్మన్‌గా వున్న ఈ కమిటీలో ఆర్థికమంత్రి మహ్మద్ షఫియూరి శాసనసభ్యులు సయ్యద్ ముస్తాక్ బుఖారి ముబారక్ గుల్ లడఖ్ ప్రతినిధి పింటోనార్బు సభ్యులుగా వున్నారు ప్రాంతీయ స్వయం నిర్ణయాధికారానికి హామీ ఇచ్చి జమ్మూ-కాశ్మీర్‌కు మరింత స్వయంనిర్ణయాధికారం కావాలని నేషనల్ కాన్ఫరెన్సు చేస్తున్న డిమాండు వల్ల రాష్ట్రంలోని అల్పసంఖ్యాకులు దూరమయిపోకుండా చూడడానికి ఆర్ ఎ సి ఆవిర్భవించింది

కొత్త ప్రావిన్సులు జిల్లాల ఎర్పాటు కోసం నేషనల్ కాన్ఫరెన్సు నేతలు ఇతర రాజకీయ నాయకుల నుంచి పూరిపై ఒత్తిడి పెరగుతోంది దానిని ఆయన నిర్ద్వంద్వంగా నిరాకరించారు ఆర్ ఎ సి కి అప్పగించిన పరిశీలనాంశాలలో కొత్త రాష్ట్రాల ప్రస్తావన ఎక్కడా లేదు "సమతుల్యమైన రాజకీయ ఆర్థిక విద్య సామాజిక సాంస్కృతిక అభివృద్ధిలో వివిధ ప్రాంతాల ప్రజలు మరింత మెరుగ్గా పాల్గొనేందుకు ప్రోత్సహించడానికి అందుకు అవసరమైన సాధనాలను అంటే వివిధ స్థాయిలలో స్థానిక అధికార కేంద్రాలని ఎర్పాటు చేయడం వంటివి సిఫార్సు చేయమనే ఆర్ ఎ సి ని కోరారు స్థానిక అధికార కేంద్రాలకి ఎ అధికారాలు ఇవ్వవచ్చు అందుకోసం రాష్ట్ర రాజ్యాంగంలో మార్పులు చేయడం అవసరమా' అనే అంశాల్ని కూడా ఆర్ ఎ సి పరిశీలిస్తుంది

1998 చివరికి పూరి ప్రాంతీయ స్వయం నిర్ణయాధికారానికి సంబంధించిన తన ప్రతిపాదనలు అందరికి పంపారు వాటిలో పంచాయతీ బ్లాకు, జిల్లా ప్రాంతీయ స్థాయిల్లో ప్రస్తుతం వున్న సంస్థలను బలోపేతం చేయడమనేది ముఖ్యమైనది స్థానిక సంస్థలకు సభ్యులను నామినేట్ చేయడానికి రాష్ట్రప్రభుత్వానికి వున్న అధికారాన్ని తొలగించాలని నివేదిక నొక్కి చెప్పింది షెడ్యూల్డు కులాలు తెగల వారు మిగతా వర్గాలంటూ రాష్ట్ర చట్టాలు అస్పష్టంగా పేర్కొన్న వారితో చేరి పంచాయతీ సభ్యుల్లో మూడు వంతుల మంది ప్రభుత్వనామినీలే ఈ రాష్ట్రానికి ప్రత్యేకమైన సంస్థాగతమైన ఒక ఏర్పాటు వల్ల జిల్లా అభివృద్ధి మండలాలన్నిటికి నేతలుగా నామినేటెడ్ వ్యక్తులే వున్నారు పూరి ఈ 'నాటకీయమైన తంతు స్థానంలో నిజమైన ప్రజాస్వామ్యాన్ని తీసుకురావాలని ప్రయత్నించారు

ఆర్ ఎ సి అందరికి పంపిన ప్రతిపాదనల ముసాయిదాల పట్ల అందులో వున్న నేషనల్ కాన్ఫరెన్స్ సభ్యులు అభ్యంతరాలు వ్యక్తం చేయకపోయినా త్వరలోనే సంబంధాలు తెంచుకుని పూరి నివేదికకు తమ మద్దతులేదని ప్రకటించారు ఈ ఏడాది జనవరి 21న తనతోపాటే ఆర్ ఎ సి పనిచేసే కాలం ముగిసిందని పూరికి తెలిపారు ఆర్ ఎ సి పని చేసే కాలాన్ని వెనుకటి తేదీ నుండి పొడిగిస్తున్నట్టుగా రాష్ట్రప్రభుత్వం మార్చి 4న ఉత్తర్వులు జారీ చేసింది ఐతే వర్కింగ్ ఛైర్మన్ తప్ప మిగిలిన అందరి పదవీ కాలాన్ని పొడిగించడంలో

రాష్ట్రప్రభుత్వం ఆంతర్యం ఎమిటో అంతుపట్టనిదిగా వుంది కేవలం మూడు నెలలోగానే కొత్త నివేదిక తయారైంది జమ్మూ-కాశ్మీర్ రాష్ట్ర శాసనసభకు సమర్పించిన ఆర్ ఎ సి తుది నివేదికపై కమిటీ ఛైర్మన్ (ముఖ్యమంత్రి) సంతకంగాని నార్బు సంతకం గాని లేకపోవడం మరో వింత

వింతగొల్పే ఆర్ ఎ సి చరిత్ర విడ్డూరమనిపించే దాని సిఫార్సులు పరిశీలిస్తే అర్థవంతమైన ప్రజాస్వామిక మార్పులు తెచ్చే ఆలోచన నేషనల్ కాన్ఫరెన్సుకు ఎకోశానా లేదని అనిపిస్తుంది భారీస్థాయిలో అభివృద్ధి పనులు చేపట్టడానికి తగిన వనరులు వాటికి వుండని కారణంగా చిన్న రాష్ట్రాలు ఎర్పాటు చేసే ప్రతిపాదన ప్రస్తుతమున్న రాష్ట్రాల అధికారాలను హరించివేస్తుంది పంచాయతీలు బ్లాకుల స్థాయిలో స్థానిక సంస్థలకు సాధికారతగాని ప్రజాస్వామ్యంగాని సిద్ధించవు ఊహాజనితమైన జమ్మూలోని పట్టణ ప్రాంతపు హిందూ వాణిజ్య వర్గాల గుత్తాధిపత్యం తగ్గించి జమ్మూ ప్రాంతంలోని ముస్లిం వర్గాలకు తామే సంరక్షకులమని ప్రకటించుకునే అవకాశాన్ని జమ్మూ ప్రాంతపు నేషనల్ కాన్ఫరెన్సు నేతలకు కల్పించడమే ఆర్ ఎ సి ప్రతిపాదనల ఎకైక లక్ష్యంగా కనబడుతోంది

## కాశ్మీర్‌లో అమెరికా చొరవ

మరిక ఆర్ ఎ సి మనసులో వున్నదేమిటి? గత మే నెలలో పోఖ్రాన్ అణుపరీక్షలు జరిగి, దరిమిలా వాజ్‌పేయి-షరీఫ్‌ల మధ్య సత్సంధాలకు గండిపడిన నేపథ్యంలో జమ్మూ-కాశ్మీర్ సమస్యకు తుదిపరిష్కారం విషయంలో తమ ధృక్పధాన్ని అమెరికా రాజకీయ వ్యవస్థ చూచాయగా వెల్లడిచేసింది ఉన్నతస్థాయి సమాలోచన బృందం కాశ్మీర్ స్టడీ గ్రూప్ పంచిపెట్టిన 'కాశ్మీర్ ఎ వేఫార్వర్డ్' (కాశ్మీర్‌లో ముందంజకు మార్గం) అనే నివేదిక రూపంలో ఇది వెల్లడయింది ఫరూఖ్ ఖత్వారి అనే ప్రవాసభారతీయుడు ఈ కాశ్మీర్ అధ్యయన బృందాన్ని నియంత్రిస్తున్నారు భారత పాలన వ్యవస్థలో పని చేసిన ఇద్దరు మాజీలు మాజీ విదేశాంగ కార్యదర్శి ఎన్ కె సింగ్ రిటైర్డ్ వైస్ అడ్మిరల్ ఎస్ కె నాయర్‌లు కూడా ఈ బృందంలో వున్నారు ఐతే వీరిద్దరూ కూడా నివేదికలో ప్రధానాంశాన్ని తాము సమర్ధించడంలేదని అంటున్నారు

మాజీ సంస్థానమైన జమ్మూ -కాశ్మీర్ లో కొంత భాగాన్ని ఒక సర్వసత్తాక రాజ్యంగా పునర్ వ్యవస్థీకరించాలి భారత్ – పాకిస్తాన్‌ల నుంచి అక్కడికి స్వేచ్ఛగా రాకపోకల సౌకర్యం వుండాలి' అని కాశ్మీర్ ఎవేఫార్వర్డ్' అనే నివేదిక సలహా ఇస్తోంది రాష్ట్రంలోని రాజకీయ వాదులందరికీ విస్తృతంగా పంపిణీ చేసిన ఈ నివేదిక కొత్త రాజ్యానికి స్వంత శాసనసభ పౌరసత్వం శాంతి భద్రతల వ్యవస్థ వుండాలని ఐతే దాని రక్షణకు మాత్రం పాకిస్తాన్ భారత్‌లు హామీ వుండాలని కూడా చెబుతోంది నివేదిక పేర్కొన్న కొంత భాగం కాశ్మీర్‌లోయే

నని తెలుస్తూనే వుంది అత్యంత వివాదాస్పదంగా వున్న ప్రాంతమూ అదే నివేదిక విడుదలయిన కొద్దిరోజులలోనే ఖత్వారి భారత్‌ను సందర్శించి రాజకీయ నాయకుల్లో వివిధ స్థాయిల వారిని భిన్న పార్టీల వారిని కలుసుకోడం అసక్తిని రేకెత్తించే అంశం

క్లుప్తంగా కాశ్మీర్ స్టడీ గ్రూపు ప్రతిపాదన సారాంశం జమ్మూ నుంచి కాశ్మీర్‌ను వేరు చేసి రాష్ట్రాన్ని మత ప్రాతిపదిక పై విభజించడం కాశ్మీర్ సమస్యపై ఐక్యరాజ్య సమితి తరపు మధ్యవర్తి ఓవెన్ డిక్సన్ 1950లో ఇటువంటి పథకాన్ని సూచించారు ముస్లిం జనాభా అధికంగా వుండే దోడా రాజోరి పూంచ్ ప్రాంతాలను జమ్మునుంచి వేరు చేసి కాశ్మీర్ లోయలో కలిపేలా అంతర్జాతీయ సరిహద్దు చీనాబ్‌నదికి ఉత్తరంగా సాగాలని డిక్సన్ పదకం చెప్పింది హిందూ కటువా జమ్మూ ప్రాంతాలు భారత్‌లో వుంటాయి చివరికి అనేక కారణాల వల్ల ఈ ప్రతిపాదన భారత్‌లోని రాజకీయ వ్యవస్థకు ఆమోదయోగ్యం కాలేదు

ఇద్దరు మితవాద ప్రధానుల మధ్య సమావేశం జరుగుతున్న నేపథ్యంలో అమెరికా ఈ పథకాన్ని తిరగదోడడం ప్రాముఖ్యత సంతరించుకుంది మరికొద్ది కాలానికి పాకిస్తాన్ విదేశాంగ మంత్రి సర్తాజ్ అజీజ్ జిల్లాల వారీగా జమ్మూ –కాశ్మీర్‌లో ప్రజాభిప్రాయ సేకరణ(రిఫరెండం) జరగాలని పిలుపు నిచ్చారు అది చారిత్రకంగా ఆదేశం అనుసరిస్తున్న వైఖరి నుంచి వైదొలగడమే నన్న అంశాన్ని ఎవరూ గుర్తించలేదు [3] చివరికి డోగ్రా రాజవంశ ప్రముఖుడు కరణ్ సింగ్ నుంచి ఉద్దంపూర్ బి జె పి పార్లమెంట్ సభ్యుడు చమన్‌లాల్ గుప్తా సోదరుడు వాణిజ్య వేత్త అయిన రమేష్ గుప్త వరకు హిందుత్వ ప్రముఖులు కూడా ఎదో ఒక రూపంలో జమ్ము–కాశ్మీర్ నుంచి వేరు చేయాలని కోరారు

1988లో తీవ్ర వాద చర్యల వల్ల లోయ నుంచి బయట పడిన కాశ్మీరి పండిట్ సమాజం కూడా చాలాకాలంగా జీలం నదికి ఈశాన్యంగా జమ్ము –కాశ్మీర్ నుంచి హిందువుల కొక స్వంత గడ్డను విడదీసి ఇవ్వాలని దానికి కేంద్రపాలిత ప్రాంతపు ప్రతిపత్తి వుండాలని కోరుతూ వుండడం ఆసక్తి దాయకం పండితుల సంస్థలు ముఖ్యంగా వాటన్నిటిలోకి పెద్దదయిన పానున్ కాశ్మీర్ గాదాపు ఆగస్టు నెలంతా ఈ ఆలోచనకు అంతర్జాతీయ మద్దతు కూడగట్టుకోవడానికి వెచ్చించాయి పానున్ కాశ్మీర్ ప్రతినిధులు ఆగస్టుఆరు న వాషింగ్టన్‌లో భారత దేశం పక్షాన వున్న కాంగ్రెసు సభ్యుల బృందాన్ని కలిసి అమెరికా తమను కాందిశీకుల బృందంగా గుర్తించి ఆర్థిక సహాయం అందించాలని విజ్ఞప్తి చేసారు పాకిస్తాన్‌ను తీవ్రవాద రాజ్యం (టెర్రరిస్టు స్టేట్)గా ప్రకటించాలని కూడా ఈ సంస్థ కోరింది పానున్ కాశ్మీర్ సైద్ధాంతిక పునాదులకు అధారమైన మితవాద హిందుసంస్థలు కూడా చాలా కాలంగా అందుకోసం డిమాండ్ చేస్తున్నాయి (5)

మాజీ పాకిస్తాన్ ప్రధాన మంత్రి బెనజీర్ భుట్టో కూడా అమెరికా ఆమోద ముద్రవున్నట్లు కనిపిస్తున్న ఒక సూత్రాన్ని వ్యక్తం చేస్తున్నారు దానినామె జమ్మూ –కాశ్మీర్ సమస్య తుది పరిష్కారానికి తెలిసివేస్తున్న ముందడుగుగా అభివర్ణిస్తున్నారు (డెలిబరేట్ ఇంక్రిమెంటల్ అడ్వాన్స్) కాశ్మీర్‌లోని ఈ రెండు భాగాలు రాకపోకలకు స్వేచ్ఛ వున్న సరిహద్దును కలిగి వుండాలి ' అని కూడా ఆమె సూచించారు ఈ సూచనకు బట్వారి గారి కాశ్మీర్ అధ్యయన బృందం సూచనకు చాలా దగ్గర పోలికలున్నాయి స్థానిక ప్రజల ఆకాంక్షలు భారత్–పాకిస్తాన్‌ల రక్షణావసరాలకు అనుగుణంగా కాశ్మీర్ సమస్యకు తుది ८ ధికారిక పరిష్కారాన్ని కనుగొనేందుకు ఇరుపక్షాలు చర్చలు ప్రారంభించడానికి ముందు –

రెండు భాగాల నుంచి సైన్యాలు ఉపసంహరించాలి అంతర్జాతీయ శాంతి పరిరక్షక దళంగాని సంయుక్త భారత – పాక్ శాంతి పరిరక్షక దళాలు గాని గస్తీ నిర్వహించాలి రెండు శాసన మండలులు వేటి కవి సమావేశమవుతూ ఎప్పుడైనా సంయుక్త సమావేశాలు నిర్వహించుకుంటాయి విభజిత కాశ్మీర్‌లోని రెండు విభాగాలలోనే ప్రజలు స్వేచ్ఛగా ఎ లాంఛనాలు లేకుండానే కలుసుకునే వీలుండాలి ఈ చర్యలేవి ఈ వివాదగ్రస్త ప్రాంతంపై రెండు దేశాల వైఖరుల వ్యతిరేక భావాలను ఊహించరాదు ముందుగానే ఆయా దేశాలు ఒక నిర్ణయానికి రాగూడదు

ఈ పథకం వల్ల ప్రధానంగా లబ్ధిపొందేది అమెరికాయే నన్న సంగతి గ్రహించడానికి శ్రమపడనక్కరలేదు జమ్మూ లడఖ్‌ల నుంచి వేరుపడిన కాశ్మీర్ చాలవరకు స్వయం ప్రతిపత్తిని కలిగివున్నా వాస్తవంలో అది అమెరికా రక్షణ విషయంలో ఇచ్చే హామీలపై ఆధారపడి వుంటుంది ఆపైన అది హిమాలయాల్లో ఆఫ్గనిస్తాన్ చైనా భారతదేశం పాకిస్తాన్‌లను గమనించడానికి అనువైన సామ్రాజ్యవాద రక్షిత రాజ్యంగా వుంటుంది

## భారత్‌లో మతతత్వ వాదులు - అమెరికా లక్ష్యాలు

జమ్ము –కాశ్మీరులో అమెరికా మద్దతుతో రక్షిత రాజ్యాన్ని ఏర్పాటు చేయడానికి జాతీయ అంతర్జాతీయ స్థాయిలో ప్రయత్నాలు చేస్తున్న సూత్రధారులెంత ముఖ్యులో రాష్ట్రంలోని స్వంత రాజకీయ వ్యవస్థలో పాతుకుపోయిన పాత్రధారులూ అంతే ముఖ్యులు జాతి మత వైవిధ్యం వున్నా సాంస్కృతిక ఎకత్వంకల జమ్ము ప్రాంతం కాశ్మీర్ కేంద్రబిందువుగా సాగుతున్న వేర్పాటువాదానికి ప్రధాన అడ్డంకిగా వుంటూ వచ్చింది 1996 నుంచి నేషనల్ కాన్ఫరెన్సులో పలుకుబడిగల కొందరు ఈ జమ్మూ స్వభావ స్వరూపాలు మార్చివేసేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు రాష్ట్రంలో ప్రాంతీయ గుర్తింపు ప్రాతిపదికగా పునర్ వ్యవస్థీకరణ జరగాలని వాదిస్తున్న ప్రముఖుల్లో రాజోరి శాసన సభ్యుడు పాఠశాల విద్యామంత్రి

మహ్మమ్మద్ షరీఫ్ తారిఖ్ సూరన్ కోట్ వ్యవసాయ శాఖ మంత్రి నిస్సార్ అహ్మద్ ఖాన్ మెంధార్ ఎం ఎల్ ఎ ఆర్థిక శాఖ మంత్రి మహ్మద్ షఫీ యూరి వున్నారు

నేషనల్ కాన్ఫరెన్సుకు చెందిన ఈనలుగురు నేతలు (డిక్సన్ పధకం ఫలించి వుంటే చీనాబ్‌కు ఉత్తర దిశలో పాకిస్తాన్‌లో వుండాల్సిన) ముస్లిం ఆధిక్యతగల జమ్మూ ప్రాంతానికి చెందినవారు 1996లో ఈప్రాంతానికి చెందిన నేషనల్ కాన్ఫరెన్సు నాయకులు ముస్లింలు బాగా అధిక సంఖ్యలో వున్న రాజోరి, పూంచ్‌ప్రాంతాన్ని జమ్మునుంచి విడదీసి కాశ్మీర్ ప్రాంతానికి ఉత్తరంగా వున్న ఏరియాలో విలీనం చేస్తూ కొత్త పహారి' ప్రాంతాన్ని ఎర్పాటు చేయాలని డిమాండ్ చేశారు

జమ్మూ నుంచి వేరుచెయ్యాలని కోరుతూ విశాలమైన దోడా జిల్లాలోని నేషనల్ కాన్ఫరెన్సు పక్షం కూడా డిమాండ్ చేసింది దోడాలోని కారారాలో ముస్లిం గ్రామీణులను ఊచకోత కోసిన సంఘటన జరిగాక స్థానిక ఎం ఎల్ ఎ ఖాలిద్ సుహ్రావర్ది జమాతె ఇస్లామీకి చెందిన సయీదుల్లా తాంత్రేతో ఒకే వేదికపై ప్రసంగించేందుకు సిద్ధపడ్డారు (7) కాశ్మీరులోయలో వారిద్దరూ బద్ధశత్రువులు ఈపొత్తులు తాత్కాలిక రాజకీయ ప్రయోజనాల కోసం పెట్టుకున్నవే ఉదాహరణకు పహార్ జిల్లా కోసం చేస్తున్న డిమాండు ఎంతో కాలంగా కాంగ్రెసు(ఐ)కి మద్దత్తునిస్తున్న గుజ్జర్ బకెర్వాల్ నాయకుల పలుకుబడిని తగ్గించేందుకు ఉద్దేశించినది అయితే అందుకు వారు చూపుతున్న కారణం – ఆ ప్రాంతాలకు, జమ్మూకు ఉమ్మడి సంస్కృతి లేదన్నది – ఇది పూర్తిగా అసంబద్ధమైనది

1998 నుంచి జరిగిన సంఘటనలు డిక్సన్ పధకాన్ని పోలిన ప్రతిపాదనలకు కట్టుబడిన రాజకీయ శక్తులకు జమ్మూ కాశ్మీర్‌ను మరోసారి విభజించవచ్చనే నమ్మకాన్ని కలిగించాయి గత రెండేళ్ళుగా జమ్మూ–కాశ్మీర్ అంతటా మతం పేరిట జరిగిన ఊచకోతల వల్ల చీనాబ్ ఆవలకు ప్రజలు వలసలు పోవడం అందుకు ఊతమిచ్చింది (8) ఈపరిణామాలు వ్యూహాత్మకంగాను సైనికపరంగాను తీవ్రమైన పరిస్థితులకు దారితీసేవిగా వున్నాయి కొత్త ఢిల్లీకి ఈ సంఘటనల పట్ల అవగాహన అంతంత మాత్రం అనుకుంటే ఆసక్తి ఇంకా తక్కువ 1999 వసంత కాలంలో భారతదేశ కాశ్మీర్ విధానంగా చెలామణిలో వున్నది విధేయులైన అధికార యంత్రాంగం గురకగా వర్ణించవచ్చు

## మరో తరహా స్వయం ప్రతిపత్తి

నేషనల్ కాన్ఫరెన్సు ప్రాంతీయ స్వయం ప్రత్తిపై రూపొందించిన నివేధిక అమెరికా ఆశీస్సులున్న రెండవ విభజన పధకాలకు ప్రజా స్వామిక ప్రత్యామ్నాలేవైనా వున్నాయా ? ఇంతవరకు జమ్మూ–కాశ్మీరుకు మరింత స్వయం ప్రత్తి అనే ఆశయానికి కట్టుబడి వున్న నేషనల్ కాన్ఫరెన్స్ తాను సాంప్రదాయంగా అనుసరిస్తున్న లౌకికవాదానికి కొత్తగా

నెత్తికెత్తుకున్న హిందుత్వానికి  మధ్య నలిగిపోతూ క్రమంగా ఆ ఆశయానికి దూరం కాజొచ్చింది  ఆర్ ఎ సి  నివేదిక విడుదల సమయంలోనే మరో కమిటి రాష్ట్ర స్వయం ప్రతిపత్తి నివేదిక విడుదల చేసింది  1996లో రాష్ట్రానికి 'రాజీలేని గౌరవ ప్రదమైన అర్ధవంతమైన స్వయం ప్రతిపత్తిని సాధిస్తామని నేషనల్ కాన్ఫరెన్సు తాము చేసిన ఎన్నికల వాగ్దానాన్ని నిలబెట్టుకొనేందుకు ఏర్పాటు చేసిన స్టేట్ అటానమి కమిటీ - ఎస్ ఎ సి 1999 మార్చిలో తన పరిశోధన ఫలితాల్ని వెల్లడించింది

ఎస్ ఎ సి  నివేదిక భారతదేశంలోని మిగిలిన రాష్ట్రాలమాదిరిగా కాక జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రం ఒక్కటే భారత్‌లో విలీనానికి షరతులను చర్చించిందనే అంశాన్ని పునరుద్ఘాటిస్తూ ప్రారంభమవుతుంది  ఈచర్చల ఫలితంగానే రాష్ట్రం ఉనికికి  ఆధారమైన రాజ్యాంగంలోని 370 అధికరణం రూపొందిందని  దానిని రద్దు చేయాలని కోరేవారు అర్ధం  చేసుకోవడం లేదు  అధికరణం 370 లో రాష్ట్రానికి సంబంధించి ఆరు ప్రత్యేక అంశాలున్నాయి  జమ్మూ-కాశ్మీర్ తన స్వంత రాజ్యాంగం కలిగి వుండడానికి అనుమతించడం రాష్ట్రపరిపాలనా విషయాలలో భారతరాజ్యాంగంలోని నిబంధనల నుంచి మినహాయింపు  విలీన పత్రంలో పేర్కొన్న మూడు అంశాలకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వ అంగీకారం లేకుండా జమ్మూకా-శ్మీరుకు చట్టాలను రూపొందించడానికి పార్లమెంటుకున్న అధికారాల కుదింపు వీటిలో ముఖ్యమైనవి  రాజ్యాంగంలోని అంశాలను జమ్మూ కాశ్మీరుకు వర్తింప చేయడానికి కేంద్ర చేపట్టే చర్యలకు రాష్ట్ర ప్రభుత్వం సమ్మతించినా  ఆ రాష్ట్ర స్వంత రాజ్యాంగ సభ అమోదం తెలపాలని స్పష్టం చేస్తున్న అధికరణం 370 (2) స్వయం ప్రతిపత్తికి పెద్దపీట వేస్తుంది

జమ్మూ -కాశ్మీర్ రాజ్యాంగ సభ తన పని పూర్తి చేసింది  కాబట్టి కేంద్రం తన అధికారాలను వర్తింప చేయడం ఇకపై సాధ్యం కాదు   కాని రాజకీయాలు జమ్మూ-కాశ్మీరును  అతి త్వరితంగా మరో మార్గానికి మళ్లించాయి  ప్రజా పరిషత్ ఆధ్వర్యంలో హిందూ ఛాందస వాదుల సమీకరణపట్ల కినుకతో షేక్ అబ్దుల్లా పశ్చిమదేశాలతో మంతనాలు సాగించి నెహ్రూ ఆగ్రహానికి గురయ్యారు  అబ్దుల్లా జైలులో వుండగా కేంద్రం తన అధికారాలను మరింత పెంచుకుంది  విలీన పత్రంలో మినహాయించిన అంశాల్లో సైతం జమ్మూ -కాశ్మీర్ కోసం పార్లమెంటు చట్టాలు తెచ్చేందుకు  వీలు కల్పిస్తూ రాష్ట్రపతి 1954 లో ఒక ఆర్డినెన్సు జారీ చేసారు  ఇప్పుడు భారత రాజ్యాంగంలోని 395 అధికరణాల్లో 260 అధికారాలను కేంద్ర ఉత్తరువులతో జమ్మూ-కాశ్మీరుకు వర్తింపచేయ వచ్చునని ఎస్ ఎ సి  నివేదిక పేర్కొంటుంది  మిగితా 135 అధికరణాలు రెండు చోట్లా ఒకే విధంగా వున్నాయి

రాష్ట్ర స్వయంప్రతిపత్తిని నీరు కార్చిన రాష్ట్ర రాజకీయాలకిది ప్రతీకగా వుంది 1954 నాటి పరిస్థితిని పునరుద్ధరించాలనే వాదనతో ఎస్ ఎ సి ఈ సమస్యను పరిశీలించడానికి పూనుకుంది ఉదాహరణకి ఎస్ ఎ సి మాట చెల్లేట్లయితే దేశ రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులికపై జమ్మూకాశ్మీరుకు వర్తించవు ఆదేశికసూత్రాలు మాత్రమే వుండే జమ్ము–కాశ్మీర్ రాష్ట్ర రాజ్యాంగంలో ప్రత్యామ్నాయంగా ప్రాథమిక హక్కులపై ప్రత్యేక అధ్యాయాన్ని చేర్చాల్సి వుంటుంది జమ్మూ–కాశ్మీరు సుప్రీంకోర్టు పరిధిలోనికి రాదు భారత్ ఎన్నికల సంఘం కాక రాష్ట్ర ఎన్నికల సంఘమే అక్కడ ఎన్నికలు నిర్వహిస్తుంది ఇంకా ముఖ్యంగా ఆ రాష్ట్రానికి చట్టాలు చేసేందుకు పార్లమెంటు కున్న అధికారాలు రక్షణ విదేశీ వ్యవహారాలు రాకపోకల వ్యవస్థలకే పరిమితమవుతాయి

రాజకీయ లబ్ధికోసం స్వయం ప్రతిపత్తి నివేదికను నేషనల్ కాన్ఫరెన్సు హస్తగతం చేసుకుందని ఎస్ ఎ సి నివేదిక తెలుపుతుంది ఈ నివేదిక ముఖ్య ప్రయోజనం ఎన్నికల ఎరగా వినియోగించుకునేందుకే అనిపిస్తుంది రాజకీయ నేతలను నమ్మి జమ్మూ –కాశ్మీర్ ప్రజలే కాదు ఎవరూ కూడా తమకోసం ప్రాథమిక హక్కులను రూపొందించే పనిని వారి చేతిలో పెట్టరు అలాగే సుప్రీం కోర్టుకు అప్పీలు చేసుకునే హక్కును కోల్పోవడానికి ఇష్టపడరు భారతయూనియన్ తీర్చలేని ఆశలు రేకెత్తించడం ద్వారా ఆకాశకుసుమంగా వుంటున్న ఫెడరల్ అటానమీకి తానే అసలైన వకాల్తాదారుగా నిరూపించకోవాలన్నది నేషనల్ కాన్ఫరెన్సు లక్ష్యం వాస్తవ పరిస్థితుల్ని ఆకళింపు చేసుకొని జమ్మూ –కాశ్మీరు, భారత సమాఖ్యల మధ్య సంబంధాలని అర్ధవంతగా పునరుద్ధరించేందుకు ఎస్ ఎ సి నివేదిక ఎటువంటి ప్రయత్నం చేయలేదు

అసలైన స్వయం ప్రతిపత్తి ప్రజాస్వామిక పద్ధతిలో చర్చలద్వారానే రావాలి కాని నేషనల్ కాన్ఫరెన్సు కది సమ్మతంకాదు గ్రామ స్థాయి వరకు జమ్మూ –కాశ్మీరు ప్రాంతాలకి అధికారం బదలీ చేయడమనే బృహత్ కార్యక్రమం బల్‌రాజ్ పురి ఊహించినట్లు జరిగితే ఈ స్వయం ప్రతిపత్తి కొక ప్రయోజనం వుంటుంది హిందు మతతత్వ పునరుద్ధరణ జరుగుతున్న సమయంలో రాష్ట్ర ప్రజల సాంస్కృతిక మతహక్కులకు ఖచ్చితమైన హామీకి అది సంకేతం అవుతుంది కాని ఎస్ ఎ సి నివేదిక కి వేమి పట్టలేదు ఆర్ ఎ సి నివేదిక నేపథ్యంలో దీన్ని పరిశీలిస్తే, కేంద్రం రాష్ట్రాల మధ్య సంబంధాలను మొదటికి తెచ్చే కార్యక్రమం రాష్ట్రాన్ని ముక్కలు చేయడానికి వుద్దేశించిన అమెరికా ప్రేరేపిత పథకానికి చట్టబద్ధమైన వ్యవస్థను సృష్టించడం తప్ప సాధించేదేమి వుండదు

# జమ్ము కాశ్మీర్‌లో మతతత్వ వ్యాప్తి

కాశ్మీర్‌లో హిందు –ముస్లిం సమస్యేలేదు
అసలా భాషనే మేము కాశ్మీర్‌లో ఉపయోగించం

**షేక్ మహ్మాద్ అబ్దుల్లా 1948**

అర్ధ శతాబ్దం కిందట న్యూయార్క్‌లో షేక్ అబ్దుల్లా ఈ ప్రకటన చేసినప్పటికీ ఇప్పటికీ కాశ్మీర్ ఎంతో మారిపోయింది విస్తృత ప్రచారం పొందిన బి జె పి ప్రభుత్వపు సానుకూల క్రియాశీల (ప్రో ఆక్టివ్) వ్యూహాలు తీవ్ర వాదాన్ని ఎదుర్కొనేందుకు తగిన అర్థవంతమైన సిద్ధాంతాలు కాకపోగా జమ్ము – కాశ్మీర్‌లోని తీవ్రవాదం దేశమంతటా వున్న మతకలహాల చట్రంలోనికి ఇమిడి పోయేందుకు దోహదం చేసాయి ఇది విపత్కర పరిణామాలకు దారితీసింది కిందటి అధ్యాయంలో నేను తర్కించిన విధంగా రాష్ట్రాన్ని ముక్కలు చేసేందుకు రాజకీయాలు ఒక మార్గం అయితే హింస మరో మార్గం!

## కార్గిల్ అనంతరం మతపరమైన ఊచకోత

కార్గిల్ యుద్ధ సమయంలోనే జమ్మూ – కాశ్మీర్‌లో మతపరమైన భయోత్పాతం తలెత్తడం కాకతాళీయం కాదు అక్కడ కూడా పూర్తి స్థాయిలో తిరుగుబాటు జరుగుతోందనే సాకుతో కార్గిల్‌ను లేహ్ ప్రాంతం నుంచి వేరు చేయడమే యుద్ధం ఆరంభించడం వెనుకనున్న పాకిస్తాన్ లక్ష్యమయితే జమ్మూ–కాశ్మీర్‌లోని వివిధ మతాల మధ్య పొడచూపుతున్న చీలికల్ని మరింత పెద్దవి చేయడానికి తిరుగుబాటుదారులు మతం పేరిట మారణ హోమాన్ని ప్రధాన ఆయుధంగా వాడారు ఇలా ఊచకోత జరిగినపుడల్లా ముస్లిం ఆధిక్యతగల కాశ్మీర్ భాగం నుంచి చీనాబ్ నదికి ఉత్తరానవున్న జమ్ము ప్రాంతం నుంచి హిందువులు వలస పోయారు అలాగే హిందూ ఛాందసవాదుల ప్రోద్బలంతో ముస్లింలపై జరిగిన దాడులు హిందు ఆధిక్యతగల ప్రాంతాల నుంచి వలసలకు కారణం అయ్యాయి ఒక్కోసారి ఈ దాడులకు భద్రతా దళాల మద్దతు వుండేది ఊచకోతలు వాటికి ప్రతిగా దాడులతో పలురూపాల్లో డిక్సన్ పథకం వాస్తవానికి మరింత చేరువవుతోంది

1999 వేసవిలో ఒక పక్క కార్గిల్ యుద్ధం జరుగుతూ వుండగానే పలు మార్లు మత పరమైన మారణకాండ చెలరేగింది జూన్ 29 రాత్రి అనంతనాగ్‌కు 9 కి మీ దూరంలోని సాదు గ్రామంలో మధ్యప్రదేశ్‌లోని బిలాస్‌పూరు ఉత్తర ప్రదేశ్‌లోని ఇటావా ల నుంచి వచ్చిన 12 మంది ఇటుకల బట్టీ కార్మికులను కాల్చి చంపారు వీరి పైనే ఎందుకు గురి పెట్టారో ఎవరూ సరిగా చెప్పలేక పోతున్నారు ఈ ఊచకోతను సాగించిన

హిజబుల్లా ముజాహిదీన్‌కి చెందిన సజ్జాద్ 'గ్రెనేడ్' మాగ్రే విభాగం ముందెన్నడూ మతపరమైన నేరాలకు పాల్పడిన దాఖలాలు లేవు

అంతకు ఒక వారం కిందట షాహీన్ అనే గుప్తనామం గల ఆ వర్గానికి చెందిన ఒక బాంబు తయారీ నిపుణుడిని కాల్చి చంపిన భద్రతా దళాల దృష్టి మరల్చడానికి ఈదాడి జరిపివుంటారని కొందరు విశ్వసిస్తున్నారు ప్రశాంతంగా బ్రతకాలనుకుంటే రక్షణ రుసుము చెల్లించుకోవడం ఎంత ముఖ్యమో స్థానిక వ్యాపారులకు తెలియచెప్పడానికి ఈ హత్యలు జరిగాయని మరి కొందరు అంటున్నారు పరిశీలకుల్లో కొందరయితే అచ్చాబాల్‌కి చేరువలో వున్న ఖుంద్రాకి కాపలా వున్న సైనికులను అక్కడ నుంచి కదిలేలా చెయ్యడమే హిజబుల్లా మొజాహిదీన్ ఆశయం అని వాదిస్తున్నారు అచ్చాబాల్‌లో సైన్యానికి చెందిన అతి పెద్ద ఆయుధాగారం వుంది ఇందులో నిజా నిజాల మాట ఎలా వున్నా ఈ హత్యల వల్ల జమ్మూ కాశ్మీర్‌లోని ముస్లిం ఆధిక్యతగల ప్రాంతాల నుంచి పెద్ద సంఖ్యలో వలస కూలీలు తరలి వెళ్లిపోయారు ఆ ప్రాంతానికి మిగిలిన భారత దేశంతో వున్న ఆర్థిక సంబంధాలు తెగిపోవడమే కాక రాష్ట్రం మొత్తం మీద మత పరమైన ఉద్రిక్తత మరింత ప్రస్ఫుటమైంది

సాందు హత్యలు జరిగిన మరో రెండు రోజులకే పూంచ్ జిల్లాలోని మెంధార్ గ్రామంలో తొమ్మిది మంది హిందువులు హత్యకు గురయ్యారు స్థానిక శక్తులే ఈ సారి హింసకు ప్రోద్బలం ఎప్రిల్ నెలలో షేర్ మహ్మద్ కూతురు కౌసర్ మోహన్‌లాల్-కౌసల్యాదేవీల కుమారుడు శంకర్ లాల్ కలిసి లేచిపోయారు తమ కుమార్తెను అపహరించారని ఆరోపిస్తూ ఆమెను అప్పగించాలని షేర్ మహ్మద్ కుటుంబాన్ని డిమాండ్ చేసింది పోలీసులు కేసు నమోదు చేసుకుని దర్యాప్తు ప్రారంభించారు హిందు మత రాజకీయవాదులు శంకర్ లాల్ కుటుంబం పక్షం వహించారు

షాహీన్ కౌసర్, శంకర్‌లాల్‌ల వివాహం హిందు మతవాదులకు గర్వకారణం అయింది షాహీన్ కౌసర్, శంకర్ లాల్‌ల ఆచూకీ కోసం వెతుకుతూ ఒక పోలీసు బృందం జమ్ములోని ఆర్ ఎస్ స్ కేంద్రాన్ని సందర్శించినపుడు సబ్ ఇన్‌స్పెక్టర్ ప్రేమ్‌నాథ్, అసిస్టెంట్ సబ్ ఇన్‌స్పెక్టర్ మోహన్ సింగులపై దాడి జరిగింది హిందువును వివాహమాడాలన్న షాహీక్ కౌసర్ నిర్ణయంవల్ల తమ గౌరవానికి భంగం కలిగిందని భావించిన ముస్లిం మత శక్తులు తమ పరువు దక్కించమని తీవ్రవాదులను ఆశ్రయించారు వివాహానికి ప్రతీకారంగా జరిగిన దాడిలో 95 ఏళ్ళ జీవన్‌దాస్ ఆయన భార్య 87 ఎళ్ళ ఇష్రోదేవి మరో ఇద్దరు పసివారు ప్రాణాలు కోల్పోయారు

మతోన్మాదం పరువు ప్రతిష్టలనే పెత్తందారీ విలువలే జమ్ము కాశ్మీర్‌లో

ఊచకోతలకు ముఖ్యప్రేరణ జూన్ 28న సూరన్ కోటవద్ద నున్న మొహ్రాబచ్చాయి పల్లెలో ముగ్గురు తీవ్రవాదుల కుటుంబాలకు చెందిన 17 మంది బంధువులను గుర్తుతెలియని హంతకులు తుపాకితో కాల్చి చంపేసారు హతులలో హిజబుల్లా మొజాహిదీన్‌లో అగ్రశ్రేణి కార్యకర్తలైన ఖలీల్‌ఖాన్ ఇంతియాజ్ ఖాన్ ముస్తాక్ అహ్మద్‌ల బంధువులున్నారు వారిలో ముగ్గురు స్త్రీలు ముగ్గురు మైనర్ బాలికలు సొందు మెంధార్ గ్రామాల్లో హత్యలను ముస్లింవర్గాలు మొహ్రాబచ్చాయి హత్యలకి న్యాయమైన ప్రతీకారంగా భావించారు

ఈ హత్యలు సైన్యం పనే అని అందరూ అనుకున్నారు కాని ఆ దాడిలో బతికి బయటపడిన జుబేదాబీ వాంగ్మూలం మరోలావుంది హిజబుల్లా ముజాహిదీన్‌లోని కానేర్ మెహమూద్ వర్గానికి తన(జుబేదా) బంధువులతో సంబంధం ఉన్న సమీర్ మొహమ్మద్ వర్గానికి మధ్య ఆధిపత్యపోరు తీవ్రంగా వుందనే వార్తలను జుబేదా కథనం బలపరుస్తున్నది కానేరు మెహమూద్ వర్గానికి చెందిన ఒకరి బంధువుల్లో ఒక స్త్రీ అపహరణకి చిత్ర హింసకి గురైన అనంతరం ఈ వర్గాలమధ్య సంఘర్షణ మరీ తీవ్రమైంది సమీర్ మహమ్మద్ బంధువులపై దాడులు ఎక్కువయ్యాయి హత్యలు చేసినది స్థానిక తీవ్రవాదులే కాని సైన్యం కాదని జుబేదా తన విశ్వాసాన్ని వ్యక్తం చేసింది

ఈ పుస్తకం రాస్తున్న సమయంలో 1999 వేసవిలో జరిగిన చివరి హత్యాకాండలో దోడా-కిస్త్వార్ రహదారిపై నున్న తత్రి కి 10 కి॥మీ॥ దూరంలోని లిహోతా' గ్రామంలో మూడుకుటుంబాలకు చెందిన 15 మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు గ్రామ రక్షణ సంఘం (విలేజ్ డిఫెన్స్ కమిటీ – విడిసి)కి మద్దతు తెలిపి అందులో పాల్గొన్నందుకే వారిపై దాడి జరిగింది నిస్సహాయులైన హిందు అల్పసంఖ్యాకులకు ఆయుధాలనిచ్చి ఆత్మరక్షణలో మౌలిక శిక్షణనిచ్చేందుకు ఉద్దేశించిన కమిటీ అది పన్నాలాల్ భార్య ముగ్గురు కుమార్తెలు తల్లి పరమాదేవి సోదరులు శివలాల్ కిషన్‌లాల్ లేఖ్‌రాజ్ మోహన్‌లాల్ మోహన్‌లాల్ భార్య దలిపన్‌దేవి పసికందులు నరేష్‌కుమార్ సతీష్‌కుమార్ శివలాల్ కుటుంబంలో అతని భార్య ధాత్రిదేవి కొడుకులు బాగ్‌సింగ్ మొహిందర్ సింగ్‌లతో సహా యావన్మందిని చంపేశారు

ఆవిధంగా ఒక్కరాత్రిలో లిహోతా గ్రామంలోని జనాభా 39 మందిలో దాదాపు సగంమందిని తుడిచి పెట్టేసారు గ్రామవాసుల్లో అమ్రిక్ సింగ్ భూషణ్‌కుమార్ రమేష్ కుమార్ వారికి సహాయంగా వారి కుమారులు సుర్‌జిత్‌సింగ్ సునీల్‌సింగ్ ముకేష్ కుమార్‌లు ప్రతిఘటించి నిలవకపోతే మరింత ఘాతుకం జరిగివుండేది ఉద్దంపూర్‌లోని

దుడుబసంత్ నగర్‌లో ముగ్గురు గ్రామస్తుల అపహరణ హత్య జరిగింది లగాయితు ఈ వేసవిలో గ్రామరక్షణ సంఘాలపై వరసగా సాగిన దాడుల్లో లిహోతా మరణకాండ చివరిది సాయుధులైన వి డి సి సభ్యులు ఇరుగుపొరుగు ముస్లింలను బెదిరించడానికి వేధించడానికి పలుమార్లు పాల్పడిన నేపథ్యంలో తీవ్రవాదులు తమ దాడుల ద్వారా మతపరమైన సానుభూతి సాధించడానికి ప్రయత్నించారు మత వేర్పాటు ధోరణితో జరిగిన ప్రతిదాడితోనూ హిందూ ఐక్యత పెరిగి మరిన్ని స్థానిక ఘర్షణలకు అవకాశం ఏర్పడడం అనే అదనపు ప్రయోజనం సిద్ధిస్తున్నది

## జమ్ములో తీవ్రవాదం

జమ్ముకాశ్మీర్‌లో విద్రోహులు పుంజుకోవడానికి జమ్ము కొండలు ప్రధాన స్థావరాలైన వన్న సంగతి 1995 నుంచి బహిరంగ రహస్యమే ఐతే ఈ పరిణామాలకి కారణమైన శక్తులగురించి పెద్దగా ఎవరూ పట్టించుకోలేదు ఈ ప్రాంతం భౌగోళిక స్వరూపం సరైన రహదారులు లేకపోవడం ఈ ప్రాంతంగుండా చొరబాటుకు గల వెసులుబాటులే వారి ఈ వ్యూహానికి కారణమని సైన్య వ్యూహనిపుణులు చెబుతున్నారు పోఖ్రాన్ పరీక్షల అనంతరం ఇంటెలిజెన్స్ బ్యూరో జరిపిన విశ్లేషణ విద్రోహులు కాశ్మీర్‌లోయలోనికి ప్రవేశించేందుకు వున్న కీలకమైన మార్గాలనన్నింటిపైన ఆధిపత్యం సాధించేందుకు ప్రయత్నిస్తారని ఊహించింది అంతర్జాతీయ జోక్యాన్ని తప్పనిసరి చేసి, తన కనుకూలంగా సరిహద్దు వివాదం అంతిమంగా పరిష్కారమయ్యేందుకు పాకిస్తాన్ పరిమిత స్థాయిలో సంప్రదాయ పద్ధతిలో పోరుకు సన్నాహాలు కొనసాగిస్తోందని ఈ ఊహగానం నర్మగర్భంగా సూచిస్తోంది

ఈ వివరణలన్ని సంభవాలే! తరువాతి అధ్యాయంలో ఆ విషయాలను తిరిగి ప్రస్తావిస్తాను కాని వాటిలో జమ్ముకాశ్మీర్‌లో ప్రత్యేకించి జమ్ము ప్రాంతంలో తిరుగుబాటులను ప్రోత్సహిస్తున్న రాజకీయ తంత్రాలు ఎమిటి అనేదిలేదు (పొలిటికల్ డైనమిక్స్) ఆధిపత్యం నిరూపించుకేనేందుకు రక్తపాతం సాగిస్తున్న తీవ్రవాదులు దానితో విసుగెత్తిపోయిన ప్రజల సానుభూతిని కోల్పోవడం తప్ప మరే ప్రయోజనమూ లేని కాశ్మీర్‌లోవలెకాక జమ్ము రాజకీయాలు వారికి కొత్త అవకాశాలు అందించేవిగా వున్నాయి దేశ విభజన జరిగినప్పటి నుంచి సుదీర్ఘమైన మత రాజకీయాల చరిత్రకలిగిన హిందు-ముస్లిం వాదుల నడుమ నలిగిపోతున్న జమ్ముప్రాంతం భారతదేశానికి ప్రతీక భద్రతలేని ముస్లిం వర్గాలకు రక్షణగా తనకొక న్యాయబద్ధతను కల్పించుకుంటూ భారతదేశంపై జరిగే చర్చలన్నిటిలో 'తీవ్రవాదం' తన ఉనికిని చాటుకుంటోంది అలాగే హిందు మత రాజకీయ వాదులకు కూడా యావద్భారత దేశం తమలో ఆందోళనను

మరింత గట్టిగా వ్యాప్తి చేయడానికి తీవ్రవాదం ఒక మాధ్యమంగావుంది హిందుత్వవాదులైన రాజకీయ నేతలకు జమ్ములోని ప్రజలను తీవ్రవాదం నుంచి కాపాడడమంటే హిందు అల్పసంఖ్యాకులను రక్షించడమే!

జమ్మురాష్ట్రంలో తీవ్రవాదానికి మతోన్మాదమే కేంద్ర బిందువు 1993 ఆగస్టులో 14 మంది బస్సుప్రయాణీకులు హత్యకు గురికాగానే కిస్త్వార్ పట్టణంలో అల్లర్లు చెలరేగాయి హిందు మూకలు ముస్లింల ఇళ్లపై దుకాణాలపై దాడిచేసాయి తరువాత నాలుగేళ్లలో ఆ ప్రాంతంలో విద్రోహుల సంఖ్య పెరిగినా కిస్త్వార్ హత్యల వల్ల ఎర్పడిన మతపరమైన చీలిక విస్తరించిన దాఖలాలు లేవు కాని 1997 ఆగస్టులో అందుకు ఒక సాకు దొరికింది రీసి ప్రాంతంలోని సెవారిబుద్దిల్ గ్రామంలో బడిపంతులుగా వున్న గుజ్జర్ముస్లిం మన్సూర్ హసన్ రీటాకుమారి అనే హిందు యువతిని పెళ్లిచేసుకున్నాడు అతి పేద కుటుంబానికి చెందిన ఆ యువతి పెళ్లికి ఆమె తల్లి ఆశీస్సులు వున్నాయనేది తెలుస్తూనేవుంది అందుకు హిందువుల ప్రతిక్రియ కాట్టే సమయం పట్టలేదు ఉద్రిక్తతలు పెరిగిపోయాయి అపహరణ నేరం కింద తప్పుడు కేసుమోపి రీసివద్ద ఆదంపతుల్ని అరెస్టుచేసారు

ఆ కేసులోంచి విడుదలై బయట పడిన ఆ జంట జమ్ములోని సివిల్ కోర్టులో తిరిగి వివాహం చేసుకున్నారు ఈసారి సామాజికుల ఒత్తిడి తీవ్రంగా వున్నా జోక్యం చేసుకునేందుకు పోలీసులు నిరాకరించారు ఆ జంట సాహసానికి ఆగ్రహించిన మూడు పెత్తందారీ రాజపుత్ హిందూ కుటుంబాలు వారిని శిక్షించాలని నిర్ణయించుకున్నాయి వాళ్లు రీటాకుమారిని ఎత్తుకుపోయి ఢిల్లీలో ఒక మితవాద హిందూ సంస్థ నడుపుతున్న మహిళా ఆశ్రమంలో చేర్చారు హుస్సేన్ను అతని అత్తని చితకబాదారు

దానితో ప్రతీకారం తీర్చుకోవడానికి హుసేన్ హిజబుల్లా ముజాహిదిన్కు చెందిన ఫరీద్ఖాన్ వర్గాన్ని ఆశ్రయించాడని పోలీసు దర్యాప్తులో వెల్లడయింది రీటాకుమారిని ఎత్తుకెళ్ళడంలో ప్రధాన పాత్ర పోషించిన మూడు కుటుంబాలకు చెందిన ఎనిమిది మందిని వాళ్లు వధించారు స్థానిక హిందూ మతవాదవర్గాలు మతపరమైన అల్లర్లు సృష్టించేందుకు దీనినొక అవకాశంగా ఉపయోగించుకున్నాయి ముస్లిం హిందూ మతవాద వర్గాలే కాక తిరుగుబాటుదారులు కూడా ఈ సంఘటనను జాగ్రత్తగా గమనిస్తున్నాయని ఒకసారి సింహావలోకనం చేస్తే బోధపడుతుంది జమ్మూ ప్రాంతం అంతటా రాజకీయ రంగంలో నరమేధాలు ప్రతీకారాలు మతపరమైన భిన్న ధృవాలు ఎర్పడడం అనేవి ప్రధానాంశాలు కానున్నాయి

ఈ అంశాలు వాస్తవ రూపం దాల్చడానికి జనవరి నెలలో జరిగిన సంఘటనలు

వేదిక కానున్నాయి 1998 మార్చి 19న దోడా – కిస్త్వార్ రహదారిపైనున్న కరారా గ్రామం నుంచి దోడా పోలీసులు ఒక అజ్ఞాత వ్యక్తి ఎంతో వ్యాకులంతో సహాయం కోరుతూ చేసిన ఫోను అందుకున్నారు

హిందూవాదుల గుంపు ఒకటి ఐదుగురు ముస్లింలను కొట్టి చంపేసిందని వారి మృతదేహాలను చినాబ్ నదిలోకి విసిరేసారని ఆ వ్యక్తి తెలిపాడు ఆ వ్యక్తి బహుశా ఒక హిందూ షాపు యజమానై ఉండవచ్చు కాని అతను తెలియచేసినది వాస్తవమేనా అనే సందేహం కలిగింది ఎందుకంటే కరారా ప్రాంతాన్ని బి ఎస్ ఎఫ్ కి చెందిన 75 బెటాలియన్ మాత్రమే కాక ఒక రోజు ముందు ఉధంపూర్ లోక్‌సభ ఎన్నికల కోసమని రప్పించిన ఇండో టిబెటిన్ సరిహద్దు పోలీసు (ఐ టి బి పి ) దళానికి చెందిన ఒక కంపెనీ కూడా కాపలా కాస్తున్నాయి నిజం కాస్త ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది ఆర్ ఎస్ ఎస్ తో అనుబంధం వున్న కొందరు గ్రామస్తులు నలుగురు ముస్లింలను కొట్టి చంపెయ్యడం ద్వారా సామూహిక ప్రతీకారం తీర్చుకున్నారని కనుగొన్నారు ఎప్రిల్ 17వ తేదీ నాడు తమ గ్రామానికి చెందిన బాలికను బలాత్కరించాడని ఆరోపిస్తూ పనాసా గ్రామస్తులైన కొందరు ముస్లింలు సురేష్‌కుమార్ అనే వ్యక్తిని కోపావేశంతో కొట్టి చంపారు అతని అంత్యక్రియలు జరిగిన స్థలం కరారాలోనే వుంది

కరారా హత్యలలో రెండు అంశాలు ఎంతో ప్రాముఖ్యత కలిగినవి మొదటిది జమ్ము ప్రాంతంలో హిందూ మతవాదులు పథకం ప్రకారం తీవ్రవాదానికి ఉద్యమించిన తొలి సంఘటన అదే రెండవది అంతకన్నా ముఖ్యమైనది కొత్త ఢిల్లీలో బి జె పి నేతృత్వంలోని సంకీర్ణ ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన కొద్ది రోజులకే ఆ సంఘటన జరిగింది మతపరమైన చీలికవున్న జమ్ముప్రాంతంలో బి జె పి ఎన్నికల ప్రచారం చేస్తూ దోడాలో కల్లోలిత ప్రాంతాల చట్టాన్ని అమలు చేస్తామన్న వాగ్దానం ప్రధానాంశంగా సాగింది ఈ చట్టాన్ని అహేతుకమైన చట్టపరమైన సంకెళ్ల నుంచి సైన్యానికి స్వేచ్ఛనిచ్చి సైన్యం జోక్యంతో తీవ్ర వాదాన్ని కరనంగా అణిచివెయ్యడానికి వీలు కల్పించే తారక మంత్రంగా భావించారు కరారా హత్యలు, కొత్త ప్రభుత్వ తీవ్రవాద వ్యతిరేక కరినవైఖరి ముస్లిం వర్గాల పట్ల విస్తృత స్థాయిలో దాడికి ఒక ముసుగు మాత్రమేనని దోడా ముస్లిం వర్గాలకు సంకేతాలనందించాయి

గతంలో కూడా ప్రతీకారం తీర్చుకున్న సంఘటనలు జరిగాయి కాని వాటి వెనుక ఇంత బాహాటంగా రాజకీయ ప్రమేయం కనబడలేదు ఉదాహరణకు 1997 జనవరి 15న భార్షాలా గ్రామంలో 15 మంది హిందువులు ఊచకోతకు గురైన కొద్ది కాలానికే బి ఎస్ ఎఫ్ జవాన్లు ఒక ముస్లిం కుటుంబానికి చెందిన తొమ్మిది మందిని

కాల్చి చంపారు దీనివెనుక నేరాలు జరగకుండా నిరోధించడానికి పూనుకున్న హిందు బృందాల ప్రోద్బలం వున్నట్లు కనిపిస్తుంది 1988 జనవరి 30న దోడాలోని కాద్రాన గ్రామంలో నిరసన ప్రదర్శన జరుపుతున్న ముస్లింలపై రాష్ట్రీయ రైఫిల్స్ సిబ్బంది విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు వారి అభిప్రాయం తప్పైనా ఒప్పైనా ఎంతో మంది ఈ చర్యను కాశ్మీరులోయలోని వాంధామా గ్రామంలో కాశ్మీరీ పండిట్ల ఊచకోతకు ప్రతీకారంగా అర్థం చేసుకున్నారు

**కరారా సంఘటన అనంతరం చెలరేగిన హింస**

ఈ నేపథ్యంలో పరిశీలిస్తే కరారాలో రాజకీయ పరిణామాలు జమ్ము ప్రాంతం అంతటా తీవ్ర ప్రభావం చూపాయి జాతీయ స్థాయిలో బిజెపి పార్టీ మౌనం వహిస్తుంటే ఉద్దంపూరు నుంచి కొత్తగా ఎన్నికైన బి జె పి పార్లమెంటు సభ్యుడు చమన్‌లాల్ గుప్తా మాత్రం కరారాలో హింసకు బాధ్యులైన వారిని గట్టిగా వెనకేసుకొచ్చారు దోడాలోని నేషనల్ కాన్ఫరెన్సు మతవాద జమాతే ఇస్లామిలు కూడా పచ్చిమతవాద సంస్థలను చేర్చుకోవడం ద్వారా ముస్లిం నియోజక వర్గాలను బలపరుచుకోవడానికి ప్రయత్నించాయి మౌలికంగా లౌకికవాద సిద్ధాంతాలను అనుసరించే నేషనల్ కాన్ఫరెన్సుపార్టీ కాశ్మీరు లోయలో ముస్లిం మతవాదులతో ఎంతోకొంత ఘర్షణ పడుతోంది ఆ పార్టీకి చెందిన దోడా ఎం ఎల్ ఎ ఖాలిద్ సుహ్రావర్ది జమాతె ఇస్లామికి చెందిన సయిదుల్లా తాంత్రెతో కలిసి ఒకే వేదికపై నుంచి కరారా హత్యల పట్ల నిరసన వ్యక్తం చేసారు సుహ్రావర్ది సమక్షంలోనే జమాతె ఇస్లామి కార్యకర్తలు ఆ హత్యలకు ప్రతీకారం తీర్చుకుంటామని నినాదాలు చేసారు ఆ విధంగా కరారా' తీవ్రవాదుల హింసనుంచి మత పరమైన ఎకీకరణలకు మత సంఘర్షణలకు కేంద్రబిందువుగా పరిణమించింది

కరారా సంఘటనల వల్ల లాభిస్తున్న దేమిటో జమ్ము ప్రాంతంలోని తీవ్రవాదుల నాయకులు క్షుణ్ణంగా అర్థం చేసుకున్నారు జమ్ము ప్రాంతంలో వరుస వెంబడి మత పరమైన హత్యల పరంపర కొనసాగింది 1998 ఎప్రిల్ 19న రీసి ప్రాంతంలోని పరాన్ కోట్‌లో 28 మంది హిందు గ్రామస్తులని నరికి చంపేసారు ఆటోమేటిక్ ఆయుధాలతో కాక కత్తులతో జరిపిన ఈ హత్యల్లో కసాయితనం అటునుంచి ప్రతి దాడులకు పురికొల్పింది తొమ్మిది రోజుల అనంతరం నియంత్రణ రేఖకు ఆవల జరిగిన గ్రామీణుల హత్యలకు సైన్యానిదే బాధ్యతగా భావించినా అదృష్టవశాత్తు అది మతకల్లోలాలకు దారితీయలేదు తరువాత మే నెల 6న దీసా దోడా పూంచ్‌లోని సారన్ కోట్‌లలో జరిగిన వేరు వేరు సంఘటనల్లో 10 మంది హిందువులు మరణించారు

తిరిగి జూన్ 19న దోడా పట్టణ సమీపంలోని ఛప్‌నారివద్ద ఒక పెళ్లి ఊరేగింపులోని 25 మంది హత్యకు గురయ్యారు దోడాలో మతవాదాన్ని పెంచేందుకే ఈ హత్యలు జరిగాయని అందరూ భావించారే కాని హంతకులు భద్రతలేని ముస్లింలకు రక్షకులుగా తాము స్థానికుల మద్దతు సంపాదించాలని ప్రయత్నిస్తున్నారన్న వాస్తవాన్ని అర్థం చేసుకోలేక పోయారు

ఈ వరుస హత్యలు ఏదోరూపంలో కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకోవడం తప్పని సరి అనే పరిస్థితి కల్పించాయి హోం మంత్రి అద్వాని జూన్ నెలలో ఆ ప్రాంతానికి మరిన్ని అదనపు దళాలను పంపుతామనే హామీతో ఛప్‌నారిని సందర్శించారు ఇది జమ్మూలోని బిజెపి రాజకీయ మద్దతుదార్లను సంతృప్తి పరిచేందుకు ఉద్దేశించిన చర్య బహుశా అదనపు బలగాలను పంపుతామన్న హామీ దోడాలో కల్లోలిత ప్రాంతాల చట్టం అమలు కోరుతున్న డిమాండు నుంచి దృష్టి మరల్చడానికి కావచ్చు అనేక రాజకీయ వ్యూహాత్మక కారణాల వల్ల ఎంతో కాలంగా తాను చేస్తున్న ఈ డిమాండును బిజెపి నెరవేర్చగల స్థితిలో లేదు దోడా పట్టణంలో ఒక హిందు ర్యాలీని ఉద్దేశించి మాట్లాడుతూ తన పౌరులను రక్షించలేని ప్రభుత్వానికి పరిపాలించే హక్కులేదని హోంమంత్రి అన్నారు అయితే ఆ మాట అన్నది తన గురించా ప్రధాని గురించా ముఖ్యమంత్రి గురించా అనేది స్పష్టంగా తెలియకుండా జాగ్రత్త పడ్డారు కరారా హత్యలను ప్రస్తావించకపోవడం ద్వారాను స్థానికముస్లింనేతల నెవరినీ వేదికపైకి పిలవక పోవడం ద్వారాను అద్వాని హిందువుల నాయకునిగా తనను నిరూపించుకోవడంలో సఫలమయ్యారు

**పట్టిక-1 ఛప్‌నారి నరమేధం తరువాత దోడాలో దళాల మోహరింపు**

| తేది | ఆర్మీ (బెటా) | బి ఎస్ ఎఫ్ (బెటా) | సిఆర్‌పిఎఫ్ (కంపెనీ) | ఐఆర్‌డి (కంపెనీ) | జెకెఏపి |
|---|---|---|---|---|---|
| 1995 ఆగస్టు | 8 | 6 | 27 | 0 | 1 |
| 1996 మార్చి-ఎప్రిల్ | 8 | 6 | 33 | 6 | 0 |
| 1997 మార్చి-ఎప్రిల్ | 11 | ఉపసంహరించారు | 33 | 5 | 0 |
| 1998 జూన్ ఛప్‌నారి హత్యలు | 9 | - | 23 | 5 | 2 |
| 1998 ఆగసు | | | | | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అద్వాని అదనపు దళాలకు హామీఇచ్చిన నెల్లాళ్లకు | 9 | – | 23 | 1 | | 6 |
| మతపరమైన పండగలు యాత్రలు సందర్భంగా నియోగించినవి పోగా | 9 | – | 19 | 1 | | 4 |

*★ ఇండియా రిజర్వుపోలీసు*

*★ జమ్మూ కాశ్మీర్ సాయుధ పోలీసు*

*బెటా బెటాలియన్*

*ఒక బెటాలియన్ (రమారమి) ఆరు కంపెనీలు లీవ్ రిజర్వులు పోరాటంలో పాల్గొనని వారితో కలిపి 135 మంది సిబ్బంది*

*మూలం జమ్ము కాశ్మీర్ పోలీసు పత్రాలు దోడాజిల్లా*

రాజకీయ గత్యంతరం లెక అద్వాని ధోరణిలో దాపరికం లేదు కాని ఛప్‌నారి తదనంతర విధానంలో పారదర్శకత లోపించింది హోంమంత్రి వాగ్దానానికి విరుద్ధంగా మారణ హోమం జరిగాక దోడాలో భద్రతా సిబ్బంది సంఖ్య తగ్గిపోయింది (పట్టిక-1) గ్రామ రక్షక సంఘాలు (విడిసిలు) వాడుతున్న పురాతన 7 62 ఎం ఎం బోల్ట్ ఎక్షన్‌రైఫిళ్లకు బదులు అధునాతనమైనవి ఇచ్చేందుకు అవసరమైన నిధులు సమకూర్చే ప్రయత్నం జరగలేదు ప్రతి విడిసి నుంచి ప్రత్యేక పోలీసు అధికారులుగా తీసుకున్న నలుగురికి నెల నెలా చెల్లించాల్సిన రూ 1500 స్టయిఫండు ఈ నాటికీ సక్రమంగా అందడం లేదు రాష్ట్ర భద్రతా సిబ్బంది లేక పోవడంతో విడిసిలలో మతవాదులు నేరస్తుల చేరికపై (అది ఎంత సహజమైనదైనాసరే) అదుపులేకుండా పోయింది పోలీసు విధుల కోసమని ఉద్దేశించిన కేంద్రనిధులు మళ్ళించి జీతభత్యాలు బిల్లుల చెల్లింపువంటి రాష్ట్ర తక్షణ అవసరాలకు వెచ్చించడం వలన అమలవుతున్న ఆధునీకరణ కార్యక్రమాలకు అవరోధం కలిగింది

ఈ సారి మరింత ప్రస్ఫుటమైన మత ఛాయలతో మారణ కాండ కొనసాగడం ఆశ్చర్యం కలిగించలేదు జూన్ నెల 27న హిజబుల్లా మొజాహిదీన్ హర్కత్‌ఉల్ అన్సార్‌లకు చెందిన వ్యక్తులమూక కిస్త్‌వార్‌లోని గ్రామాలు ధాక్రెయిన్ హోర్

సరవాన్‌లలో 17 మంది హిందుగ్రామస్తుల్ని పొట్టన పెట్టుకుంది ఎనిమిది రోజుల కిందట మచ్‌లాల్ గ్రామంలో దోడా హిజబుల్ మొజాహిదీన్ కమాండర్ మహ్మద్ కాశిం కుటుంబ సభ్యులు నలుగురిని హత్య చేసినందుకు ప్రతీకారంగా ఈ మారణహోమం జరిగిందని అక్కడ నమ్ముతున్నారు సైన్యం సహకారంతో ఈ హత్యలు వి డి సి సభ్యులే చేసి వుంటారని దోడాలో పుకారుగా వుంది కాని భద్రతా వ్యవస్థ ఈ ఆరోపణలని ఖండిస్తోంది ఈ రెండవ దశ హత్యలు ఛప్‌నారి హత్యల మాదిరిగా రాజకీయవాదులు మీడియాల దృష్టిని ఆకర్షించలేదు చివరికి నేషనల్ కాన్ఫరెన్సుకు చెందిన రాష్ట్రస్థాయి రాజకీయ నాయకులు కూడా కిస్త్‌వార్‌ను సందర్శించలేదు

ఆగస్టు మూడున హిమాచల్ ప్రదేశ్‌లోని చంబాజిల్లా దోడా సరిహద్దున వున్న రెండు ఔట్‌పోస్టుల వద్ద రోడ్డు నిర్మించే పనిలో వున్న 34 మంది పనివారిని కాల్చి చంపడంతో ఈ వేసవి హత్యల పర్వం ముగిసింది జమ్ము ప్రాంతంలో మతపరమైన ఉద్రిక్తతలను మరింత పెంచడానికి ఉద్దేశించిన ఈ హత్యలు ఘర్షణలను హిమాచలప్రదేశ్‌కు విస్తరించడానికి జమ్ముకాశ్మీర్‌లో హింసను విస్తృత స్థాయిలో హిందూ - ముస్లిం ఘర్షణగా మలచడానికి కూడా తోడ్పడ్డాయి ఛంబాలో హిందువుల ప్రతీకారానికి ముస్లిం గుజ్జర్ పశులకాపర్లు బలయ్యారు ఐతే దీనికి పచ్చిక బయళ్లపై హక్కుల గురించి గుజ్జర్‌లకు హిందు గొర్రెలు కాపర్లకు చాలాకాలంగా వున్న వివాదం కూడా కొంత కారణం దరిమిలా 1989 నుంచి జమ్ము కాశ్మీర్‌లో భారత్ సానుభూతి పరులుగా వున్న గుజ్జర్ సమాజానికి చెందిన వారిని ఆ ప్రాంతంలో వున్న ఐ టి బి పి దళాలు కొండలపై వున్న పచ్చికనేలల నుంచి తరిమివేస్తున్నాయని చాలా ఫిర్యాదులు వచ్చాయి

ఛంబా మారణహోమం జరిగిన రాత్రే హరకత్ ఉల్ జిహాద్ ఇస్లామికి చెందిన ముఖ్యతీవ్రవాది ఇంతియాజ్ షేక్ కుటుంబానికి చెందిన 19 మందిని గుర్తు తెలియని హంతకులు కాల్చి చంపారు అదే రోజు తమకు ప్రధాన వేగు (ఇన్‌ఫార్మర్)గా వున్న ఒక వ్యక్తిని హర్కత్ ఉల్ ఇస్లామి జిహాద్ వర్గీయులు చంపివేసినందుకు ప్రతీకారంగా 9 పారా కమాండో రెజిమెంటు వారే ఈ హత్యలు చేసి వుంటారనే ఆరోపణలు ఆ తదనంతరం రాష్ట్ర మానవహక్కుల కమిషన్ జరిపిన దర్యాప్తులో వెలికి వచ్చాయి ఇందులో వాస్తవం ఎంతుందో తెలియకపోయినా ఈ హత్యల మూలంగా జమ్ము ప్రాంతంలోని సైన్యం నేరనిరోధక బాధ్యత తమ నెత్తిన వేసుకుని హిందూ సంస్థల మాదిరిగా వ్యవహరించడం మొదలు పెట్టిందనే భయం ముస్లింలలో ప్రబలింది

**కార్గిల్‌కు ముందు వసంత కాలంలో హత్యలు**

ఆకురాలుకాలం చలికాలాల్లో జమ్ముకాశ్మీర్ కాస్త ప్రశాంతంగానే ఉంది వసంతకాలం వస్తూనే తిరిగి హింస ప్రజ్వరిల్లింది ఫిబ్రవరి 19న ప్రధాని వాజ్‌పేయి వాఘాసరిహద్దు దాటిన రోజునే లష్కరే తాయిబా వర్గం రాజోరి ఉధాంపూర్ ప్రాంతాల్లోని బాల్‌జర్‌లాస్ ఖోర్బని భర్యానా గ్రామాల్లో 20 మంది హిందువుల్ని చంపివేసింది అంతకు ముందు ఫిబ్రవరి 13న మొహ్రోసుఖాల్‌లో ఒక కుటుంబంలోని నలుగురు సభ్యుల్ని నరికివేశారని వార్తలొచ్చాయి ఫిబ్రవరి 19 మారణహోమం తరువాత కూడా హత్యలు కొనసాగాయి చనా గ్రామంలో గ్రెనేడ్ దాడిలో ఇద్దరు వ్యక్తులు మరణించారు 1999 వేసవిలో తాజాగా జరిగిన హత్యలకు ఇదే నేపథ్యం

రాజకీయ సయోధ్యకోసం జరుగుతున్న ప్రయత్నాలతో నిమిత్తం లేకుండా భారతదేశానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తామని లష్కరే తోయిబా ఈ హత్యల ద్వారా సంకేతాలు అందించింది ఈ వాస్తవాన్ని గ్రహించడంలో ప్రో-ఏక్టివ్ విధానం విఫలమైంది విద్రోహానికి జవాబుగా మరిన్ని దళాలను రాష్ట్రాలకు పంపడమే దానికి తెలిసిన చిట్కా ఇందులో ముందున్న విధానాలకీ విధానం ఏమీ భిన్నంకాదు ఇస్లాం వాదులైన తిరుగుబాటు బృందాలు ఏర్పరిచిన రాజకీయ ప్రక్రియ ఎదురులేకుండా కొనసాగుతోంది కారణం సులభగ్రాహ్యమే హిందూత్వవాదులైన రాజకీయ నాయకులకు కూడా మొత్తం భారతదేశంలో వున్న మతరపరమైన చీలికపైనే తీవ్రవాదం పునర్వ్యవస్థీకరణ చెందడం ప్రయోజనకరం

ఐతే ఈ భీభత్సానికి ముస్లింలే ఎక్కువగా గురయ్యారనేది (కనీసం జమ్మూ ప్రాంతంలో అయినా) చాలా మందికి తెలియదు (పట్టిక 2 3) ముస్లిం వాద సమర్థకులకు 19)

**పట్టిక 2** **దోడా జిల్లాలో హత్యలు**

| సంవత్సరం | హిందువులు ఊచకోతల్లో | ముస్లింలు | మొత్తం |
|---|---|---|---|
| 1989 | 1(0) | 0 | 1 |
| 1990 | 0 | 3 | 3 |
| 1991 | 0 | 3 | 3 |
| 1992 | 4(0) | 9 | 13 |
| 1993 | 47(16) | 49 | 96 |
| 1994 | 46(0) | 53 | 99 |
| 1995 | 52(0) | 50 | 102 |
| 1996 | 58(37) | 85 | 143 |
| 1997 | 27(6) | 42 | 69 |
| 1999(ఏప్రిల్ వరకు) | 39(34) | 21 | 60 |

*మూలం జమ్మూ కాశ్మీర్ పోలీసులు దోడా జిల్లా*

వ్యతిరేకంగా నిజాయితీతో కూడిన లౌకికవాద ఏకాభిప్రాయాన్ని కూడగట్టడానికి ఈ గణాంకాలు ప్రాతిపదిక కావాలి కాని అందుకు భిన్నంగా మత ప్రాతిపదికన జనసమీకరణకు ప్రయత్నాలు ముమ్మరం కావడం విద్రోహులకు రాష్ట్రం తమ అధీనంలో వున్న వర్గాలకు తామే గ్రామ సంరక్షకులమని చెప్పుకునే అవకాశాన్నిచ్చింది తానొక ముస్లింపార్టీగా భావించుకుంటూ ప్రజలు కూడా అలాగే భావించే నేషనల్ కాన్ఫరెన్సు విస్పష్టమైన ఛాందసవాద కార్యక్రమం వున్న జామాతె ఇస్లామి బి జె పి ఆర్ ఎస్ ఎస్ లన్నీ కలిసి ఈ ప్రక్రియకు తోడ్పడమే విషాదం

**పట్టిక 3** **రాజోరి జిల్లాలో హత్యలు**

| సంవత్సరం | తీవ్రవాదుల చేతుల్లో హతులైన ముస్లింలు హిందువులు | మృతులైన పౌరులు | ఎదురుకాల్పుల్లో తీవ్రవాదులు | హతులైన |
|---|---|---|---|---|
| 1993 | 1 | 1 | 0 | 11 |
| 1994 | 0 | 0 | 0 | 13 |
| 1995 | 0 | 0 | 0 | 4 |
| 1996 | 6 | 0 | 2 | 10 |
| 1997 | 13 | 11 | 2 | 43 |
| 1998 | 35 | 10 | 9 | 98 |
| 1999ఫిబ్రవరి 25 వరకు | 7 11 | 4 | 32 | |

మూలం జమ్మూకాశ్మీర్ పోలీసులు రాజోరి జిల్లా

ఈ మధ్య హత్యలు నిరాఘాటంగా కొనసాగడమే కాక మరింత ఎక్కువయ్యాయి ఇవన్నీ 1998 మే నెలలో వచ్చిన ప్రోఆక్టివ్' విధానం కాగితం పులేనని రుజువు చేస్తున్నాయి ఈ సాధన జమ్మూకాశ్మీర్‌లో పెచ్చరిల్లుతున్న తిరుగుబాటును భయోత్పాతతాన్ని పరిష్కరించకుండా రాష్ట్రం లోపలా వెలుపలా హిందూత్వ మత వాదులు తమ స్థానం బలపరుచుకునేందుకు తోడ్పడుతున్నది

1998లో శిశర రుతువు ప్రవేశించే నాటికి మతపరమైన హత్యలు ఆగిపోవడం తన ఘనతేనని కేంద్ర హోంమంత్రిత్వశాఖ చెప్పుకుంది పీర్ పంజాల్ కనుమలో మార్గాలు మంచుకురిసి మూసుకుపోవాలని ప్రార్థించే స్థాయికి వ్యూహాత్మక ప్రణాళికారచన దిగజారిపోవడం దేశ అంతరంగిక వ్యవహారాలశాఖలో తిరుగుబాటును అణచివేసే విధానం' అని పేర్కొంటున్న హోంమంత్రిత్వ శాఖ విధానాల బండారం బయటపెడుతుంది

# కాశ్మీర్‌లో క్రియాశీల విధానం

పాకిస్తాన్ నుంచి సరఫరా అవుతున్న కిరాయి సైనికులు చావును కోరుకోరు అయితే జనావాస ప్రాంతాలలోనికి వారు అడుగుపెట్టిన తక్షణమే స్థానికులు వారి ఉనికిని గురించి మాకు తెలియ చేస్తున్నందువల్లనే వారిని ఎరిపారవేయగలుగుతున్నాం

**–లెఫ్టినెంట్ జనరల్ కిషన్‌పాల్ 1998 ఆకురాలు కాలం (1)**

బి జె పి జమ్ము – కాశ్మీర్ విధానం ఫలితం మత ఘర్షణలు మరింత పెరగడం ఒక్కటేకాదు దానివల్ల ఒనగూడిన సైనికపరమైన ప్రయోజనాలూ అంతంత మాత్రమే తీవ్రవాదంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా మారే సామర్థ్యం కూడా మృగ్యం భారతదేశపు ప్రజాస్వామిక పునాదులను దెబ్బతీసే సైనిక సిద్ధాంతాలను ఈ బి జె పి విధానం ప్రబోధించడం మరింత ప్రమాదకరం

రాష్ట్రంలో హింసపై బి జె పి నేతృత్వంలోని సంకీర్ణ ప్రభుత్వం పెద్ద ఎత్తున జరిపిన తొలి విధాన ప్రకటనా సమావేశం జరిపిన అనంతరం 1998 మే నెల 18న జమ్ము – కాశ్మీర్‌పై విడుదల చేసిన ఒక అధికార ప్రకటనలో తొలిసారి 'ప్రో ఆక్టివ్' (క్రియాశీల) అనే పదబంధాన్ని వాడారు పోఖ్రాన్ పరీక్షల అనంతరం కొన్ని వారాల వరకు ఈ ప్రో ఆక్టివిటి వాదం ఎన్నో కొత్తపదాలను సృష్టించింది వెంట తరమడం (Hot Pursuit) శీఘ్రప్రతిక్రియ (Swift Response) నిర్ణయాత్మక చర్యలు (Decisive Steps) ఇవన్ని కూడా జమ్ము కాశ్మీర్‌లో విద్రోహ నిరోధక వ్యూహంపై బి జె పి తర్కంలోని కీలకమైన శాఖాచంక్రమణాలే

ఈ ప్రకటన కూడా కొన్ని విధాలుగా ఉపయోగపడక పోలేదన్నది స్పష్టం ఉదాహరణకు జమ్ము–కాశ్మీర్ గురించి బి జె పి నిజంగా ఆందోళన చెందుతోందని శివసేన అధినేత బాల్‌థాకరేను ఒప్పించి ఇండియా–పాకిస్తాన్‌ల మధ్య క్రీడలకు వ్యతిరేకంగా ఆయన తలపెట్టిన ఉద్యమాన్ని విరమింపచేయడానికి అదెంతో తోడ్పడింది అడపాదడపా బి జె పి రాజకీయ నాయకులు తీవ్రవాదంపై పోరాటంలో ప్రతి సైనిక విజయం తాము అనుసరిస్తున్న బలప్రయోగ విధాన ఫలితమేనని మీడియా వారికి చెప్పుకుని అవకాశం కల్పిస్తోంది ఒక్కోసారి వారు దానిని అమాయకంగా నమ్మేస్తుంటారు అంతకన్నా ముఖ్యంగా బి జె పి కి సైనిక వ్యవస్థలోని కొందరివద్ద తమ అర్హతను (CREDENTIALS) నిరూపించుకోవడానికి తోడ్పడింది

## సిద్ధాంతంగానూ ఆచరణలోనూ ప్రో ఏక్టివ్ విధానం

వెంట తరమడం (HOT PURSUIT) గురించి అద్వాని చెప్పడానికన్నా ముందే సీనియర్ సైనికాధికారులు కొందరు అటువంటి చర్య అవసరమని చెప్పడం ఆసక్తిదాయకం బి జె పి నేతృత్వంలోని సంకీర్ణ ప్రభుత్వం అధికారం చేపట్టిన కొన్నాళ్ళకే 15వ సైనిక కమాండర్ లెఫ్టినెంట్ జనరల్ కిషన్‌పాల్ ఇలా ప్రకటించారు

ఏ దేశమైనా తీవ్రవాదాన్ని ఎగుమతి చేయడానికి కంకణం కట్టుకుని వుంటే కొన్ని తీవ్రమైన ప్రతిస్పందనలు అవసరం సరిహద్దులు మూసివేయడమన్నది మానవసాధ్యం కాదు సరిహద్దు అంటే అవగాహనలేని ఇలాంటి ప్రతిపాదనలకు జనంనుంచీ వ్యతిరేకత వస్తుంది పీర్‌పంజాల్‌కు అడ్డంగా బెర్లిన్‌గోడ వంటిది కట్టడానికి వందలకోట్లు కుమ్మరించినా సరే ఇంకా కొందరు దానిని దాటి రాగలుగుతారు

ఆవలి పక్షంతో కఠినంగా వ్యవహరించడం ఒక్కటే వాస్తవ పరిష్కారం వారు తగిన మూల్యం చెల్లించేలా చేయాలి నియంత్రణరేఖకు ఆవల విద్రోహుల స్థావరాలెక్కడున్నాయో మాకు తెలుసు మీరు గనుక వారిని పంపడం ఆపకపోతే వాటిపై మేం దాడి చేస్తాం అని మనం హెచ్చరించాలి ఆ స్థావరాలు నియంత్రణ రేఖకు ఆవలే వున్నప్పటికి వాటిని మనం తుడిచి పెట్టగలిగివుండాలి రేఖను దాటి దెబ్బతీయగల సామర్థ్యం కలిగివుండాలి (2)

ప్రో ఆక్టివిటి అనేది అసలు ఆచరణలో వుందో లేదో లేక అది ప్రభుత్వ తిరుగుబాటు వ్యతిరేక చర్య నమూనానేమైనా ప్రతిబింబిస్తుందా అనేది స్పష్టంగా తెలియడం లేదు వాస్తవానికి 1998 మే నెలలో అద్వాని ప్రకటన తరువాత జమ్ము - కాశ్మీర్‌కు తీవ్రవాదం బెడద నివారించేందుకు ఉద్దేశించిన భారతదేశ సైనికపరమైన కార్యక్రమం ఇటీవలి కాలంలో ఎన్నడు లేనంత తీవ్ర గందరగోళంలో పడింది 1998 మే నెల నుంచి సైన్యం, పారా మిలటరీ దళాల సంఖ్యాబలం తగ్గుతూవచ్చింది గతంలో కన్నా ఎక్కువగా కాకపోయినా భద్రతాసిబ్బంది పౌరులు హింసాత్మక చర్యలవల్ల అంతగానూ ఇబ్బందులకు గురయ్యారు

జమ్ము-కాశ్మీర్‌లో చురుకుగా వున్న విదేశీ విద్రోహుల ఆయుధ సామర్థ్యం ప్రత్యక్ష కార్యాచరణలో వారికిచ్చే శిక్షణలు తీవ్ర స్థాయికి చేరాయి మృతులలో భద్రతాదళ సిబ్బంది-తిరుగుబాటుదార్ల మధ్య నిష్పత్తి నానాటికి క్షీణించడమే దీనికి నిదర్శనం 1997లో 1 5గా వున్న ఈ నిష్పత్తి 1999 నాటికి 1 3కి తగ్గిపోయింది 1999లో సరిహద్దు మోహరింపుకోసం దళాల ఉపసంహరణ జరిగినప్పటినుంచి ఇది రాసేవరకు ఈ నిష్పత్తి 1 2 కన్నా తక్కువకు పడిపోయింది అలాగే భద్రతాదళాల చేతిలో హతులయ్యే తిరుగుబాటుదార్లు తిరుగుబాటుదారుల చేతిలో చనిపోయే పౌరుల నిష్పత్తి కూడా తగ్గిపోయింది ప్రో ఎక్టివ్ విధానం అమలులో వున్న కాలంలో జమ్ము కాశ్మీర్‌లోని పరిస్థితిని వివరించే అన్ని ముఖ్య సూచికలు క్రమంగా క్షీణించాయి భద్రతా సిబ్బందే

ఎక్కువగా మరణించారు తిరుగుబాటుదారులు తీవ్రవాదుల ఏరివేత బాగా తగ్గిపోయింది పౌరుల ప్రాణాలు కాపాడే విషయంలో చెప్పుకోతగ్గ మెరుగుదల అగుపడలేదు (పట్టిక–4)

**(పట్టిక-4) (ప్రోఏక్టివ్ విధానం గణాంకాల్లో పరిశీలన)**

| కాలం | భద్రతా సిబ్బందిపై దాడులు | హతులైన భద్రతా సిబ్బంది | హిందూ మృతులు | ముస్లిం మృతులు | మృతులైన తీవ్రవాదులు | భద్రతాసిబ్బంది లో మృతులు తీవ్రవాదులలో మృతుల మధ్య నిష్పత్తి | మరణించిన ప్రతిపౌరునికి ప్రతిగా తీవ్రవాదుల మృతి |
|---|---|---|---|---|---|---|---|
| 1988 | 6 | 1 | 0 | 29 | 1 | 1 00 | 0 03 |
| 1989 | 49 | 13 | 6 | 73 | 0 | 0 00 | 0 00 |
| 1990 | 1098 | 132 | 177 | 679 | 183 | 1 39 | 0 21 |
| 1991 | 1999 | 185 | 34 | 549 | 614 | 3 32 | 1 05 |
| 1992 | 3413 | 177 | 67 | 747 | 873 | 4 93 | 1 07 |
| 1993 | 2573 | 216 | 88 | 891 | 1328 | 6 15 | 1 36 |
| 1994 | 2593 | 220 | 104 | 635 | 1851 | 8 41 | 2 50 |
| 1995 | 2253 | 258 | 97 | 1013 | 1338 | 5 19 | 1 21 |
| 1996 | 2433 | 241 | 114 | 1175 | 1194 | 4 95 | 0 93 |
| 1997 | 2116 | 203 | 64 | 717 | 1177 | 5 80 | 1 51 |
| 1998 | 1211 | 230 | 159 | 678 | 1045 | 4 54 | 1 25 |
| 1999 | | | | | | | |
| జనవరి | 78 | 17 | 5 | 33 | 43 | 2 53 | 1 13 |
| ఫిబ్రవరి | 87 | 24 | 29 | 43 | 106 | 4 42 | 1 47 |
| మార్చి | 91 | 29 | 4 | 41 | 95 | 3 28 | 2 1 |
| ఏప్రిల్ | 86 | 14 | 2 | 76 | 79 | 5 64 | 1 01 |
| మే | 97 | 27 | 8 | 48 | 101 | 3 74 | 1 80 |
| జూన్ | 95 | 37 | 13 | 85 | 71 | 1 92 | 0 72 |
| జులై 15 వరకు | 58 | 17 | 10 | 34 | 34 | 2 00 | 0 77 |
| 1999 మొత్తం జులై 15 వరకు | 592 | 165 | 71 | 360 | 529 | 3 21 | 1 23 |

మూలం జమ్ముకాశ్మీర్ పోలీసుల డేటానుండి

**భద్రతకరువైన జమ్ము - కాశ్మీర్**

స్వభావ సిద్ధంగా బి జె పి సైనిక విజయం సాధించినట్లు చెప్పుకుంటున్నప్పటికీ

వాస్తవాలు అందుకు భిన్నంగా వున్నాయి జమ్ము - కాశ్మీర్‌లో జరిగిన విస్తృత పోరాటంలో ఒక భాగమే అయిన కార్గిల్ యుద్ధంలో భారత్ తీవ్రపరాజయాలు చవిచూసింది కార్గిల్ యుద్ధం ఆరంభం కాగానే 58 బెటాలియన్ల సైన్యాన్ని విద్రోహ నిరోధక విధులనుంచి ఉపసంహరించి సరిహద్దులలో మోహరించటానికి తరలించారు వీటిలో 36 కాశ్మీర్ ప్రాంతంలో వున్నవి కాగా 22 జమ్ము ప్రాంతంలోనివి వాటి స్థానాన్ని భర్తీ చేయడానికి కేవలం 14 కేంద్ర రిజర్వు పోలీసు ఫోర్సు బెటాలియన్లు 6 బి ఎస్ ఎఫ్ బెటాలియన్లు మాత్రమే వచ్చాయి మరో ఆరు బెటాలియన్లను అమరనాథ్ యాత్రికుల రక్షణకు పంపారు 1999లోక్‌సభ ఎన్నికలు ముగిసే వరకు అవి అక్కడే వుండాలి

సరిహద్దుల్లో మోహరించిన దళాలను శాశ్వత ప్రాతిపదికపై బలోపేతం చేయవలసి వుండగా అందుకోసం అధికారులవద్ద విశ్వసనీయమైన పథకాలేవీ లేవు 1998లోక్‌సభ ఎన్నికల సమయంలో ఒక్కొక్క కంపెనీలో లీవు రిజర్వులు పోరులో పాల్గొనని వారితోసహా 125మంది వుండే 354అదనపు కంపెనీలను రాష్ట్రంలో విధులకోసం నియోగించారు 1999 లోక్‌సభ ఎన్నికల సమయంలో 1998లో అవసరమైన దానికన్నా ఎక్కువగా కనీసం 500 కంపెనీలైనా వుండడం అవసరం కాని ఇతర చోట్లలో విధులనుంచి వారిని తప్పించడం సాధ్యంకాదనే కారణం చూపిస్తూ కొత్త ఢిల్లీలో సంబంధిత వర్గాలు కేవలం ఎనిమిది కంపెనీలను మాత్రమే పంపాయి

సరిహద్దులమీదుగా విద్రోహుల చొరబాటు 1999లో మామూలుకన్నా చాలా ఎక్కువగా వుందని పేర్కొంటున్న ఇంటెలిజెన్సు నివేదికలలో కార్గిల్ అనంతరం దాదాపు జమ్ము-కాశ్మీర్ అంతటా భద్రతకొరవడిందనే దానికి రుజువులు లభిస్తాయి మార్చి నుంచి కనీసం 600మంది విద్రోహులు చొరబడి 3000 అడుగులకన్నా ఎత్తున వున్న స్థావరాలను ఆక్రమించుకున్నారని కుప్వారా బరాముల్లాల్లోని క్షేత్రస్థాయి అధికారులు అంచనా వేశారు అనంతనాగ్ జిల్లాలో కూడా విద్రోహులు నిరంతరం కార్యకలాపాలు సాగిస్తున్నారని నమ్మకంగా తెలుస్తోంది విద్రోహులుభద్రతాదళాలతో ముఖాముఖీ తలపడకుండా జాగ్రత్తపడినా కార్గిల్ అనంతరం హింస బాగా పెరిగిందనడంలో సందేహం లేదు [4]

1999 ఆగస్టు 15కు ముందు వారం ఆ ఏడాది మొత్తంమీద అత్యంత రక్తసిక్తమైన వారం ఆగస్టు ఆరున విద్రోహులు కుప్వారాలోని చాక్‌నధూసా గ్రామాన్ని ఆక్రమించుకుని 4వ రాష్ట్రీయ రైఫిల్స్ శిబిరంపై భారీ ఎత్తున దాడి జరిపారు ఆ దాడిలో ఆరుగురు విద్రోహులు ఐదుగురు సైనికులు మరణించారు ఒకరోజు అనంతరం

తిరిగి జరిగిన దాడిలో 4వ రాష్ట్రీయ రైఫిల్స్ శిబిరంపై జరిగిన రాకెట్ దాడిలో మరో సైనికుడు ప్రాణాలు కోల్పోయాడు జూన్ 12న బండిపూర్‌లో జరిగిన కాల్పులలో నలుగురు నేవీ కమాండర్లు ట్రాల్‌లో వున్న బి ఎస్ ఎఫ్ విడిదిలో జరిగిన బాంబు విస్ఫోటనంలో మరొక సైనికుడు మరణించారు ఆ మరునాడే బీర్వావద్ద మరో రాష్ట్రీయ రైఫిల్స్ శిబిరంపై దాడిలో ముగ్గురు సైనికులు చనిపోయారు ఆగస్టు 14న దీవార్-లోలాబ్ మానస్‌బాల్ ప్రాంతాల్లో జరిగిన దాడుల్లో రాష్ట్రీయ రైఫిల్స్‌దళం మరో ఐదుగురు సైనికుల్ని కోల్పోయింది దాడుల తీవ్రత వాటికి అనుసరించిన వ్యూహాలు పరిశీలిస్తే విద్రోహులు ప్రత్యక్షంగా తలపడడం లేదని ముఖాముఖి కాల్పులకు దిగకుండా జాగ్రత్త పడుతున్నారని సైనికాధికారులు రాజకీయ నాయకులు చేస్తున్న వాదనను అవి ఎండగడతాయి

## (పట్టిక 5) జమ్ముకాశ్మీర్లో పట్టుబడ్డ ఆయుధాలు ఒక నమూనా

| కాలం | ఆర్ ఎ | ఐఎ ఎ/ ఎ టి | మిస్ | ఎం ఎల్ | షక గచ్ఛ్ | ఎంటి ఆర్ | ఆర్ ఎల్ | జి ఎ ఎం డి 1 యు ఎం జి | ఎం ఎం జి | ఎల్ ఎం జి | డి ఆర్ ఎల్ | ఎ కె |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1988 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 34 |
| 1989 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 48 |
| 1990 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 141 | 96 | 2 | 26 | 0 | 1394 |
| 1991 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 140 | 161 | 8 | 7 | 1 | 2602 |
| 1992 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 174 | 162 | 2 | 4 | 0 | 3775 |
| 1993 | 0 | 0 | 0 | 0 | 1 | 12 | 95 | 157 | 1 | 8 | 10 | 2424 |
| 1994 | 0 | 0 | 4 | 0 | 3 | 5 | 171 | 137 | 0 | 3 | 53 | 2567 |
| 1995 | 0 | 0 | 1 | 0 | 9 | 4 | 100 | 79 | 1 | 10 | 60 | 2348 |
| 1996 | 0 | 1 | 1 | 0 | 20 | 5 | 110 | 107 | 2 | 5 | 45 | 2064 |
| 1997 | 0 | 2 | 6 | 2 | 41 | 14 | 177 | 74 | 0 | 5 | 69 | 2059 |
| 1998 | 1 | 2 | 12 | 1 | 25 | 22 | 315 | 72 | 0 | 3 | 93 | 1588 |
| 1999 | 3 | 0 | 3 | 1 | 22 | 7 | 63 | 18 | 2 | 3 | 60 | 639 |

*ఆర్ పి వి రిమోట్లీ పైలెటెడ్ వెహికిల్స్*

*ఎఎ/ఎటి య్యాంటీ ఎయిర్ క్రాఫ్ట్/ ఎంటీ ట్యాంక్ గన్స్*

*మిసి మిసైల్స్ (క్షిపణులు)*

*ఎం ఎల్ మిసైల్ లాంచర్స్*

*ఎం టి ఆర్ మోర్టాక్*

జి ఎ ఎం జి /యు ఎం జి  జనరల్ పర్పస్ మెషిన్ గన్స్/యూనివర్సల్ మెషన్‌గన్స్
ఆర్ ఎల్  రాకెట్ లాంచర్స్
ఎం ఎం జి  మీడియం మెషిన్ గన్స్
ఎల్ ఎం జి  లైట్ మెషిన్ గన్స్
జి ఆర్ ఎల్  గ్రనేడు లాంచర్స్
ఎ కె  ఎ కె శ్రేణి ఎస్సాల్ట్ రైఫిల్స్
మూలం  జమ్మూ కాశ్మీర్ పోలీసులు

1998 వేసవి నుంచి కొండల్లోని ఎత్తైన ప్రాంతాలలోనే పాకిస్తాన్ ఆఫ్ఘనిస్తాన్ విద్రోహులు స్వచ్ఛందంగా ప్రాణాలర్పించడానికి సిద్ధమైనవారు ప్రధానంగా సమీకృతమయ్యారు 5 కార్గిల్ లోయలో ఓటమి తప్పని యుద్ధాన్ని కొనసాగేందుకు కావలసిన వనరులుగానీ దీక్షగాని వారిలో లేవని గూఢచారి వర్గాలు అందించిన సమాచారం తెలుపుతోంది దీనికన్నా మరింత హేతుబద్ధమైన వివరణ వుంది దోడా బనిహాల్ కుప్వారా లోని రాజోరి పూంచ్ ప్రాంతాలలో నున్న కొండల్లో సంఖ్యాబలం పెంచుకోవడం ద్వారా తీవ్రవాద బృందాలు కాశ్మీర్‌లోయలోనికి ప్రవేశించే ప్రధాన మార్గాలన్నిటిపైనా ఆధిపత్యం చెలాయించగలుగుతాయి ఇటీవలి మాసాలలో భారీ మోర్టార్లు ఏంటి ఎయిర్ క్రాఫ్ట్ ఏంటి ట్యాంక్‌గన్నులు మొదలుకుని గ్రెయిల్ ఎంటిట్యాంక్ మిస్సైల్ లాంచర్ల వరకు ఎన్నో భారీ ఆయుధాలు పట్టుబడిన నేపథ్యంలో ప్రస్తుతపు మోహరింపు పరిమితస్థాయి సాంప్రదాయక తరహా యుద్ధంలో పాకిస్తాన్ సైన్యానికి తోడ్పడడానికే సన్నద్ధమవడాన్ని సూచిస్తోంది పోఖ్రాన్ తర్వాత అతివేగంగా సంభవించిన సంఘటనల వల్ల ఈ వాదన ప్రాముఖ్యతను సంతరించుకుంటోంది (పట్టిక –5) దాడికి ఉపయోగపడే ఎ కె శ్రేణి రైఫిళ్ళు పట్టుబడడం తగ్గింది ఇది చురుగ్గా కార్యకలాపాలుసాగించే విద్రోహుల సంఖ్య తగ్గడాన్ని సూచిస్తుండగా జమ్ముకాశ్మీర్ కదనరంగంలో ప్రమాదకరమైన ఆధునిక ఆయుధాల సంఖ్య పెరుగుతోందని ఈ గణాంకాలు స్పష్టం చేస్తున్నాయి ప్రధాన భద్రతాదళాల స్థావరాలపై నేరుగా జరిగిన దాడులు వారి ఎత్తుగడలకు అద్దం పడుతున్నాయి

ప్రోఎక్టివిటి పల్లవికి సైనిక విజయంతోగాని వాస్తవాలతోగాని పనిలేదు అలాంటపుడు దానివల్ల ఒనగూడే ప్రయోజనం ఏమిటన్నది ప్రశ్న

దీనికి సమాధానం బి జె పి చూపించగల వ్యూహాత్మక పరిష్కారాల్లోకాక జమ్మూకాశ్మీర్‌లో సిద్ధాంతరీత్యా ఎన్నికలకు సంబంధించి అది ఆశిస్తున్న రాజకీయ ప్రయోజనాలలో లభిస్తుంది రాష్ట్రంలో ప్రోఎక్టివిటి నినాదం మొదట జమ్మూ

ప్రాంతంలోని బి జె పి కి చెందిన హిందూ నియోజకవర్గ ఓటర్ల ఆందోళనలకు ప్రతిస్పందించే సాధనంగా ఉపయోగపడింది ఆ తరువాత తీవ్రవాదాన్ని అణచివేయడంలో తన వైఫల్యం వెల్లడవుతున్న నేపథ్యంలో పార్టీ వర్గాలని కూడదీసుకోవడానికి తోడ్పడింది విస్తృత స్థాయిలో చూస్తే ఫోఖ్రాన్ అనంతరం జమ్మూ-కాశ్మీర్‌పై తీవ్రస్థాయిలో మొదలయిన చర్చ 370వ అధికరణం రద్దు వంటి సిద్ధాంతానికి సంబంధించిన లక్ష్యాలను సాధించలేకపోయినా శక్తివంతమైన తీవ్రవాద వ్యతిరేకోద్యమం మాత్రం సాగుతోంది ఈ చర్య బి జె పి రాజకీయ వ్యవస్థకు దన్నుగా వున్న మితవాద శక్తులకు క్రొత్త ఊపిరి పోస్తున్నది

**కొత్తరూపంలో హింసాకాండ**

ఈ లక్ష్యాలన్ని జమ్మూ-కాశ్మీర్‌లో కొత్తగా ఏర్పడిన భయోత్పాత వాతావరణంలో గాఢంగా చిక్కుకుపోయాయి వీటిపై హేతుబద్ధ విశ్లేషణ జరగవలసి వుంది జమ్మూ-కాశ్మీర్‌లో విద్రోహాన్ని పెంచి పోషించేందుకే పరిమితం కాకుండా రాష్ట్రం వెలుపల కూడా తమ కార్యకలాపాలను విస్తరించడంలోనే తమకు భవిష్యత్తు వున్నదని హిజబుల్ ముజాహిదీన్ హర్కత్‌ఉల్ అన్సార్ లష్కరే తాయిబాలు గుర్తిస్తున్నట్లు వెల్లడించే రుజువులు ఒక్కొక్కటే బయటపడుతున్నాయి ఈ అతివాద మితవాద ఛాందససంస్థలకు జమ్మూ-కాశ్మీరులో సంఘర్షణ తాము ఒకవక్క భారతదేశంలోను మరో వక్క అపనమ్మకస్తులతోనూ జరపబోయే విస్తృత పోరాటానికి ఒక సాధనం మాత్రమే జమ్మూ-కాశ్మీర్‌లోను, ఇతరత్రా భారతదేశంలోను ముస్లింల అభద్రతనే సాకుతో వాళ్లు తమ లక్ష్యాన్ని సమర్థించుకోచూస్తారు ఆ అభద్రత హిందుత్వ మితవాదుల మతరాజకీయాలు ఆజ్యంపోసి పెంచినదే

1999 ఆగస్టులో జమ్మూ-కాశ్మీరు పోలీసులు ఇంటెలిజెన్సు బ్యూరోలు కలిసి ఆంధ్రప్రదేశ్ ఉత్తరప్రదేశ్ కొత్తఢిల్లీ హర్యానా జమ్మూ-కాశ్మీర్‌లలో శాఖలు వున్న లష్కరేతాయిబా సెల్ ఒకదాన్ని ఛేదించారు ఆగస్టు 3న సాంబా సరిహద్దువద్ద ఈసెల్‌కు సంబంధించిన కీలక సభ్యుడు హర్యానా నివాసి ఇస్లాముద్దీన్‌ను అరెస్టు చేసిన పోలీసులు ఆ వెంటనే పాకిస్తాన్ దేశీయుడు అబువాలిద్‌ను కూడా పట్టుకున్నారు ఢిల్లీ ముజఫర్‌నగర్ భాగాపట్‌లోని కాన్వెర్ గ్రామం భివాండి ముంబైలలో మరో తొమ్మిది మంది కూడా వెంట వెంటనే పట్టుబడ్డారు ముస్లింవాదుల దృష్టి' మొత్తం భారత భూభాగంపైన వుందని ఈ అరెస్టులు స్పష్టం చేశాయి జమ్మూ-కాశ్మీర్‌లోని పోరాటం ప్రపంచంవ్యాప్తంగా గల అపనమ్మకస్తులపై సమరంలో ఒకభాగం మాత్రమే ఈ వ్యక్తులను ప్రశ్నించినపుడు లష్కరేతాయిబాకు చెందిన 'మస్కర్ అబుబషీర్ మస్కర్

అబ్దుల్లా బిన్ మసూద్ మస్కర్ ఉమర్‌కుకా మస్కర్‌తేబా మస్కర్ అక్సా' అనే ఐదు శిబిరాలు మతపరమైన ఈ కొత్తపోరాటం జరిపే సైనికులకు శిక్షణా కార్యక్రమాలు నిర్వహించినట్లు వెల్లడయింది

జమ్మూ-కాశ్మీర్ లోని తిరుగుబాటుదారులు భారత్‌ను హైందవ దేశంగా భావించి బాహాటంగా మతపరమైన దాడికి పూనుకునేంత అనూహ్య పరిణామంగా ఎలా సాధ్యమైంది? విస్తుగొలిపే ఈ చిక్కుముడి హిందువుల మతపరమైన సమీకరణకు ముస్లింల దురభిమాని విధానానికి మధ్య అవినాభావ సంబంధాన్ని ఎత్తి చూపుతుంది

1998 వేసవిలో చెలరేగిన హింస సందర్భంగా జమ్మూ-కాశ్మీర్ పోలీసుల స్పెషల్ ఆపరేషన్స్ గ్రూపు (SOG) హిజబుల్ ముజాహిదీన్‌లో ఉన్నతస్థాయికి చెందిన కాశ్మీర్‌లోయ కమాండరు ఆలిమహమ్మద్‌దార్‌ను చంపివేసింది ముజాహిదీన్ వ్యూహాలను రూపొందించే మేధావుల్లో దార్ ఒకడు బుర్హానుద్దీన్ హిజాజిగా అతను అందరికి సుపరిచితుడు శ్రీనగర్‌లోని థార్ తాత్కాలిక రహస్య స్థావరంలో డజన్ల కొద్దీ పేజీల నోట్సులు దొరికాయి బహుశా అవి పాకిస్తాన్ నుంచి కార్యకలాపాలు సాగించే హిజబుల్ ముజాహిదీన్ సుప్రీం కమాండరు, జమాతే ఇస్లిమి దీర్ఘకాల సభ్యుడు సయ్యద్ సలాహుద్దీన్ అనే మారుపేరుగల మహమ్మద్ యూసఫ్ షాకు పంపించేందుకు ఉద్దేశించినవై వుంటాయి

దార్ డైరీలోని 66వ పేజి అఖిలభారత స్థాయిలో చేపట్టాల్సిన కొత్త కార్యాచరణ మార్గాన్ని సూచిస్తోంది "అత్యవసర ప్రాతిపదికన ఈ ఉద్యమాన్ని భారతదేశంలో ప్రారంభించడానికి తగుమార్గాలు, వనరులు అన్వేషించాలి' అని అందులో వుంది "అన్నిటికి మించి బాగా చొచ్చుకుపోయేందుకు వీలుగా (ఉద్యమాలను) ఆరంభించేందుకు వలసిన సమాచారం సరఫరాలు అందించేందుకు తగిన వ్యవస్థ' వుంటేనే ఇది సాధ్యం ఇందుకోసం (నేర ) దావూద్ ఇబ్రహీం వంటి చీకటి ప్రపంచపు జీవులతో సంబంధాలు ఎర్పరుచుకునేందుకు 'నకిలీ నోట్ల పథకం అమలు జరిపేందుకు ముగ్గురు వ్యక్తులతో కూడిన ఒక సెల్ పని చేస్తుంది

దానిలోని సూచనల ఆచరణాత్మకత ఎలా వున్నా హిజబుల్ ముజాహిదీన్ లష్కరే తాయిబాలు చేసిన బహిరంగ ప్రకటనలు వ్యర్థ ప్రేలాపనలు కావని స్పష్టం చేసినందుకు దార్ డైరీ ప్రాముఖ్యత సంతరించుకుంది హిజబుల్ ముజాహిదీన్‌కు చెందిన 'షా 1998లో భారత్‌ను సర్వనాశనం చేసేందుకు కృషి చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు అందుకతను వాడిన భాషాజాలం కొత్తది సంస్థ అధికారిక ప్రకటనలలోని భాషకు భిన్నమైంది "కాశ్మీర్‌ను బంధవిముక్తం చేస్తాం ఆ దేశమే (భారత్) చిన్నాభిన్నమై

అక్కడున్న 20 కోట్ల ముస్లిం జనాభా సార్వభౌమాధికారం సాధిస్తుంది 7 మర్కాజ్‌దావావాల్ ఇర్షాద్ అనేదొక మతసంస్థ లష్కరేతాయిబా ఆ మాతృసంస్థలో ఒక భాగం ఈ మార్కజ్‌దాకు చెందిన అంతర్గత పత్రిక మజల్లా అల్‌దావా 1998 డిసెంబరు సంచిక జమ్మూ-కాశ్మీర్‌లో తమ ఉద్యమం 'ఆరంభం మాత్రమే నని విశ్వసిస్తున్నట్లు పేర్కొంటూ భారత్ అంతటా తమ కార్యకలాపాల విస్తరణకు వేసుకున్న పథకాలను వివరించింది

## అలలుగా విస్తరిస్తున్న తీవ్రవాదం

దార్ హత్యకు దారితీసిన పరిస్థితులు సాంప్రదాయకమైన తన పరిధికావల కూడా ఆ సంస్థ కార్యకలాపాలు విస్తరించినట్లు తెలుపుతున్నాయి 1997 జూలైలో ఢిల్లీలో ఉత్తర జిల్లా పోలీసులు రాజధానిలో తీవ్రవాదులతో సంబంధం వున్న హవాలా ఆపరేటర్ల గురించి దర్యాప్తు ప్రారంభించారు ఈ డబ్బు లావాదేవీలకు జమ్మూకాశ్మీర్‌లోని వేర్పాటు రాజకీయాలకు వున్న సంబంధాన్ని పత్రికలు బహిర్గతం చేయడమే ఈ దర్యాప్తుకు కారణం తమ కందిన సమాచారంతో ఢిల్లీ పోలీసులు జతీందర్‌సింగ్‌రాజు మహ్మద్ ముస్లింగుల్లు అనే ఇద్దరు హవాలా ఆపరేటర్లను పట్టుకోగలిగారు లాహోరు నుంచి జమ్ము-కాశ్మీర్‌లోని కిస్తవార్ ప్రాంత వాసి ముస్తాక్ గిల్కర్‌కు రు 47 లక్షల సొమ్ము బదిలీ కావడానికి వీరు తోడ్పడ్డారు

గిల్కర్ ప్రముఖ దోడా హిజుబుల్ ముజాహిదీన్ తీవ్రవాది యూనస్‌గిల్కర్ తండ్రి అనారోగ్యం వల్లచురుకైన కార్యకలాపాల నుంచి విరమించుకునే వరకు అతను ఆ తీవ్రవాద సంస్థలో డివిజనల్ కమాండరుగా వుండేవాడు కృత్రిమమైన సొరుగు ఎర్పాటు గల ఒక ట్రక్కులో ఆ సొమ్మును దార్‌కు చేరవేసేందుకు ఈ ఒకప్పటి తీవ్రవాది అంగీకరించాడు లాహోర్‌నుంచి సొమ్మును అవలికి చేర్చిన హవాలా ఆపరేటర్ సాంకేతిక నామం 'కాజీసాహెబ్ వ్యవస్థీకృత నేరాల దర్యాప్తులో ప్రత్యేకించి 1996 ఫిబ్రవరిలో ఢిల్లీలో 361 హ్యాండ్‌గన్స్ పట్టుబడిన దరిమిలా జరిగిన దర్యాప్తుల్లో 'తారిక్ సాకిబ్ ఇక్బాల్'లతో సాటే ఈ 'కాజీ'పేరు కూడా తరచు వినవచ్చింది

సంప్రదాయికంగా తాము కార్యకలాపాలు నిర్వహిస్తున్న పరిధిని దాటి ఇతర ప్రాంతాలలోకి విస్తరించాలని విద్రోహులు ఎందుకు భావించారు? పాకిస్తాన్‌లోని మతఛాందసవర్గాల దృష్టిలో జమ్మూ-కాశ్మీర్‌లో సాయుధ సంఘర్షణ లక్ష్యం కేవలం ఆ ప్రాంత విముక్తిమాత్రమే కాదు ఇనుమడించిన ఇస్లాం ప్రాభవమే? పట్టుబడిన హర్కత్ ఉల్‌అన్సార్ హిజబుల్ ముజాహిదీన్ కార్యకర్తలను ప్రశ్నించినపుడు వెల్లడైంది ఇదే! జమ్మూ-కాశ్మీర్‌లో తిరుగుబాటు టర్కీనుంచి తూర్పు ఆసియా వరకు విస్తరించి

వుండే మహోజ్వల ఇస్లామిక్ రిపబ్లిక్ పునరుద్ధరణకు దారితీస్తుందని వారి విశ్వాసం వీరి ఈ స్వాప్నికతకు హిందూత్వవాదులు కలలుగనే అఖండ భారత్‌కు సారూప్యత వుంది ఐతే అందుకు వ్యూహాత్మక కారణాల వల్ల కాకపోయినా ఇస్లాంవాదుల ఆదర్శం నిర్దేశించే లక్ష్యసాధన వెనుకగల వాస్తవాలను బట్టబయలు చేయడానికి ఒక రంగం సిద్ధం చేయడం అవసరం

హిజబుల్ ముజాహిదీన్ వ్యూహాత్మకంగా అనుసరించబోయే మార్గం ఎదో స్పష్టంగా తెలియడంలేదు కాని, లష్కరే తాయిబా మాత్రం అనుకున్న లక్ష్యం సాధించడంలో తన సామర్థ్యం గురించి సందేహానికి తావులేకుండా చేసింది భారతదేశం నలుచెరగులా తీవ్రవాద కార్యకలాపాలు నిర్వహించేందుకు ఈ సంస్థకు అప్పటికే దాస్తామహమ్మద్‌బిన్ కాశింపేరుతో ఒక విభాగం వుంది దీన్ని అబ్దుల్ కరీం తుండా నిర్వహించేవాడు వార్తా పత్రికలలో వచ్చిన కొన్ని వార్తలు ఇతను 1998 నవంబరులో ఢాక్కాలో హతుడైనట్లు తెలుపుతున్నాయి కాని పథకం ప్రకారం ప్రచారం చేసిన తప్పుడు సమాచారం ఫలితమేనని తరువాత తేలింది 1997లోను 1998తోను దస్తా మహమ్మద్‌బిన్ కాశిం కొత్తఢిల్లీ హర్యానా పంజాబుల్లో ఎంతో ప్రభావం చూపేవిధంగా బాంబు విస్ఫోటనాలు జరిపించింది కాని దీనికి జమ్మూ-కాశ్మీర్‌లో పనిచేస్తు లష్కరేతాయిబా విభాగంతో కార్యనిర్వహణాపరమైన సంబంధాలు కలిగి వున్నట్లు దాఖలా లేవీలేవు

అయితే అంతగా వ్యవస్థీకృతంగాని సంబంధాలు వాటి మధ్య చాలాకాలంగా వున్నట్లు సాక్ష్యాధారాలున్నాయి ముంబై నివాసి జలీల్ అన్సారి కేసు దీనికొక ఉదాహరణ 1993 డిసెంబరు ఆరున కొత్త ఢిల్లి-ముంబై రాజధాని ఎక్స్‌ప్రెస్ రైలులో బాంబు విస్ఫోటానికి లష్కరే తాయిబాకు చెందిన ఈ తీవ్రవాదే బాధ్యుడు లష్కరే తాయిబా కమాండరు ఆజంఘోరి ఆదేశాల మేరకు 1990 అక్టోబరులో అన్సారి శ్రీనగర్‌లోని లష్కరేతాయిబా నెట్‌వర్క్ సహాయంతో నియంత్రణ రేఖ దాటి పాకిస్తాన్‌లో శిక్షణ కోసం పంపబడ్డారు 1991 నవంబరులో అతను లష్కరేతాయిబా నియంత్రణరేఖ మార్గం గుండానే భారత్‌కు తిరిగి వచ్చాడు పచ్చి ఇస్లాంమత వాదులతో అన్సారికి వున్న సంబంధం 1980 దశకం మొదట్లో భివాండిలో జరిగిన మతకల్లోలం తర్వానే ఆరంభంకావడం ఆసక్తిని కలిగిస్తుంది 1990 డిసెంబరు వరకు అతను గ్రేటర్ ముంబాయి మునిసిపల్ కార్పొరేషన్‌లోని ప్రజారోగ్య విభాగంలోనే పనిచేశారు కాని ఊపందుకుంటున్న రామజన్మభూమి ఉద్యమం అతను తన రాజకీయ విశ్వాసాలతో సంతృప్తి చెందకుండా సాయుధ పోరాటంలోకి దూకేలా చేసింది

ఽ ంత కాలంగా లష్కరెతాయిబా తరపున పనిచేస్తున్న పాకిస్తానీయులు జమ్మూ కాశ్మీర్‌లోని తమ సాంప్రదాయక పరిధిని దాటి బయట కూడా తమ కార్యకలాపాలు సాగిస్తుండడం వెలుగులోకి వచ్చింది 1998 జూలై ఒకటిన ఇంటెలిజెన్సు నిఘా ఫలితంగా ప్రముఖ లష్కరేతాయిబా కార్యకర్త మొహమ్మద్ సలీం జునెయిద్ హైదరాబాదులో అరెస్టయ్యాడు ఇతను పాకిస్తాన్‌లో జీలం జిల్లాకు చెందిన కాలాగుజ్రన్ గ్రామవాసి జునెయిద్ 1991లో లష్కరేతాయిబాలో చేరి జమ్మూ-కాశ్మీర్‌లో జిహాద్ (పవిత్రయుద్ధం) సైనికునిగా పనిచేశాడు సరిహద్దు మీదుగా లష్కరేతాయిబా రాకపోకల పర్యవేక్షకునిగా వున్న ఆజంఛీమా ప్రాపకం సంపాదించి అతి త్వరలోనే సంస్థలో ఉన్నత స్థానానికి ఎగబ్రాకాడు 1997 మార్చి 14న జలంధర్‌లో బాంబు విస్ఫోటానికి కారకుడైన వాసిం అక్బర్ 1999 వేసవిలో కాల్పుల్లో మరణించాడు 1998 మేలో ఉత్తరప్రదేశ్‌లో చురుగ్గా పనిచేస్తున్న మరో లష్కరేతాయిబా సభ్యుడు శ్రీనగర్‌లో ఎస్ ఒ జి తో జరిగిన ఎదురుకాల్పుల్లో మరణించాడు అబూతాల్హా అన్న మారుపేరు తప్ప అతని అసలుపేరు తెలియదు తరువాత 1998 జూలై 30న తుండాసెల్‌కి చెందిన ముగ్గురు సభ్యుల్ని ఢిల్లీ పోలీసులు అరెస్టు చేశారు పాకిస్తాన్‌లోని ఫైజలాబాద్ జిల్లా ఇస్లాంనగర్ వాస్తవ్యుడైన అబ్దుల్ సత్తార్ వీరికి నాయకుడు సహచరులు షోయిబ్ ఆలం మహమ్మద్ ఫైజల్ హుస్సేన్‌లతో కలిసి, సత్తార్ ఉత్తరప్రదేశ్‌లో మట్టిపాత్రలకు ప్రసిద్ధి చెందిన ఖుర్జాపట్టణంలో ఒక స్థావరాన్ని ఏర్పాటు చేసాడు విస్ఫోటన పదార్థాలు నిలువ చేసేందుకని ఈ బృందం కుమ్మరి కొలిమి కింద ఒక బంకర్ నిర్మించింది దీనివల్ల జమ్మూ-కాశ్మీర్ కావల కార్య నిర్వాహక బృందాలను ఏర్పాటు చేస్తున్న సంస్థ లష్కరే తాయిబా ఒక్కటే కాదన్నది సుస్పష్టం అవుతున్నది 1999 జనవరి 17న SOG సైఫుల్లా చిత్రాలి అనే వాయువ్య సరిహద్దు జిల్లా వాస్తవ్యుణ్ణి కాల్చి చంపింది అతనివద్ద ఉత్తరప్రదేశ్‌లోని దియోబంద్‌లో ముద్రించిన రాహే-జన్నత్ ప్రతులువేల సంఖ్యలో దొరికాయి విషపూరిత ప్రచారంతో ఏకపక్షంగా సాగిన 114 పేజీల ప్రచారం నిండిన పుస్తకాలవి

గతంలో కూడా జమ్మూ-కాశ్మీర్ స్థావరంగా గల తిరుగుబాటు బృందాలు అఖిల భారత సంస్థల ఏర్పాటుకు ప్రయత్నించాయి ఒకప్పటి స్టూడెంట్ లిబరేషన్ ఫ్రంట్ సభ్యులు హిలాల్ బేగ్ బిలాల్‌బేగ్, సజ్జాద్‌కెనోలు 1993లో నెలకొల్పిన జమ్మూ-కాశ్మీర్ ఇస్లామిక్ ఫ్రంట్ (JKLF) తక్షణమే రాష్ట్రం వెలుపల కార్యకలాపాలపై దృష్టి కేంద్రీకరించి ఢిల్లీ నగరంలో వరుసగా బాంబు ప్రేలుళ్లలను నిర్వహించింది 1993 ముంబై వరుస ప్రేలుళ్ల సూత్రధారి అబ్దుల్ రజాక్ 'టైగర్' మెమోన్‌తో కలిసి కెనో

1995 లో ముజఫరాబాద్‌లో ఒక విలేకర్ల సమావేశంలో పాల్గొన్నారు మరుసటేడాది జనవరిలో జరిగిన ఒక ఎన్‌కౌంటర్లో కెనో మరణించడానికి కొంచెం ముందు ఈ సమావేశంలో వారిద్దరూ కలిసి పాల్గొన్నారు అంతకుముందు 1995 జూన్‌లో రావల్పిండిలో జరిగిన ఒక సమావేశం సందర్భంగా జె కె ఐ ఎఫ్ మెమొన్‌లకు నడుమ సంబంధాలు ఏర్పడ్డాయని విశ్వసిస్తున్నారు

ముందు కెనో మరో ఆరు నెలలకు హిలాల్‌బేగ్ మరణించినా భారతదేశం మొత్తం మీద కార్యకలాపాలు నిర్వహించాలన్న JKLF మౌలిక పథకంలో మార్పు రాలేదు కాశ్మీర్‌లో 1996లోక్‌సభ ఎన్నికల సందర్భంగా కొత్త ఢిల్లీలోని లజపతినగర్ షాపింగ్ కాంప్లెక్స్‌లో భారీ విస్ఫోటనం జరపడం ద్వారా జెకెఐఎఫ్ కెనో మరణానికి ప్రతీకారం తీర్చుకుంది ఇందుకవసరమైన ప్రేలుడు సామాగ్రిని ఛోటా- జావేద్‌ఖాన్ భారతదేశంలోనికి దొంగతనంగా తీసుకొచ్చినట్లు ఆ తరువాత వెల్లడయింది జావేద్‌ఖాన్‌ను ఆయూబ్ అహ్మద్ భట్ పాక్ ఆక్రమిత కాశ్మీర్ వాస్తవ్యుడు అబ్దుల్ రషీద్ జలాలుద్దీన్‌లను 1996 జూన్ రెండున అహ్మదాబాద్‌లో అరెస్టు చేశారు ఈ బృంద నాయకుడు కిస్త్‌వార్‌వాసి అబ్దుల్ ఘనిఫో ని ప్రశ్నించినప్పుడు అతను అహ్మదాబాద్‌లో తమకు ఆయుధాలను రహస్యంగా తలదాచుకునేందుకు వసతిని నగర చీకటి ప్రపంచ ప్రముఖుడు దావూద్ ఇబ్రహీం సహచరుడు అబ్దుల్ లతీఫ్ అబ్దుల్ వాహబ్‌షేక్ సమకూర్చినట్లు వెల్లడించాడు

ముంబైలో ఐ ఎస్ ఐ కార్యకర్తలుగా భావించి పట్టుకున్న వారిని ఇటీవల ప్రశ్నించినపుడు కూడా వారు బిలాల్ బేగ్ పేరు పేర్కొనడం ఆసక్తిని కలిగించే అంశం రాజకుమార్ అనే పేరుతో వ్యవహరిస్తున్న షంషద్ హైదర్‌ను జావేద్ ఘులాం హుస్సేన్‌ను 1997 ఆగస్టు 28, 1998 ఫిబ్రవరి 27 మధ్య కాలంలో ముంబైలో వరుసగా ఆరు బాంబు పేలుళ్ళు నిర్వహించినందుకు ముంబైలో అరెస్టు చేశారు వారికి తోడ్పడిన ముగ్గురు పాకిస్తాన్ జాతీయులను ఇంకా గుర్తించవలసివుంది

తమ ముఖ్య ప్రయోజనాలతో ఏ సంబంధం లేని వ్యవహారంలో చీకటి ప్రపంచం ఎందుకు సహకరించింది? తీవ్రవాద కార్యకలాపాలలోనికి తమను దించాలని ఐ ఎస్ ఐ చేసిన తొలి ప్రయత్నాల్లో ముంబై చీకటి ప్రపంచంలోని ముస్లిం వర్గాలు ఆసక్తి చూపలేదని గమనించడం ఇక్కడ అవసరం పశ్చిమ ఆసియా నుంచి భారత్ పశ్చిమ తీరానికి పాకిస్తాన్ ప్రాదేశిక జలాల గుండా వున్న నౌకా మార్గాలను కోల్పోయే ప్రమాదం వున్నాగాని 1980 దశకం చివర్లో కరాచీ కేంద్రంగా వున్న దొంగ రవాణాదారులు యూసఫ్ గొడ్రావాలా తౌఫిక్ జలియన్‌వాలా చేసిన ప్రతిపాదనలకు దావూద్ ఇబ్రహీం

తొంగలేదని తెలుస్తోంది 1992-93లో పాశవికమైన ముస్లిం వ్యతిరేక హింస దరిమిలా బాబ్రీ మసీదు విధ్వంసం జరిగాకనే చీకటి ప్రపంచం మతపరమైన రంగు పులుముకుంది ? అనూహ్య పరిణామాలకు తెరలేచింది

## సమాంతరంగా వ్యాపిస్తున్న హింస

జమ్మూ-కాశ్మీర్‌లో తిరుగుబాటును మొత్తం భారత దేశానికి వ్యాపింప చేయడం జాతి దురభిమాన బృందాల వ్యూహంలో ఒక భాగం మాత్రమే ముస్లిం ఆధిక్యతగల అన్ని ప్రాంతాలలోను హింసను ప్రేరేపించడం మరో కీలకమైన అంశం లేహ్ ప్రాంతం అంతటా హింస బాగా పాకిందనడానికి 1999 వేసవిలో జరిగిన మారణహోమాలు హింసాత్మక దాడులే నిదర్శనం లేహ్ ప్రాంతంలోని టుర్టోక్‌లో 25 మంది తీవ్రవాదులు సభ్యులుగా వున్న ఒక విభాగాన్ని కనుగొని 1999 జూన్-జూలై మధ్య కాలంలో వారందరిని అరెస్ట్ చేశారు స్థానికుడైన ఆలీ భుట్టో వారికి నాయకుడు వీరి ఉనికి ఇంత వరకు ప్రశాంతంగా వున్న ఆ ప్రాంతంలో సంఘర్షణలు తప్పవని స్పష్టం చేసింది

లేహ్ ప్రాంతానికి ఆవల భుట్టో అరెస్టు కావడం పెద్దగా ఆందోళన కలిగించలేదు ఐతే ఇంకా ఎన్నోచోట్ల తీవ్రవాదం ఇలా తగ్గు స్థాయిలోనే సాదాసీదాగా మొదలయింది 1990 మే నెలలో అయూబ్ షబ్నం అరెస్టుకావడం పూంచ్‌లో దాడుల ఆరంభానికి తొలి సంకేతం ఎందరో స్థానిక కార్యకర్తలకు శిక్షణనిచ్చి వారికి ఆయుధాలు పంపిణీ చేసినట్లు విశ్వసిస్తున్న షబ్నం ఐదేళ్ళు జైలులో గడిపాడు కాని భుట్టో మాదిరిగానే అతనికి కూడా పాకిస్తాన్ అసలు లక్ష్యం గురించి ఎమీ తెలియదు 1993లో పూంచ్‌లో మంటలు ఎగిసిపడేదాకా ఈ సంఘటనల నెవరూ పట్టించుకోలేదు

జూన్ 7 నుంచి వరుసగా జరిగిన దాడుల్లో భుట్టోను భుట్టో నేతృత్వంలోని విభాగం సభ్యులందరిని అరెస్టు చేశారు వారిలో ఇద్దరు పోలీసుకానిస్టేబుళ్ళు కూడావున్నారు (స్కర్దు ను స్థావరంగా చేసుకున్న భుట్టో సోదరుడు ఇబ్రహీం సాంగ్ తీసుకొచ్చిన 25 కలిష్కనోవ్ అస్సాల్ట్ రైఫిళ్ళు ఒక భారీ మెషీన్ గన్ను ఒక జనరల్ పర్పస్ మెషిన్ గన్ను ఒక స్నిప్పర్ రైఫిల్ రాకెట్ ప్రొపెల్డ్ గ్రెనేడ్ లాంచర్ పలు కిలోల ప్రేలుడు పదార్థాన్ని ఈ విభాగం దాచి వుంచింది సాంగ్‌సాంగ్ 1998లో నియంత్రణ రేఖ మీదుగా పలు దఫాలు ప్రయాణం చేసి, ఐదు గ్రామాల్లో తన బంధువులకు సహచరులకు ఆయుధాలు అందచేసాడని అతన్ని ప్రశ్నించినపుడు బయట పడింది

టర్టోక్ పచ్చాధాంగ్ తక్షి ధాంగ్ చాలుంగ్‌పా అనే ఆ ఐదు గ్రామాలు 1971 యుద్ధంలో భారత్ స్వాధీనం చేసుకున్న గ్రామాలు పాకిస్తాన్ సైన్యం సలహాను ధిక్కరించి

పుట్టిపెరిగిన చోటు విడిచిపోవడం తప్పని భారతదేశంలోనే వుండిపోదామని గ్రామస్తులకు నచ్చ చెప్పడంలో భుట్టో తండ్రి ప్రధాన పాత్ర వహించాడు సమీపంలోనేవున్న బోగ్‌డాండ్ గ్రామంలో ఆసక్తికరమైన సంఘటన జరిగింది 1971లో చొచ్చుకొస్తున్న భారత సైన్యం పై గెరిల్లా యుద్ధం సాగించమని చెబుతూ పాకిస్తాన్ సైన్యం ఆ గ్రామస్తుల్లో పలువురికి రైఫిళ్ళు అందించింది కాని వారు ఆ రైఫిళ్ళని కొండ గొర్రెలను వేటాడేందుకు ఉపయోగించారు10

విశాల ప్రాతిపదికపై వుండే సైద్ధాంతిక అంశాలకు స్థానికమైన సమస్యలకు' నడుమ వుండే ప్రగాఢమైన సంబంధాలకు ఇబ్రహీం సాంగ్‌సాంగ్ వృత్తాంతం అద్దం పడుతుంది స్థానిక అధికారులు సైనికాధికారులతో సాంగ్‌సాంగ్‌కు సన్నిహిత సంబంధాలుండేవి 1987లో ఢిల్లీలో గణతంత్ర దినోత్సవ వేడుకలకు ఆహ్వానించేందుకు అతని పేరును కూడా ప్రతిపాదించారు అయితే అతడు 1994 నాటికి ఒకదాని వెంబడి ఒకటిగా అనేక కోర్టు వ్యాజ్యాలలో కూరుకుపోయాడు కొన్ని గ్రామాలకు విద్యుత్ సరఫరా చేసే డీసెల్ జనరేటర్ వినియోగం గురించి వివాదంలో ఒక పోలీసు ఆఫీసరుపై చెయ్యి చేసుకున్న కారణంగా అతనీ వ్యాజ్యాల్లో చిక్కుకున్నాడు న్యాయవ్యవస్థ ఒత్తిడికి తట్టుకోలేక సాంగ్‌పాపా నియంత్రణ రేఖ అవలికి పలాయనం చిత్తగించాడు భారత్‌లోనే వుంటే ఏళ్ళ తరబడి జైలు శిక్ష తప్పదు అంతకన్న మెరుగైన జీవితం గడపవచ్చునని ఐ ఎస్ ఐ అతన్ని ప్రలోభ పెట్టినట్లుంది

కాని ఆ ఐదు గ్రామాలలో పలు ప్రధానాంశాలు కీలకపాత్ర పోషిస్తున్నాయి సాంప్రదాయకంగా ఆ ప్రాంతంలో నూర్‌బక్ష్ శాఖదే పెద్దరికం ఈ శాఖ షియా సున్ని పంప్రదాయాలు రెండింటి నుంచి ఉత్కృష్టమైన విషయాలను గ్రహిస్తుంది కాని ఇప్పుడది మతాంతరీకరణలు ప్రోత్సహించే అహలె హాదిస్ వర్గం నుంచి నిరంతరం ముట్టడినెదుర్కొంటోంది అహలె హాదిస్ జమ్మూ-కాశ్మీర్‌లోని తీవ్రవాద బృందాలతో ముఖ్యంగా లష్కరె తాయిబా తహరిక్-ఉల్‘ముజాహిదీన్ బృందాలతో సన్నిహిత సంబంధాలు కలిగివుంది

జమ్మూ-కాశ్మీర్‌లో లౌకికవాదం ఎదుర్కొంటున్న సవాళ్ళను ప్రతిఘటించేందుకు ఆదర్శప్రాయంగా నిలిచే రాజకీయ ఉదాహరణలుగాని కనీసం వాటి చిహ్నాలుగాని లేకపోవడం విచారకరం టర్టోక్ సెల్ గుట్టు రట్టవగానే సైన్యం స్పందించింది సాయుధ దళాల ప్రత్యేక దళ చట్టాన్ని (ఆర్మ్‌డ్ ఫోర్సెస్ ఎట్) ఆ ప్రాంతంలో విధించాలని, టర్టోక్ గ్రామస్తులని బలవంతంగానైనా లేహ్‌లో స్థిరపడేలా చేయాలని డిమాండ్ చేసింది 11 లేహ్‌లో 3 ఇన్‌ఫాంట్రి డివిజన్ కమాండరు లెఫ్టినెంట్ జనరల్ బుధ్‌వార్

అసలు అక్కడా గ్రామం వుండడమే భారత జాతీయ భద్రతకు ముప్పు అంటూ వాదించి జిల్లా పాలక వర్గం నిర్ఘాంతపోయేలా చేశారు సైనికాధికారుల అవగాహనా రాహిత్యానికిది నిదర్శనం

## సాధికార స్పందన

తీవ్రవాదాన్ని అదుపు చేయడంపై 1998లో ఒక విధాన (కాన్సెప్ట్) పత్రం వెలువరించారు బి జె పి ప్రేరణతో సైన్యంలోని అగ్రశ్రేణి నాయకత్వంలో అధికార దర్పాన్ని ప్రదర్శించే ధోరణులు పెరుగుతున్న వైనాన్ని ఆ పత్రం వెల్లడిస్తుంది సిమ్లాలోని ట్రెయినింగ్ కమాండ్ తీవ్రవాదంతో సతమతమవుతున్న ప్రాంతాలలో సైన్యాన్ని మోహరిస్తున్న విధానంలో తీవ్రమైన మార్పులను ప్రతిపాదిస్తూ అంతర్గత సంఘర్షణలు చక్కదిద్దడం అనే 37 పేజీల పత్రాన్ని రూపొందించింది 1998 నవంబరు 24న రక్షణ మంత్రి జార్జి ఫెర్నాండెజ్ సిమ్లా సందర్శించినపుడు లెఫ్టినెంట్ జనరల్ ఉబెరాయ్ ద్వారా ఆయనకు అందచేసేందుకే ఆ పత్రాన్ని తయారు చేశారు

ప్రభుత్వం వైఫల్యం వల్లనే తిరుగుబాట్లు వస్తాయని ప్రజల్లో ప్రాచుర్యంలో వున్న బూజుపట్టిన భావనతో ఆరంభమయ్యే 'అంతర్గత సంఘర్షణ అనే ఈ పత్రం ప్రభుత్వ వైఫల్యానికి ఉదాహరణగా జమ్మూ-కాశ్మీర్‌లోను ఈశాన్య ప్రాంతంలోను ఎదురవుతున్న సవాళ్లను వివరిస్తుంది వింతేమిటంటే చుట్టు ఆవరించివున్న అంధకారంతో తాను ఒంటరిగా బండిలాక్కొస్తున్నట్లు వాదిస్తూ ఒంటరిగా తానొక ప్రభుత్వాంగంకాదని సైన్యం భావిస్తున్నట్లు స్పష్టం చేస్తుంది ఇది సమస్యను సృష్టించేదిగావుంది దేశానికి తీవ్రవాదం ఒక్కటే కాక ఇంకా కొన్ని సమస్యలున్నాయి వర్గపోరాటం ఆర్థిక విషయాలను వివాదాలు కుల పోరాటాలు వంటి సమస్యలను సైన్యం తోడ్పాటు లేకుండానే ఎదుర్కొంటోంది ఇంకొక ముఖ్య విషయం ఎమంటే తాను కీలక ప ్ర పోషించే రంగాల్లో సైన్యం సాఫల్య వైఫల్యాలు దేశంలోని ఇతర సంస్థల సాఫల్య వైఫల్యాలకన్నా ముఖ్యమైనవేం కావు పనిచేయకపోవడమే అందుకు కారణం ఆంతరంగిక భద్రతా వ్యవహారాలు చట్టం రాజ్యాంగం పరిధికి లోబడి వుంటుంది అయితే ఇవేవీ 'ఆంతరంగిక సంఘర్షణ'కి అవరోధం కావు

చొరబాటు నిరోధక గూఢచారి చర్యలలో సైన్యానికి న్యాయపరమైన ప్రత్యేక రక్షణ కల్పించాలనేది ఆంతరంగిక సంఘర్షణ చేస్తున్న డిమాండ్‌లలో కీలకమైంది ప్రస్తుతం కొన్ని సందర్భాల్లో అలాంటి ప్రత్యేక రక్షణ లభిస్తున్నా ఈ చట్టాల్ని అమలు చేయడంలో అనేక చిక్కులున్నాయి

శాంతి భద్రతల నిర్వహణకు సైన్యాన్ని వినియోగించే విషయానికి వస్తే ఆ సైనికుల హక్కులను

పరిరక్షించే సందర్భంలో వారి నిర్వహణా సామర్థ్యంతోబాటు నైతఇక దృక్కోణం నుంచి కూడా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వుంది అలా కాకుండా శాంతి భద్రత పరిరక్షణ కొరకు కల్లోలిత ప్రాంతాలు చట్టం పరిధికి లోబడి సైనికాధికారులకుప్రత్యేక అధికారాన్నిచ్చే చట్టం చేయడం చర్విత చరణమే అవుతుంది

అధికారంలోకి రాకముందు దోడా వంటి ప్రాంతాలలో సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని అమలు చేస్తామని బి జె పి పదేపదే చెబుతూ వచ్చింది ఈ ప్రత్యేక అధికారాల చట్టంవల్ల కాశ్మీర్ లోయలో గత దశాబ్దంగా సైనికుల హక్కుల రక్షణ శాంతి నెలకొల్పబడిందనడానికిగాని కన్పించబడిందనిగాని స్వయంగా చూచిన వాటికి గూడా అక్కడ తీవ్రవాద వ్యతిరేక చర్యలలో తలమునకలుగావున్న పోలీసు విభాగాలకుగాని పారా మిలటరీ దళాలకుగాని లేని ఇటువంటి విస్తృత రక్షణ సైన్యానికి కల్పించడం వారి నుంచి ఇంతకన్న పెద్ద డిమాండులను ఆహ్వానించినట్లే అవుతుంది పంజాబు జమ్మూ–కాశ్మీర్‌లలో పరిస్థితుల మధ్య వున్న తేడాలను ఎత్తి చూపుతూ విద్రోహుల అణచివేతలో సైన్యం ఇతర సంస్థలు నిర్వహించే పాత్రలలో ఎంతో తేడావుందని చూపేందుకు 'అంతర్గత సంఘర్షణ ' పత్రం ప్రయత్నిస్తోంది

ఇలా సైన్యానికి ప్రధానపాత్ర వున్నచోట్ల ఇతర భద్రతా వ్యవస్థలన్నీ సైన్యం ఆపరేషన్ కమాండ్ (కార్యాచరణపై అజమాయిషీ)కి లోబడి వుండాలని ఈ పత్రం నొక్కి చెబుతోంది

పోలీసులు (కేంద్ర పోలీసు వ్యవస్థ–సి పి ఒ తో సహా) సమర్థవంతంగా అదుపు చేయగల వాతావరణం వున్న సందర్భాల్లో మౌలిక కార్యనిర్వహణా బాధ్యతలు వారికే వుండాలి ఒక వేళ అక్కడ సైనిక బలగాలను మోహరించినా అది ప్రత్యేకంగా ఎంపిక చేసిన చోట్లలోనే ఉండాలి సైన్యం సహాయం అందించే పాత్రను మాత్రమే పోషించాలి ఐతే పోలీసుల సామర్థ్యానికి మించి పరిస్థితి క్షీణిస్తున్నచోట్ల అది తీవ్ర స్థాయి తిరుగుబాటు లేదా ప్రచ్ఛన్న యుద్ధ పరిస్థితికి దిగినప్పుడు సైన్యమే నాయక పాత్ర వహించాలి అన్ని కేంద్ర పోలీసు బలగాలను సైన్యం ఆపరేషన్ కమాండు కింద వుంచాలి 13

ఆచరణలో దీని అర్థం తేటతెల్లంగావుంది పారా మిలటరీ దళాలను తరచు స్థానిక పోలీసు బలగాలకే అనుబంధంగా వుంచుతారు జిల్లా స్థాయి పోలీస విభాగాలకు విద్రోహ నిరోధక కార్యకలాపాలలో అవసరమయ్యే నేర్పు పరికరాలు, సిబ్బంది అందుబాటులో వుండేందుకు ఈ విధానం తోడ్పడుతుంది 'అంతర్గత సంఘర్షణ

ఈ విధానాన్ని తీవ్రంగా విమర్శిస్తోంది జిల్లా స్థాయిలో అనుబంధ సైన్యాన్ని వుంచడం వల్ల సి పి ఒ అధికారులకు వాస్తవంగా ఎ బాధ్యతలు వుండవని ఆ పత్రం వాదిస్తోంది పోలీసు బలగాలకు అనుబంధంగా వుండే ఈ దళాలను సైన్యానికి బదలాయించడం వల్ల అక్కడి సమస్య ఎలా పరిష్కారమవుతుందో తెలియడం లేదు కాని అలాంటి ప్రతిపాదన విద్రోహ నిరోధక చర్యలలో స్థానిక పోలీసుల భాగస్వామ్యానికి

మంగళం పాడేలా చేస్తుంది విద్రోహాన్ని నిరోధించే పనిలో తన భాగస్వామ్యం కనిష్ట స్థాయిలో వుండాలని సైన్యం భావిస్తున్నట్లు ఆ పత్రం పేర్కొంటున్న నేపథ్యంలో ఆ వ్యవహారంలో పూర్తి పెత్తనం సైన్యానికి కట్టబెట్టాలనడం విడ్డూరమే

పౌర పరిపాలనపై కూడా పెత్తనం కోరడం విధానపత్రంలో అన్నిటికన్నా ప్రమాదకరమైన ప్రతిపాదన 'అంతర్గత సంఘర్షణ' పరిపాలనలో అన్ని స్థాయిలలోను ఏర్పాటు కానున్న కొత్త సమన్వయ వ్యవస్థలో సైన్యానికి ప్రాతినిధ్యం కోరడంతో ముగుస్తుంది ఈ వ్యవస్థ పౌర అధికారులు పోలీసులు సైన్యం మధ్య అనుసంధానానికి వీలు కల్పిస్తుంది

రాష్ట్రాలలో జిల్లా స్థాయి తహశీలు స్థాయి వరకు సమన్వయం తప్పనిసరిగా వుండాలి ఉమ్మడిగా ప్రణాళికలు రూపొందించడానికి నిర్ణయాలు తీసుకోవడానికి మార్గనిర్దేశన సమన్వయం నియంత్రణలకు ఈ వ్యవస్థ వీలు కల్పించాలి ఈ సంఘం సమర్థవంతంగా పని చేసేందుకు సంబంధిత కార్యాలయాలు ఒకే చోట వుండడం ఉమ్మడి కంట్రోలు రూము ఎర్పాటు చేయడం నేరుగా సంపర్క సమన్వయాలకు అవకాశం వుండడం అవసరం అయితే గత్యంతరం లేనిచోట్ల పౌర పోలీసు సైన్య పరిపాలనలు ఒక దాని పరిధి నింకొకటి అతిక్రమించవచ్చు 14

ఈ ప్రతిపాదనల అమలు బహుముఖ్యమైనది వీటిలో వాడిన భాష, ముఖ్యంగా రాష్ట్రాల అనే బహువచన ప్రయోగం వల్ల ఈ పథకం సైనిక సారథ్యం క్రింద వున్న ప్రాంతాలలోనే లేక ఇటువంటి ప్రమాదం కొత్తగా తలెత్తే చోట కూడా నా లాంటి వూహాగానాలకు ఆస్కారం కలుగుతోంది నిర్దిష్ట హద్దులు లేని ఏకీకృత పాలనా వ్యవస్థలనే భావన, పౌర పరిపాలనలో సైన్యం జోక్యం కల్పించుకోరాదు చట్టం నిర్దేశించే పోలీసు స్వయం ప్రతిపత్తి రెండు సూత్రాలకు గండి కొడుతోంది పౌర వ్యవహారాల యాజమాన్యంలో సైనిక జోక్యం పరిపాలనా వ్యవహారాలను ఎ విధంగా మెరుగు పరచగలదో 'అంతర్గత సంఘర్షణల నిర్వహణపత్రం ఎక్కడా వివరించడం లేదు అలా కల్పించుకోవడం వల్ల తలెత్తగల సమస్యల గురించి అసలే మాట్లాడడం లేదు

విశాలదృక్పథంతో పరిశీలిస్తే 'అంతర్గత సంఘర్షణ ' సైన్యం తన స్వంత సిద్ధాంత రూపకల్పనలోనే అనేక అసందిగ్ధతలకు తావిచ్చినట్లు స్పష్టమవుతుంది అంతర్గత స్థానభ్రంశాలకు తమను దూరంగా వుంచాలంటూనే అటువంటి అవసరమే వస్తే 'మార్షల్ లా' విధించమని కోరుతున్నది తరచు ఎదురవుతున్న భద్రతా సమస్యల నెదుర్కొవడానికి సైన్యం ఏవిధంగా తయారవాలి ఎలా రూపుదిద్దుకోవాలనేదానికి ఈ పత్రం సరైన అవగాహన నివ్వడం లేదు

పోఖ్రాన్–2కు ముందు భారత సైనిక సిద్ధాంతంలో చాలా భాగానికి ప్రాతిపదిక

సాంప్రదాయకంగా తాను ఆధిక్యతకలిగి వున్నానే భావనే సింధు ప్రాంతం వెంట, అణ్వస్త్ర ప్రతిక్రియ లేకుండా భారీ ట్యాంకులు నడిపించడం సాధ్యంకాని ప్రస్తుత పరిస్థితిలో ఆ భావన అర్థరహితం చిన్నచిన్న స్థానిక పోరాటాలను సమర్థవంతంగా ఎదుర్కోవాలంటే తన సిద్ధాంతాలను తప్పనిసరిగా మార్చుకోవాలనే విషయంలో సైన్యం ఏమీ ఆలోచించలేదని స్పష్టమవుతోంది 'ఆంతరంగిక భద్రత' విషయంలో ప్రోయాక్టివ్ ధోరణి' అనే నినాదం పేరుతో బి జె పి ప్రవేశపెట్టిన 'అంతర్గత సంఘర్షణ' పత్రం ఆ పార్టీ నిస్సార అసమర్థ, రాజకీయ ఆలోచనలకు అద్దం పడుతోంది

ఈ పత్రంవల్ల సంభవించగల పరిణామాలు అప్పుడే కానవస్తుండడం ఆందోళన కలిగిస్తోంది 15వ కార్ప్స్ కమాండర్ లెఫ్టినెంట్ జనరల్ పాల్ తననీ బాధ్యతల నుంచి తప్పించమని కోరిన అనంతరం 1999 జూన్‌లో సైన్యం విద్రోహ వ్యతిరేక కార్యకలాపాల బాధ్యతను చేపట్టిన రాష్ట్రీయ రైఫిల్స్ డైరెక్టర్ జనరల్ అవతార్‌గిల్ మరికొద్ది కాలానికే బి ఎస్ ఎఫ్ , సి ఆర్ పి ఎఫ్ వంటి పారామిలటరీ దళాలను తన నిర్వహణాధిపత్యం కింద వుంచాలని డిమాండు చేశారు గిల్ ప్రతిపాదనకు బి ఎస్ ఎఫ్‌గాని సి ఆర్ పి ఎఫ్‌గాని సంబరపడలేదని వేరే చెప్పక్కరలేదు సైన్యం డిమాండ్‌కు నిరసన తెలుపుతూ బి ఎస్ ఎఫ్ డైరెక్టర్ జనరల్ ఇ ఎన్ రామ్మోహన్ కేంద్ర హోంశాఖ కార్యదర్శికి లేఖ రాసినట్లు వార్తలొచ్చాయి ఆ చర్యవల్ల జమ్మూ కాశ్మీర్‌లోని దళాల మధ్య వుండే సంబంధాలు చెడిపోతాయని, అది దళాల మధ్య దాయాది పోరుకు వైషమ్యాలు పెచ్చరిల్లేందుకు దారితీస్తుందని రాంమోహన్ ఆ లేఖలో వాదించారు అంతేకాక రాష్ట్రీయ రైఫిల్స్‌ సైన్యంలో భాగం కాదని బి ఎస్ ఎఫ్ సి ఆర్ పి ఎఫ్‌ల మాదిరిగా అది కూడా ఒక కేంద్ర పోలీసు వ్యవస్థేనని (సిపిఒ) ఆయన ఎత్తి చూపారు సరిహద్దుల వద్ద మోహరించిన బి ఎస్ ఎఫ్ దళాలు ఎలాగూ సైన్యం నిర్వహణాధిపత్యం కిందనే వున్నాయని, కనుక అదే వ్యవస్థను అంతర్గత భద్రతా విధులకు వర్తింపచేయడం అసంబద్ధమని ఆ సంస్థ భావిస్తోంది

కొత్త అధికారాల కోసం గిల్ చేస్తున్న డిమాండ్ ఎక్కడకు దారితీస్తుందో ఎవరూ చెప్పలేకపోతున్నారు ప్రస్తుతానికైతే భద్రతా వ్యవస్థ నెత్తిన సవారీ చేయాలని సైన్యం చేస్తున్న ప్రయత్నాలను రాష్ట్ర ప్రభుత్వం తిప్పికొట్టినట్టే కనబడుతోంది హెడ్ క్వార్టర్స్ ఛైర్‌పర్సన్ అయిన జమ్మూ-కాశ్మీర్ ముఖ్యమంత్రి భద్రతా విషయాలన సలహాదారుగా వున్న పాల్ స్థానంలో గిల్ బాధ్యతలు చేపట్టారు ఐతే పాల్ మాదిరిగా ముఖ్యమంత్రి గైర్హాజరీలో సమావేశాలకు అధ్యక్షత వహించే హక్కు ఆయనకు లేదు ఆ అధికారాన్ని ఇప్పుడు జమ్ము-కాశ్మీర్ ప్రధాన కార్యదర్శికి దఖలు పరిచారు ప్రస్తుతం

పౌరపాలనాధికారానికి వచ్చిన ముప్పేం లేదు తిరుగుబాటును అణచివేసి శాంతి నెలకొల్పేందుకు కొత్త మార్గాలను అన్వేషించే పెను సవాలుకు అది తగిన ప్రతిస్పందన కాలేదు అధికారంలో వున్నవారెవరూ ఈ పెద్ద సమస్యను పట్టించుకోకపోవడం విచారకరం 15

జమ్మూ-కాశ్మీర్‌లో ఛాందస మతవాద దురభిమాన బృందాలు సైద్ధాంతికంగా బలపడుతున్న తరుణంలో విద్రోహ వ్యతిరేక వ్యూహంలో సృజనాత్మకత కొరవడడం ఎంతో ఆందోళన కలిగిస్తోంది జమ్మూ-కాశ్మీర్‌లో చారిత్రకంగా లౌకికవాద మధ్యేవాద శక్తిగా వ్యవహరిస్తున్న నేషనల్ కాన్ఫరెన్సు ఒక ముస్లిం సంస్థగా రూపు దాల్చే ప్రయత్నంలో వుందని ఆర్ ఎ సి తన నివేదికలో వెల్లడిస్తోంది జమ్మూ-కాశ్మీర్ ప్రాంతంలో ఈ ధోరణి మరింత ప్రస్ఫుటంగా వుంది పచ్చి మతవాద జమాతే ఇస్లామి నాయకులు నేషనల్ కాన్ఫరెన్సు వారితో ఒకే వేదిక నుంచి ప్రసంగించారని నేను లోగడే ప్రస్తావించాను జమ్మూ-కాశ్మీర్‌లోను తక్కిన భారత దేశంలోను ముట్టుకుంటే భగ్గుమంటున్నా మతవాదాన్ని ఆధారంగా చేసుకుని తీవ్రవాదం స్వరూప, వ్యవస్థల్లో వస్తున్న మార్పులకు హిందూత్వ నేతృత్వంలోని ప్రభుత్వం తగు జవాబునివ్వగల స్థితిలో లేదు

# కప్పిపుచ్చే ప్రయత్నమే

కె ఆర్ సి రిపోర్టు

భారత ప్రధాని ఒకరు పాకిస్తాన్ ప్రకటనలను నిజాలుగా నమ్మి మోసపోవడం ఇది మొదటిసారికాదని అంతా మరిచిపోయారు లాల్‌బహదూర్‌శాస్త్రి విషయంలో అదే జరిగింది 1965 జూన్‌లో రాణ్ ఆఫ్ కచ్ వివాదాన్ని మధ్యవర్తిత్వ పరిష్కారానికి(Arbitration) నివేదించే ఒప్పందంపై భారత్ పాకిస్తాన్ దేశాల రాయబారులు (వారిద్దరూ బావమరుదులు కూడా) సంతకాలు చేస్తున్న సమయంలో జనరల్ అయూబ్‌ఖాన్ ఆపరేషన్ జిబ్రాల్టర్ పథకం కింద కాశ్మీర్‌లోనికి చొరబాటుదారులను దింపే ప్రయత్నంలో వున్నాడు – కె సుబ్రమణ్యం నేషనల్ సెక్యూరిటీ అడ్వయిజరి బోర్డు 1

కేంద్రప్రభుత్వం కార్గిల్ యుద్ధంపై ఒక విచారణా సంఘాన్ని నియమించింది యుద్ధానికి దారితీసిన పరిస్థితులు సమీక్షించి భవిష్యత్తులో అలాంటి దుర్ఘటనలు జరగకుండా నివారించేందుకు సిఫారసులు చేయడం దాని బాధ్యత ఐతే కొత్త ఢిల్లీలోని అధికార గణంతో ఈ సంఘ సభ్యులకున్న సన్నిహిత సంబంధాలు ఈ ప్రయాసవల్ల అర్థవంతమైన ప్రయోజనం ఏదైనా సిద్ధించగలదనే నమ్మకాన్ని కలిగించలేకపోయాయి పైగా ఈ సంఘానికి న్యాయపరమైన అధికారం లేకపోవడం, దాని అధికారాలు బహుకొద్ది అని సూచిస్తోంది కార్గిల్ కమిటి ఏర్పాటు నిజనిర్ధారణ కోసం కాదని 'దాచిపెట్టేది ఏదీ లేదు సుమా అని భారతీయ జనతాపార్టీ ప్రచారం చేసుకునేందుకేనని సంశయాత్ములు భావిస్తే వారిని క్షమించవలసిందే

పరిశీలకుల్లో చాలామంది కార్గిల్ కమిటీ ఎర్పాటును ఎందుకు పరిహాసం చేశారో అర్థం చేసుకోవడం కష్టమేమీ కాదు కార్గిల్ కమిటీలోని ముగ్గురు సభ్యులలో ఇద్దరు–పాత్రికేయులు బి జి వర్ఘీస్ రక్షణ విషయాల విశ్లేషకుడు కె సుబ్రమణ్యం–జాతీయ భద్రతా మండలి సలహా సంఘ (ఎన్ ఎస్ సి ఎ బి) సభ్యులు అంటే ఎ సంక్షోభ యాజమాన్యం గురించి రక్షణ వ్యవస్థకు సలహాలనిచ్చేందుకు ప్రభుత్వం నామినేట్ చేసిందో ఆ ఎన్ ఎస్ సి ఎ బి సభ్యులే తిరిగి అదే సంక్షోభంపై సమీక్ష జరపబోతున్నారు ఈ కమిటీ సభ్యుడు, కార్యదర్శి సతీష్‌చంద్ర ఇంటిలిజెన్సు నివేదికలను పరిశీలించి వ్యూహాత్మక సిద్ధాంతాలని సమన్వయం చేసే బాధ్యతగల జాతీయ భద్రతా మండలి మంత్రాలయానికి అధిపతి! కార్గిల్ యుద్ధం విషయంలో తేలవలసి వున్న కీలక అంశాలలో ఇంటిలిజెన్సు నివేదికలను బేరీజువేసి తదనుగుణంగా వ్యవహరించడంలో ప్రభుత్వ వైఫల్యం ఒకటి కావడం అంటే చంద్ర తన పనితీరుపై తానే తీర్పు ఇవ్వబోతున్నారు! 1986లో రిటైరైన లెఫ్టినెంట్ జనరల్ కె కె హజారీ

ఒక్కరే ఎ పదవిలోనులేరు 2

కార్గిల్ కమిటీలోని సభ్యుల నీతి నిజాయితీల పట్ల ఎవరికీ శంకలేదు ఐతే కమిటీ ఏర్పాటైన తీరు మాత్రం నిష్పాక్షిక విచారణ జరగడానికి అవసరమైన కనీస ప్రమాణాలు పాటించే విషయంలో పూర్తిగా విఫలమైంది చట్టబద్ధత (legalstatus) లేని కారణంగా కార్గిల్ కమిటీకి ఇంటిలిజెన్సు నివేదికలను కోరే హక్కుగాని ఈ వివాదంతో సంబంధం కలవారిని తన ఎదుటికి పిలిచి ఇబ్బంది కలిగించే ప్రశ్నలకు సమాధానం రాబట్టే హక్కుగాని లేవు వాస్తవంగా కమిటీ ముందు హాజరయ్యేందుకు నిర్ణయించుకున్న సాక్షులపై నిజమే చెప్పాలనే నిర్బంధం కూడా లేదు కమిటీ సభ్యుల వక్తిగత ప్రతిష్టల వల్ల వారిని అధికారంతో అడ్డుకోవటము కష్టమని కొందరు పరిశీలకులు భావిస్తున్నారు ఐనా మొత్తం విచారణ ప్రక్రియ నిజాయితీగా సాగుతుందనేందుకు ఇది హామీ కాబోదు

కార్గిల్ కమిటీని ఏర్పాటు చేయాలని ప్రభుత్వం తలపెట్టినట్లు సమాచార ప్రసార శాఖమంత్రి ప్రమోద్‌మహాజన్ 1994 జూలై4న వెల్లడించారు లడఖ్‌లోని కార్గిల్ జిల్లాలోను జమ్మూకాశ్మీర్‌లోను పాకిస్తాన్ దురాక్రమణకు దారితీసిన సంఘటనలను ఈ కమిటీ సమీక్షిస్తుందని ఆయన చెప్పారు ఆ సమీక్ష ఆధారంగా కమిటీ జాతీయ భద్రతను కాపాడేందుకు అవసరమైన చర్యలను సిఫారసు చేస్తుంది ఈ కమిటీ యుద్ధానికి దారి తీసిన పరిస్థితులను కూడా పరిశోధిస్తుందా అని అడిగినపుడు మహాజన్ దాని కేమితోస్తే అది చేయవచ్చు ఆ స్వేచ్ఛదానికుంది అని సూచించారు కార్గిల్ యుద్ధానికి గల చరిత్ర సుదీర్ఘమైనది కావచ్చు కాకపోవచ్చు అందుచేత కమిటీ కేవలం గత మూడునెలలలో ఎం జరిగిందనేదే కాక గత రెండేళ్లు లేక రెండు దశాబ్దాలుగా ఎం జరుగుతున్నదో పరిశీలించవచ్చు నని ఆయన చెప్పారు అంతేకాదు 'అందుకు (యుద్ధానికి) దారితీసిన పరిస్థితులు అనడంలో అవి గూఢచర్యం, పరిపాలన రాజకీయ సంబంధమైన వైఫల్యాలేవైనా కావచ్చు కమిటీని మేము ఎ ఒకటి రెండు అంశాలకు కట్టిపడెయ్యడం లేదు' 3అని కూడా అన్నారు

## కార్గిల్ కమిటీ నియామకం

అసలు కార్గిల్ కమిటీని ఎందుకు ఏర్పాటు చేయవలసి వచ్చినదీ మహాజన్ వివరించారు భవిష్యత్తులో భద్రతా విధానం గురించి ఆందోళన కార్గిల్ కమిటీ ఏర్పాటుకు పురికొల్పిందని ప్రకటించినా ప్రభుత్వ ప్రాధాన్యతలలో దానిది రెండవ స్థానమే మహాజన్ దాడి ప్రధానంగా యుద్ధం గురించి చర్చించేందుకు రాజ్యసభను సమావేశపరచాలని ప్రతిపక్షం చేసిన డిమాండు పైనే! కమిటీ ఎర్పాటు ద్వారా ప్రభుత్వం

పారదర్శకతకు కట్టుబడి వున్నట్లు స్పష్టమవుతోందని ఆయన పేర్కొన్నారు

ప్రభుత్వం దాచిపెట్టవలసింది ఏమీ లేదని జాతీయభద్రత అన్నింటికన్న ముఖ్యమైనదని యుద్ధం ముగియగానే దానిపై విచారణకు ప్రభుత్వం సిద్ధంగా వుందని ప్రధానమంత్రి హోం రక్షణ విదేశాంగశాఖల మంత్రులు గతంలో ఎన్నో మార్లు పదేపదే చెప్తూ వచ్చారు 'ప్రముఖ వ్యక్తులతో కూడిన కమిటీ మన జాతీయ భద్రతను బలోపేతం చేయడానికి తోడ్పడే నివేదికను అందిస్తుందనే నమ్మకం మాకుంది' 4

మహాజన్ ఉద్దేశ్యమేమిటో స్పష్టంగా తెలుస్తూనే వుంది కమిటీ పరిశీలనకు నివేదించిన అంశాల పరిధి ఎంత అస్పష్టంగా వుండాలో అంత అస్పష్టంగా వుంది యుద్ధానికి పూర్వం ఎన్ని నెలలు ఏళ్ళ వరకైనా పరిస్థితులను సమీక్షించే స్వేచ్ఛ కమిటీకి వుందని చెప్పడం కార్గిల్ వైఫల్యంలో ప్రత్యేకంగా బి జె పి జవాబుదారీతనాన్ని తక్కువ చేసి చూపే ప్రయత్నమే కార్గిల్ కమిటీని ఏర్పాటు చెయ్యడం వెనుకనున్న అసలు ఉద్దేశ్యం నిజాలను వెలికితియ్యడం కాదని, బి జె. పి రాజకీయ ప్రతికక్షులపై బురదచల్లడం కోసమేనని స్పష్టమవుతోంది

కార్గిల్ కమిటీ ఏర్పాటు గురించి మహాజన్ ప్రకటించిన రోజునే చెన్నైలో పార్టీ కార్యకర్తలనుద్దేశించి ప్రసంగిస్తున్న హోంమంత్రి అద్వాని కార్గిల్ యుద్ధ విజయాలపై ప్రధాని వాజ్‌పేయిని నిలదియ్యాలని కాంగ్రెస్(ఐ) నిర్ణయించుకోవడం పట్ల ఆశ్చర్యం వ్యక్తం చేసారు

వారికి సలహాలిచ్చే వారెవరూ లేరా అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను ఆత్మహత్యా సదృశ్యమైన వైఖరి వుంటే తప్ప ఎవరూ అటువంటి అంశాన్ని ఎన్నికలలో ప్రచారాంశంగా ఎన్నుకోరు పాకిస్తాన్ తప్ప ప్రపంచంలోని ప్రతి ఒక్క దేశమూ వాజ్‌పేయిని ఆయన ప్రభుత్వాన్ని అభినందిస్తోంది కాంగ్రెస్ తప్ప దేశంలోని ప్రతి పార్టీ వాజ్‌పేయిని ప్రశంసిస్తోంది! పాకిస్తాన్ సైన్యం ముష్కర సైన్యమని ప్రపంచమంతా గుర్తిస్తోంది ఎన్నికైన ప్రజాప్రతినిధులదే తుది నిర్ణయంగా వుండే భారతదేశంలో మాదిరిగా అక్కడ ప్రజాస్వామ్యం లేదు దేనికది తనకు తోచినట్లు ప్రవర్తించే స్వయం ప్రతిపత్తిగల కేంద్రాలు పాకిస్తాన్‌లో వున్నాయి 5

కార్గిల్ దురాక్రమణలో పాకిస్తాన్ ప్రధానమంత్రి షరీఫ్ ప్రమేయం లేదని తాను చేసిన వివాదాస్పద ప్రకటనకు ఆలస్యంగానైనా అద్వాని వంత పాడినందుకు రక్షణ మంత్రి ఫెర్నాండెజ్ ఎంతో సంతోషించి వుంటారు కార్గిల్ సెక్టారులో దాడికి పాకిస్తాన్ రూపొందించిన పథకానికి సంబంధించిన సమాచారం తన మంత్రిత్వ శాఖకు చేరడం పైనా, ఆ సమాచారం పట్ల మంత్రిత్వ శాఖ స్పందించిన తీరుపైనా పరిశోధనకు ఎ మాత్రం ఆస్కారం లేకుండా అడ్డుపడడానికి ఫెర్నాండెజ్‌కు తగిన కారణాలున్నాయి ఇంటెలిజెన్సు వైఫల్యం వుందా లేదా అనే అంశాన్ని కార్గిల్ కమిటీ సమీక్షించదు అని

ఫెర్నాండెజ్ జూలై 25న తేల్చి చెప్పారు మరో రెండు రోజులకే తానావిధంగా ఎన్నడూ చెప్పలేదని ఖండించారు

## ముందే నిర్ణయాని కొచ్చిన కమిటీ

కార్గిల్ కమిటీ ముందే ఒక నిర్ణయానికొచ్చేసిందా? జూన్ 17న అంటే కమిటీ ఏర్పాటుకావడానికి ఒక నెలముందు సుబ్రమణ్యం బి జె పి నేతృత్వంలోని ప్రభుత్వం కార్గిల్ యుద్ధాన్ని నిర్వహించిన తీరును గట్టిగా వెనకేసుకొచ్చారు అంతేకాక కార్గిల్ పోరు నిర్వహణలో బి జె పి వల్ల అంతకుముందు కాంగ్రెస్-ఐ హయాంలోనూ జరిగిన అవకతవకలకు మధ్య పోలికలు తెస్తూ తన వాదనను గట్టిగా సమర్థించుకోచూశారు

ఇచ్చకాలతో ఇందిరాగాంధిని మభ్యపెట్టి జుల్ఫికర్ అలి భుట్టో సిమ్లా ఒప్పందాన్ని సాధించారు నియంత్రణ రేఖ మార్పిడికి కృషి చేస్తానని మాట ఇచ్చి వెన్నుపోటు పొడిచారు జనరల్ జియా-ఉల్ -హక్ నిర్యుద్ధ సంధి గురించి చెబుతూ ఒక వంక ఖలిస్తాన్ తీవ్రవాదులకు తోడ్పాటునందిస్తూ మరోవంక అణ్వస్త్రాలు సమకూర్చుకునే ప్రయత్నాలు సాగించారు తమ ఇంటర్ సర్వీసెస్ ఇంటెలిజెన్సు బృందాలు కాశ్మీర్‌లో తిరుగుబాటును రెచ్చగొడుతున్న సమయంలో బెనజీర్ భుట్టో భారత్-పాక్ విభజనానంతర తరాలకు చెందిన వారి మధ్య మరింత అవగాహన వుండాల్సిన అవసరం గురించి రాజీవ్ గాంధీతో మాట్లాడారు ఇక ఆమె సైన్యం 1990లో అణ్వస్త్రాలతో బ్లాక్‌మెయిల్ చేసే అవకాశాలను పరిశీలించింది [7]

ఈనేపథ్యంలో ప్రస్తుత ప్రభుత్వ తప్పిదాలు ముందున్న ప్రభుత్వాల తప్పిదాలకన్నా పెద్దవేంకావు అంటే చిన్నవేనని తాత్పర్యం నాలుగు రోజుల తరువాత సుబ్రమణ్యం మరింత బాహాటంగా ప్రభుత్వానికి మద్దతు పలికారు దాడిని ప్రారంభించడంలో పాకిస్తాన్ ఉద్దేశ్యం స్పష్టంగా తెలుస్తూనే వుంది పాకిస్తాన్ ఎత్తుగడలకు అనుగుణంగా కాశ్మీర్ విషయాన్ని అంతర్జాతీయం చేయడానికి ఉద్దేశించినదే ఆ దాడి రాబోయే ఎన్నికలతో సతమతమవుతూ భారతదేశనాయకత్వం దుర్బలంగా అస్థిమితంగా వుంటుందని పాకిస్తాన్ భావించిన సమయంలో దాడి జరిగిందని ఆయన వాదించారు ఐతే ప్రభుత్వం తన పని తాను చేసినందువల్లనే ఆ వ్యూహం బెడిసికొట్టిందని కూడా ఆయన సెలవిచ్చారు

ఈ పథకం విఫలమయిందని ఇపుడు పాకిస్తాన్ గుర్తించింది భారతదేశ స్పందన గట్టిగానే వున్నా నిగ్రహంతో సాగింది విమాన దాడులకు దిగినా కాల్బలాన్ని ఎదుర్కొనేటపుడు తప్ప భూమి మీద ఆకాశంలోను దాడులు భారతీయ భూభాగానికే పరిమితమయ్యాయి నియంత్రణ రేఖ మీదుగా పాకిస్తానే ఖచ్చితంగా దురాక్రమణకు దిగిందని ప్రముఖ దేశాలు గుర్తించడం పాకిస్తాన్‌ని తీవ్ర

నిరుత్సాహానికి గురి చేసింది

కార్గిల్ యుద్ధ నిర్వహణపై ప్రభుత్వ సమర్థన, చెన్నైలో అద్వాని ఉపన్యాసాలకు మధ్య పోలికల విషయంలో పొరబాటుకు ఆస్కారంలేదు ఇతర అంశాలలో కూడా సుబ్రమణ్యం ఆలోచనలు కేంద్ర ప్రభుత్వ ఆలోచనలను ప్రతిబింబించేవిగానే వున్నాయి ప్రచ్ఛన్న యుద్ధ సమయంలో రూపుదిద్దుకున్న అమెరికా–పాకిస్తాన్ అమెరికా–చైనా, పాక్–చైనా సంబంధాలు అచంచలమైనవనే ధృడాభిప్రాయాన్ని ఆయన సవాలు చేసారు ప్రచ్ఛన్న యుద్ధకాలంలోను ఇరాన్‌తో తీవ్రస్థాయి విభేదాల కాలంలోను వున్నట్లుగా ఇప్పుడు పాకిస్తాన్ వల్ల అమెరికాకు ఒనగూడే ప్రయోజనం ఏదీ లేదు 9 పోరును విస్తరించడానికి పాకిస్తాన్ ఎన్నిరకాలుగా ప్రయత్నించినా వాటిని ఎదుర్కోవడానికి భారతసాయుధ దళాలు తగిన నైపుణ్యత వృత్తిపరమైన సామర్థ్యంతో సంసిద్ధంగా వుంటాయని సుబ్రమణ్యం జూన్ 29న నొక్కి చెప్పారు 10

నేను ముందే చెప్పినట్లు ఈ అభిప్రాయాలన్నీ కమిటీ ఎర్పాటుకావడానికి ఒక నెల ముందే వెలిబుచ్చినవి ఇక్కడ సుబ్రమణ్యం అభిప్రాయాలు తప్పా ఒప్పా అన్నది కాదు ప్రశ్న తన సహచరుల మాదిరిగా ఆయన కూడా కార్గిల్ యుద్ధానికి దారితీసిన పరిస్థితులపై నిష్పాక్షికంగా తీర్పునివ్వగలరా అనేదే ప్రశ్న ఒకవేళ కార్గిల్ కమిటీ వ్యవహారం అంతర్గత సమీక్షకు సంబంధించిన అంశమయివుంటే అందులోని సభ్యులు, వారి సిద్ధాంతాల గురించి సమస్య ఉత్పన్నంకాదు కాని దీనిని పార్లమెంటులో పారదర్శకమైన చర్చకు ప్రత్యామ్నాయంగాను బహిరంగ వ్యవహారంగాను భారత ప్రజలను నమ్మింపజూశారు మేనెలలో ఫోక్రాన్–2 అణుపరీక్షలతో ప్రారంభమై సంఘటనలపైగాని, కాశ్మీర్‌లో అంతర్జాతీయ జోక్యం సాధించేందుకు పాకిస్తాన్‌కు లభించిన అవకాశం గురించి గాని నిర్మొహమాటంగా విశ్వసనీయతతో చర్చజరిగే అవకాశం ఏమాత్రమూలేదు

## చొచ్చుకుపోయిన బి జె.పి !

తాను చర్చించబోయే అంశాలపట్ల కార్గిల్ కమిటీ అత్యున్నత నిష్పాక్షికతను కలిగి ఉండాలి రక్షణ వ్యవస్థ ప్రయోజనాలకు వ్యతిరేకమనిపించే గొంతులను కమిటీ పట్టించుకుంటుందా? కార్గిల్లో తన స్థానాలను భద్రంగా అంటిపెట్టుకుని వున్నట్లు గస్తీలు నిర్వహించినట్లు సైన్యం చెప్పుకుంటోంది కాని ఆ విషయాన్ని నిర్ధారించగల నిపుణులెవరు? భారత అణ్వస్త్రీకరణకు కట్టుబడిన వారుగా అందరికి తెలిసిన కమిటీ సభ్యులు ఫోక్రాన్–2 సృష్టించిన సమస్యలకు పరిష్కారం చూపగలరా? బి జె పి అండదండలతో కల్లోలిత ప్రాంతాలలో పౌరపాలనావ్యవస్థ ను చేజిక్కించుకో చూస్తున్న సైన్యాన్ని కమిటీ విమర్శించగలదా? అన్నిటిని మించి బి జె పి సైనికాధికారులలో

కొందరిని రాజకీయాల ముగ్గులోకి దింపడం వంటి విస్తృత అంశాలన్నీ చర్చించగలదా?

ఇంతకన్న లోతుగా చర్చజరిగిందని స్పష్టంగా తెలుస్తూనే వుంది తమ వారికి రక్షణ కల్పించాలని ఆర్ ఎస్ ఎస్ భావిస్తుండడమే దానికి కారణం హిందూత్వ అధికారం వస్తుందని వారు ముందుగానే ఊహించి సైన్యంలోని ఉన్నత స్థాయిల్లోకి పధకం ప్రకారం చొచ్చుకుపోయారు సైనికాధికారులలో ఎక్కువ మంది రాజకీయాలకు దూరంగా వున్నప్పటికీ బి జె పి మాత్రం కొందరు సీనియర్ సైనికాధికారులని తనపక్షానికి తిప్పుకోవడం ద్వారా ఈ సంప్రదాయానికి గండికొట్టేందుకు ఒక పధకం ప్రకారం వ్యవహరించింది మేనెల ఆరోతేదీన కార్గిల్ పోరుగురించి బి జె పి జాతీయ కార్యనిర్వహణ బృందానికి వివరించాలని డైరెక్టర్ జనరల్ ఆఫ్ మిలటరీ ఆపరేషన్స్ ఎం సి విజ్ ఎయిర్‌వైస్ మార్షల్ ఎస్ కె మాలిక్‌లు నిర్ణయించుకోవడం ఈ ప్రక్రియకు ఒక ఉదాహరణ ఇటువంటివి ఎన్నో వున్నాయి 3వ ఇన్‌ఫాంట్రి డివిజన్ కమాండర్ లెఫ్టినెంట్ జనరల్ బుధ్‌వార్ 1998లో లెహ్‌లో ఆర్ ఎస్ ఎస్ నిర్వహించిన సింధు దర్శన్ ఉత్సవాలకి అవసరమైన సరఫరాలు సహాయం అందచేశారు 11 ఈ వేడుకలకు హాజరయిన వారిలో అద్వాని ఆర్ ఎస్ ఎస్ సిద్ధాంతవేత్త తరుణ్ విజయ్‌లు ఉన్నారు తాను అలా ఒక రాజకీయ సంస్థతో చేతులు కలపడం తగునా అని ఒక పాత్రికేయుడు అడిగినపుడు బుధ్‌వార్ తనకా ప్రశ్న అర్ధమేకావడం లేదన్నారు 12

కాషాయం పట్ల మోజు ఒక్క జనరల్ బుధ్‌వార్‌కే పరిమితం కాదు భారత సైన్యంలో రాజకీయాలకు అతీతంగా వ్యహరించే వారసత్వాన్ని భగ్నం చేసే ప్రయత్నాలిలాగే కొనసాగితే ఫలితం చాలా దారుణంగా వుంటుంది పాకిస్తాన్‌లో ఎం జరిగిందో గమనించండి అక్కడ జియా ఉల్‌హక్ స్వీయ పర్యవేక్షణలో అతిఛాందసవాద జమాతే ఇస్లామికి అంకితమైపోయిన వారిని చేర్చుకోవడం ద్వారా సైన్యంలోని ఆఫీసర్లందరిని మార్చే ప్రక్రియ పకడ్బందీగా సాగింది పాకిస్తాన్ సైన్యం ఇస్లాం ఛాందసవాదుల మతయుద్ధా(జిహాద్)నికి ఒక ఆచ్చాదనగా వుండే స్థాయి-దిగజారిపోయిందని వాదించవచ్చు అద్వాని పాకిస్తాన్ సైన్యాన్ని (Rogue) సైన్యంగా అభివర్ణించారు భారత సైన్యం హిందుత్వ విభాగం ఎంత మాత్రం కాదు అలాగని సంతృప్తిపడి వూరుకుంటే లాభంలేదు ఇన్నాళ్లుగా భారతసైన్యం తన సంప్రదాయాలని నిలబెట్టుకుందంటే దానర్ధం మతఛాందసవాదుల ప్రయత్నంలోపం వల్ల కాదు 1998 మేలో ఆర్ ఎస్ ఎస్ ఆధ్వర్యంలో జరిగిన వీర్ సావర్కార్ పురస్కారాల సభకు మాలిక్ అధ్యక్షత వహించారని అంతకుముందు ఒకసారి సైన్యంలో శిక్షణ పూర్తయ్యాక జరిపే పతకాల ప్రదానానికి శివసేన అధినేత బాల్‌ధాకరేను ఆహ్వానించారని, అడ్మిరల్ విష్ణుభగత్ ఆరోపించినప్పటి నుండి బి జె పి ప్రభుత్వం సైన్యంలోకి రాజకీయాలు చొప్పిస్తోందనే

విమర్శ వినపడుతోంది ఈ సంఘటనలపై మాలిక్ ఇచ్చిన వివరణలు నిష్పాక్షిక పరిశీలకులను సంతృప్తిపరచలేకపోయాయి ఒక వ్యాఖ్యాత ఏమన్నారో చూడండి

ఎవరి జోక్యం సహించేది లేదనే విస్పష్టమైన ఉన్నత సైనికాధికారుల వైఖరి మాత్రమే రాజకీయాలకు దూరంగా వున్న సైన్యంలో స్వప్రయోజనాలకోసం ఎవరూ చిచ్చురేపకుండా నివారించగలుగుతుంది అంతేకాక రక్షాబంధనం రోజున పద్మంచిహ్నం వున్న రాఖీలను సైనికులకు కట్టే దృశ్యం పునరావృతంకాకుండా ఉంటుంది 13

## అసమర్థత అవినీతి

సైన్యంలోని ఉన్నతస్థానాలలో అసమర్థతకు సంబంధించిన ఆరోపణలు కూడా వున్నాయి సైనికాధికారులు వారి స్థాయికి తగిన సామర్థ్యంతో వ్యవహరించలేదనేందుకు సాక్ష్యాధారాలు వేగంగా వెలుగుచూస్తున్నాయి సైనికోద్యోగుల అధిపతి కార్యాలయానికి చేరుతున్నాయి రక్షణ రంగానికి చెందిన పాత్రికేయులు రాహుల్‌బేడి ఇలా పేర్కొన్నారు

ఆపరేషన్ విజయ్‌కి సారథ్యం వహిస్తున్న ఉత్తర ప్రాంత ఆర్మీకమాండర్ లెఫ్టినెంట్ జనరల్ హెచ్ ఎం ఖన్నా బాధ్యతలను ఆర్మీఛీఫ్ వి పి మాలిక్ హస్తగతం చేసుకోవడాన్ని కూడా సైనికాధికారులు ప్రశ్నిస్తున్నారు జనరల్ మాలిక్ మే నెల మధ్యకాలంలో దురాక్రమణ గురించి పూర్తిగా తెలిసివున్నప్పటికీ వారం రోజుల పోలండ్ దేశ పర్యటనను వాయిదా వేసుకోకపోగా వార్సానుంచి స్వదేశానికి తిరిగి వస్తూనే ఆపరేషన్ విజయ్ నిర్వహణ బాధ్యతలను తన చేతిలోకి తీసుకున్నారు గద్దెపై వున్న రాజకీయ నాయకుల ప్రాపకం సంపాదించాలన్న ఆందోళనతో ఆయన ప్రధాని రక్షణ మంత్రుల వెంట శ్రీనగర్ కార్గిల్ ప్రాంతాలను కనీసం ఐదుమార్లు సందర్శించారు 14

భారత రక్షణ వ్యవస్థ అగ్రభాగాన 'సైనికోద్యోగుల అధిపతి' అనే కొత్త పదవిలో తనను నియామకం కొరకు మాలిక్ చేసిన ప్రయత్నాలను కూడా బేడి వివరించారు కొత్తగానియమించే ఛీఫ్ ఆఫ్ డిఫెన్సు సైనిక రాజకీయ వ్యవస్థల మధ్య అనుసంధానకర్తగా వ్యవహరించేందుకు వీలు కల్పిస్తూ రక్షణ మంత్రిత్వశాఖను పునర్వ్యవస్థీకరించాలని గత సంవత్సరమే నిర్ణయించారు అప్పటి నుంచే ఆ పదవి కోసం మాలిక్ తనపైరవీని ప్రారంభించారు కార్గిల్‌పై నిష్పాక్షిక విచారణలో ఏళ్ళుగా మాలిక్‌కున్న పదోన్నతావకాశాలను అకస్మాత్తుగా తుంచివేసే ప్రమాదముంది కాబట్టి, అటు బి జె పితోను ఇటు ఫెర్నాండెజ్‌తోను గలిగిన మాలిక్ అసలు సాన్నిహిత్యం ఆ రకమైన విచారణను సహిస్తారా అనేది అనుమానమే 15

కార్గిల్ యుద్ధం రేకిత్తించిన కొన్ని సందేహాలు పరిష్కరించడానికి అసాధ్యమైనిగా గోచరించడమేగాక మొత్తంమీద భారత రక్షణ సన్నద్ధతకే వర్తించేవిగా వున్నాయి కార్గిల్ యుద్ధ సమయంలో బేటిల్‌ఫీల్డ్ సర్వైవలెన్స్ (యుద్ధక్షేత్రాన్ని పర్యవేక్షించే) రాడారు

లేకపోవడం సాంకేతిక సాధనాల పరంగా ముఖ్యమైన లోటుగా సైన్యం చెప్పుకున్న విచిత్ర గాథను కూడా బేడి ప్రస్తావిస్తారు నిజానికి 1993లో అటువంటి ఉపకరణాలను కొనుగోలు చేసేందుకు నిరాకరించినది సైన్యమే! ఫ్రాన్సుకు చెందిన థామ్సన్ - సి ఎస్ ఎఫ్ జర్మనీకి చెందిన అల్కాటెల్ ఎస్ ఇ.ఎల్, బి ఎస్ ఆర్‌ల అమ్మకానికి కొటేషన్లు ఇవ్వగా యుద్ధరంగంలో వాటి పనితీరు పట్ల సైన్యం సంతృప్తి వ్యక్తం చేసింది ఖరీదునుబట్టి ఎవరి నుంచి కొనాలో నిర్ణయించవలసి వుంది ఫ్రెంచి సంస్థకన్నా అల్కాటెల్-సెల్ పరికరం 40 శాతం చవకని తేలిన దశలో అనూహ్యంగా సైన్యం ఆ ప్రతిపాదన విరమించుకుంది ఆ నిర్ణయాన్ని సమర్థించుకునేందుకు తమ ప్రాధాన్యతలు మారాయని మాత్రమే చెప్పింది 16 బేడి బయట పెట్టిన అంశాలపై అధికారులు ఆగ్రహం వ్యక్తం చేసినా ఏ ఒక్క అంశాన్ని ప్రత్యేకించి ఖండించలేదు

కార్గిల్ యుద్ధసమయంలో తమ వద్ద లేవని సైన్యం ఫిర్యాదు చేసిన డైరెక్షన్ ఫైండింగ్ (డి ఎఫ్) సాధనాల విషయంలోను ఇలాగే జరిగింది శత్రుసైన్యం తమలో తాము ఇచ్చిపుచ్చుకునే రేడియో సమాచారాలు భౌగోళికంగా ఎక్కడ నుంచి ప్రసారమవుతున్నాయో కనుగొనడానికి ఈ సాధనం ఉపకరిస్తుంది 1997 జూన్‌లో జపానుకు చెందిన తాయో - మ్యూసిన్ (taiyo musein) అనే సంస్థ ప్రతినిధులు షరీఫాబాదు వచ్చి 8 మౌంటెన్ డివిజన్‌లో ఈ డి ఎఫ్ వ్యవస్థను ప్రదర్శించి చూపారు ఈ వ్యవస్థలో ముందే గుర్తించిన కొన్ని స్టేషన్ల (ట్రాన్స్మిటర్ల) ఉనికి ఆధారంగా చేతిలో ఇమిడిపోయే డి ఎఫ్ సెట్ కొత్త ప్రసారాలను ఖచ్చితంగా గుర్తించి పట్టుకుంటుంది అయితే 8 మౌంటెన్ డివిజన్ అధికారులు పర్వతాలనుంచి పరావర్తనం చెందే సిగ్నల్స్ వల్ల ట్రాన్స్‌మిటర్ల ఉనికి గుర్తించడంలో పొరపాటుపడే అవకాశం వుంది గనుక ఆ పరికరం తమకు ఉపయోగపడదని చెప్పారు కొంత అభ్యాసంతో అసలైన సంకేతాలేవో పరావర్తనం చెందినవి ఏవో సైనికులు గుర్తించగలుగుతారని తాయో సంస్థ ప్రతినిధులు నచ్చచెప్పబోయారు అందులో వాస్తవాలెలా వున్నా ఆ పరికరానికి ఆమోదం లభించలేదు కాని కార్గిల్‌పోరు మొదలయ్యాక జూన్‌లో తిరిగి ఆ పరికరాలనే కొన్నారు ఈ వ్యవహారంలో తలెత్తే ప్రశ్నలకు సమాధానాలు లేవు 17

**ఇతర చోట్ల విచారణ**

కార్గిల్ యుద్ధంపై నిజాయితీగా విచారణ జరగాలంటే పలు అంశాలపై పరిశోధన జరిపేందుకు విస్తృతాధికారాలు అవసరమని నిష్పాక్షికంగా వ్యవహరించగల వ్యక్తులే అందుకు పూనుకోవాలని ఇప్పుడు స్పష్టంగా వెల్లడవుతోంది ఇలాంటి సందర్భాలు ఎదురయినపుడు ఇతర దేశాలు మనకన్నా మెరుగ్గా వ్యవహరించాయి ఇటీవల ప్రకటించిన ఒక అధ్యయన పత్రంలో విద్యావేత్త ఎ జి నూరాని కార్గిల్ యుద్ధంపై

సరైన విచారణ ఏవిధంగా జరగాలనేది ఎంతో సరళంగా చెప్పారు 18 ఫాక్‌లాండ్స్ యుద్ధంపై ప్రీవీ కౌన్సిలర్ల ఫ్రాంక్స్ కమిటీ ప్రకటించిన నివేదికను ఆయన ఉదహరించారు ప్రతిపక్షాలను సంప్రదించిన అనంతరం అప్పటి బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్ అవసరమైతే క్రితం సంవత్సరాలలో జరిగిన సంఘటనలను కూడా పరిగణనలోకి తీసుకుంటూ 1982 ఏప్రిల్ రెండున ఫాక్‌లాండ్స్ దీవులపై అర్జెంటీనా దురాక్రమణకు పాల్పడే వరకు ఫాక్‌లాండ్స్ దీవులలోను సంబంధిత ప్రాంతాలలోను ప్రభుత్వం తన బాధ్యతలను నెరవేర్చిన తీరును సమీక్షించేందుకు ఒక కమిటీని ఏర్పాటు చేసినట్లు ప్రకటించారు

కార్గిల్ కమిటీ వలె కాక ఫ్రాంక్స్ కమిటీకి చట్టపరమైన (Legal powers) అధికారాలు వున్నాయి 1982లో మొదటి మూడు నెలలకు సంబంధించిన ఫైళ్లతో సహా విదేశీ వ్యవహారాలు రక్షణ మంత్రిత్వ శాఖలకు చెందిన అన్ని పత్రాలే కాక, 1982 ప్రారంభం నుంచి ఫాక్‌లాండ్స్ దీవులకు సంబంధించిన అన్ని ఇంటెలిజెన్స్ నివేదికలను పొందడం ఆ కమిటీ హక్కుగా భావించి దానికి అందజేశారు 1965 నుంచి తాను జరిపిన సమావేశాల మినిట్సుతో సహా జాయింట్ ఇంటెలిజెన్సు ఆర్గనైజేషన్ అర్జెంటీనా ఫాక్‌లాండ్స్ దీవుల విషయంలో నిర్ధారణకు వచ్చిన అంశాలను కూడా వారికి అందచేశారు అంతేకాక ప్రస్తుత ప్రభుత్వం అధికారంలోనికి వచ్చినది మొదలు ప్రధాని స్వయంగా పరిశీలించిన పత్రాల్లో తమకు అవసరమైన వాటిని 1965 నుంచి జరిగిన మంత్రివర్గ, మంత్రివర్గ కమిటీల సమావేశాల పత్రాలు, మినిట్సులను కూడా ఫ్రాంక్స్ కమిటీ అధ్యయనం చేసింది ప్రజల నుంచి మెమొరాండాలు ఆహ్వానించింది మీడియా నివేదికలు పరిగణనలోకి తీసుకుంది 1965 నుంచి పదవిలోనున్న ప్రధానులందరిని ప్రశ్నించింది ఫ్రాంక్స్ కమిటీ సమావేశాలు గోప్యంగా జరిగినా 1983లో ప్రకటితమైన కమిటి నివేదిక బ్రిటిష్ ఇంటెలిజెన్సు వ్యవస్థ పునర్ వ్యవస్థీకరణకు, విదేశాంగ కార్యదర్శి లార్డ్ కారింగ్టన్ రాజీనామాకు దారి తీసింది

'అగ్రనాత్ నివేదిక లో ఇంతకన్న బాగా పనికి వచ్చే నమూనా మనకి లభిస్తుందని నూరాని తెలిపారు ఈజిప్టు కాల్పుల విరమణకు అంగీకరించి నెల తిరగకుండానే, 1973 నవంబరు 18న ఇజ్రాయిల్ మంత్రివర్గం ఆమోదించిన తీర్మానాన్ని అనుసరించి ఇజ్రాయిల్ సుప్రీంకోర్టు అధ్యక్షుడు డాక్టర్ సిమోన్ అగ్రనాత్ నేతృత్వంలో నలుగురు సభ్యులు గల సంఘం ఏర్పాటయింది ఆ తీర్మానంలో ఇలా పేర్కొన్నారు

ఎ) ప్రస్తుత ప్రజాహితం దృష్ట్యా కీలకమైన కింది అంశాలు

1) యోమ్ కిప్పూర్ యుద్ధానికి ముందు రోజుల్లో శత్రువు సన్నాహాలు ఎత్తుగడల

సమాచారం ఈ సమాచారానికి సంబంధించి అధీకృత పౌర సైనిక వ్యవస్థల అంచనాలు నిర్ణయాలు

2) యుద్ధం ప్రారంభంకాకముందు ఇజ్రాయిల్ సైన్యం సన్నద్ధత యుద్ధ సమయంలో మోహరింపు శత్రువును నిలవరించేందుకు తీసుకున్న చర్యల గురించి అవసరమైన వివరణ

బి) ఈ విషయాలను పరిశోధించి మంత్రి వర్గానికి నివేదించేందుకు ఒక సమీక్షా సంఘాన్ని ఏర్పాటు చేయాలని

ఈ కమిటీ పరిశీలనకు నివేదించిన అంశాలలో ఎక్కడా అస్పష్టత లేదు అగ్రనాత్ కమిటీ సమర్పించిన నివేదిక కూడా అంత సూటిగాను వాడిగానూ వుంది కమిటీ చర్చలు బహిరంగంగా సాగకపోయినా యుద్ధ సమయంలో తాము వ్యవహరించిన తీరుపై విచారణ జరుగుతున్న వ్యక్తులు సాక్షులను ప్రశ్నించేందుకు న్యాయవాదులను పెట్టుకునేందుకు అనుమతించారు ఈ కమిటీ అందుతున్న గూఢచర్య సమాచారం దానిని విశ్లేషించిన తీరుపై జరిపిన అధ్యయనం గురించి పాక్షిక నివేదికను ముందుగా వెలువరించింది అందుకు కారణాలు వివరిస్తూ 'సంఘం చర్చించిన విషయాలలో వెలుగు చూసిన అంశాలు, వాటిపై సంఘ సిఫార్సుల గురించి వీలైనంత త్వరగా తెలుసుకునే హక్కు ప్రజలకు వుంది అంతేగాక ఆ విషయాల్లో జాప్యం లేకుండా ప్రభుత్వం తగిన రీతిలో చర్యలు తీసుకోవడం కూడా అవసరం' అని పేర్కొన్నారు ఆ పాక్షిక నివేదికలోనే 'వాస్తవాలకు సంబంధించిన పూర్తి వివరాలు సంఘం నిర్ధారించిన అంశాలపై సమగ్ర సమాచారం రెండవ నివేదికలో వుంటాయి కాని రహస్యంగా వుంచాల్సిన మరెన్నో అంశాల వల్ల బహుశా దానిని సంపూర్ణంగా ప్రచురించడం సాధ్యం కాకపోవచ్చు' అని తెలిపారు

యోమ్‌కిప్పూర్ యుద్ధానికి ముందు సంభవించిన వైఫల్యాల గురించి అగ్రనాత్ నివేదిక ఎంతో సమగ్రంగా అందించిన వివరాలు పలువురి పదవులు ఉద్వాసనకు దారితీసాయి ఉదాహరణకు నివేదిక మిలటరీ ఇంటెలిజెన్సు డైరెక్టర్ జనరల్ నిజాయితీని మెచ్చుకుంటూనే తీవ్ర వైఫల్యాల కారణంగా మేజర్ జనరల్ జీరా తన పదవిలో కొనసాగడానికి అనర్హుడు అని పేర్కొంది ఇజ్రాలీ రక్షణ దళాల ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ లెఫ్టినెంట్ జనరల్ డేవిడ్ ఎలాజర్‌ను కూడా అభిశంసిస్తూ అతనిని కూడా పదవి నుంచి తొలగించాలని సిఫారసు చేసింది యుద్ధానికి ముందు ఉద్రిక్తత నెలకొనివున్న సమయంలో అక్కడ ఎం జరుగుతోందో తానే ప్రత్యక్షంగా చూసి తెలుసుకొనేందుకు గాని పరిశీలనల ద్వారా వెల్లడైన ప్రమాద సూచికల గురించి స్వయంగా అవగాహన ఏర్పరుచుకునేందుకుగాని స్థానిక కమాండర్‌తో సంప్రదించేందుకు లేదా వారి నుంచి

సమాచారం రాబట్టేందుకు కాని అతనెన్నడు యుద్ధరంగాన్ని సందర్శించనే లేదు శనివారం ఉదయం రిజర్వు దళాలన్నింటిని సమీకరించాలని ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ డిమాండ్ చేయడం మెచ్చుకో తగ్గదే కాని ప్రస్తుత పరిస్థితుల్లో అక్టోబరు 1 నాటికి లేదంటే కనీసం అక్టోబరు 2నాటికి పాక్షిక సమీకరణజరగాలని సిఫార్సు చేసి వుండాల్సింది వైమానిక దళంతో సహా రెగ్యులర్ సైన్యం అంతటిని సర్వ సన్నద్ధ స్థితిలో వుండమని హెచ్చరించడం ద్వారా ఆరోజున తాను చేయవలసిన దానికన్నా ఎక్కువే చేసానన్న అతని వాదనను మేము ఆమోదించడం లేదు ఈ విమర్శకు ఛీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్ మాలిక్, అతని సమీప కింది స్థాయి అధికారులపై వస్తున్న విమర్శలకు మధ్య పోలిక విషయంలో పొరపడేందుకు వీలులేదు అంతేకాక ప్రధాని వాజ్‌పేయి లాహోరు బస్ యాత్ర వల్ల కలిగిన దురదృష్టకర పరిణామాలు యుద్ధ నిర్వహణలో రక్షణ మంత్రి అవకతవకలతో సహా భారతదేశ సమున్నత రాజకీయ నాయకత్వం వైఫల్యాలన్నిటిపైన దర్యాప్తు జరగాల్సి వుంది కాని ఎన్నికలలో వేదికలపై బి జె పి కి దాని మిత్ర పక్షాలకు కార్గిల్ అంశమే ప్రధాన ప్రచారాస్త్రంగా రూపుదిద్దుకున్నందువల్ల, అధికారంలో నున్న వారి ధ్యేయం వాస్తవాలు ఎప్పటికి వెలుగుచూడకుండా చేయడమయింది

చివరికి అన్ని విధాల నష్టపోయేది భారతదేశ రక్షణ వ్యవస్థే

# కార్గిల్ వారసత్వం

భారతదేశ భీమసేనుడు ఈ ముష్కరుల గుండెలు చీల్చివారి కవోష్ణరుధిరధ రలతో మలినమైన ద్రౌపది కేశపాశాన్ని తిరిగి పవిత్రం చేయాల్సిన సమయం ఆసన్నమైంది పాకిస్తాన్ మామూలుగా చెబితే వినేరకం కాదు వారితో మన వైరం శతాబ్దాల నాటిది మహమ్మద్ బిన్ కాసిం కాలం నుంచి దుర్గాదేవిని సవాలు చేస్తున్న దుష్టశక్తి అది లేవండి అటల్ బిహారి! ఈ సుదీర్ఘ గాధకు చివరి రచయిత మీరే కావాలని విధిమీ నొసట లిఖించిందేమో! ఎవరికి తెలుసు మనం బాంబులు తయారు చేసినది దేనికి ? అణ్వస్త్ర ప్రత్యామ్నాయానికి మొగ్గు చూపింది ఎందుకోసం?

**ఆర్ ఎస్ ఎస్ బాకా పాంచజన్య జూన్ 20 1999**

ముంబై విమానాశ్రయం నుంచి నగరంలోకి వచ్చే రహదారిలో ఒకచోట విలాసవంతమైన కార్లు తయారు చేసే సంస్థ తాలూకు ప్రకటన బోర్డు ఒకటి కనిపిస్తుంది కార్గిల్ వల్ల ఉత్పన్నమైన దేశభక్తి భావన ఎన్ని వింత పోకడలు పోయిందో ఆ బోర్డు చూస్తే అర్థమవుతుంది ఆ బోర్డు పై నుంచి కిందకు కాషాయం తెలుపు ఆకుపచ్చ రంగులతో కార్గిల్ పర్వతాలు కప్పబడినట్లు వుంటుంది ఇంకా దిగువన ఒక కారు చిత్రం దాని దిగువన ఒక వ్యాఖ్య కనిపిస్తాయి స్వేచ్ఛ చౌకగా లభించేది కాదు

ఇటీవల కాలంలో హోటళ్ళు విశ్రాంతి నిలయాలు ప్రత్యేక విందులు ఎర్పాటు చేసి వాటి ద్వారా సమకూడే ఆదాయంలో కొంత శాతం గ్రామాల్లోని పేదలకు అంటే కార్గిల్ శిఖరాల్లో అమరులైె పాంచజన్య భీము'లుగా అభివర్ణింపబడిన వారికి అందజేస్తామని చెబుతున్నాయి ఆ విందులకు ఢిల్లీ ముంబై నగరాలలోని అగ్రవర్ణాల ధనికులను ఆహ్వానిస్తున్నాయి వీరంతా రామజన్మభూమి ఆందోళన కాలం నుంచి బి జె పి వెన్ను తడుతున్న వారే! చివరికి ఇంటర్‌నెట్ కనెక్షన్ తీసుకోవడం కూడా దేశభక్తి పూరితమైన చర్యగా పత్రికల్లో ప్రకటనలు వెలువడుతున్నాయి

ఇవీ కార్గిల్ యుద్ధం వారసత్వంగా మనకు అందిన వాటిలో కొన్ని మచ్చుతునకలు

కార్గిల్ యుద్ధం నుంచి భారత్ పాకిస్తాన్‌లు నేర్చుకోవలసిన పాఠాలు చాలా వున్నాయి జమ్ము కాశ్మీర్‌లో వ్యాకులం కలిగిస్తున్న పోరుతో సహా రెండు దేశాల అణ్వాయుధీకరణకు సంబంధించిన చరిత్ర అంతటా ఈ పాఠాలు లభిస్తాయి వరుసగా

సంభవిస్తున్న సంఘటనల ఫలితంగా హింసాత్మక జాతీయతావాదం రానున్నకాలం లో రెండు దేశాల రాజకీయ నీతిని శాసించనుంది

**పాకిస్తాన్ సైన్యం-ఇస్లాం పునరావిష్కరణ**

కార్గిల్ యుద్ధం పరిణామాలు పవిత్రయుద్ధ (జిహాద్ ) వాదులైన పాకిస్తాన్ సైన్యంలోని ఉన్నతాధికారులకొక చిత్రమైన సంకటం కల్పించాయి ఒకవైపు కార్గిల్ యుద్ధాన్ని నడిపిన ఘనత తమదేనని చెప్పుకొంటున్నా మరోవైపు తామటువంటి పని ఎన్నడూ చేయనేలేదని ఖండించవలసి వస్తోంది

కార్గిల్ యుద్ధం ముగిసాక అక్కడ సైన్యాన్ని వినియోగించనే లేదని ప్రభుత్వం ప్రకటించడం పట్ల పాకిస్తాన్ ఉత్తర ప్రాంతంలో ప్రజల నిరసన పెల్లుబికింది తమ ప్రాంతంలో లష్కరే తాయిబా ఉనికిని కూడా సహించలేక ఉత్తరప్రాంత నివాసులు తిరుగుబాటు చేసారు పాక్ ఆక్రమిత కాశ్మీర్‌లోని బాల్టిస్తాన్ ప్రాంతంలో ముజాహిదీన్‌లను తమ ప్రాంతం నుంచి పంపించి వేయాలని వందలాదిగా విద్యార్థులు డిమాండ్ చేశారు ప్రదర్శకులు ఆగస్టు 5న స్కర్దు పట్టణంలో బంద్ నిర్వహించారు వెంటనే శిబిరం ఎత్తివేయాలని కోరుతూ స్థానికులు ఒక లష్కరే తాయిబా శిబిరాన్ని చుట్టుముట్టారు 1 కార్గిల్ యుద్ధంలో చనిపోయిన పాక్‌సైనికుల్లో చాలా మంది రాజకీయ అధికారానికి నోచుకోక కటిక దారిద్ర్యంలో మగ్గుతున్న ఉత్తర ప్రాంతాలకు చెందిన వారే

జమ్మూ కాశ్మీర్‌లో యుద్ధం కొనసాగించడం ద్వారా తమ తమ ప్రయోజనాలని సాధించుకునే విషయంలో ఏకాభిప్రాయం వున్న పాక్ ప్రభుత్వంపైగాని సైన్యాలపై ప్రజల నిరసనగాని ఏ విధమైన ప్రభావం చూపదు ఆగస్టు 14న (పాక్) స్వాతంత్ర్య దినోత్సవం నాడు స్కర్దులో నిరసన ప్రదర్శనలు జరిగిన తరువాతనే పాకిస్తాన్ కార్గిల్ యుద్ధంలో తన ప్రమేయం వుందని మొదటిసారిగా అంగీకరించింది ఆ రోజున సైనిక పురస్కారాలు పొందిన 64 మంది సైనికుల్లో అధిక శాతం క ్గల్ శిఖరాల్లో మొహరించిన నార్తరన్ లైట్ ఇన్‌ఫాంట్రికి చెందినవారే ఈ విభాగంలో వారందరూ ఉత్తర ప్రాంతం నుంచి భర్తీ అయిన వారే శత్రువుని నరకానికి పంపినందుకు సన్మానిస్తున్నట్లు స్వాతంత్ర్య దినోత్సవం నాడు సైనిక పురస్కారాలనిస్తూ చెప్పడం చూస్తే, పాక్ సైనిక వ్యవస్థను మతమౌఢ్యం ఎంతగా ప్రభావితం చేసిందీ తెలుస్తుంది శత్రువులను నరకానికి పంపించినందుకు మరణానంతర పురస్కారం అందుకున్న సైనికుల్లో కెప్టెన్ సర్దార్ ఇజార్ హైదర్ ఒకరు ఆయనకి భారతదేశ మహావీర చక్రతో పోల్చదగిన 'సితారా–ఎ–జుర్రాత్ పతకం లభించింది మే 28న భారత్‌కు చెందిన

ఎం–17 హెలికాప్టర్‌ను కూల్చి వేసినందుకు హవల్దార్ మేజర్ నసీర్ అలీషా గన్నర్ మొహమ్మద్ కమాల్ కూడా పతకాలు పొందారు అంతకు ముందు ముజాహిదీన్‌లే ఈ చర్యకు బాధ్యులని పాక్ ప్రకటించడం గమనార్హం 'శత్రువు భూభాగంలో గస్తీ నిర్వహిస్తూ 20 మంది భారత సైనికుల్ని నరకానికి పంపినందుకు లాన్స్ హవల్దార్ ఫిరోజ్ ఖాన్‌కు 'త్మ ఘా–ఇ–జుర్రాత్ పతకం లభించింది పాకిస్తాన్‌లో అత్యున్నత పురస్కారమైన నిషాన్–ఎ– హైదర్ పతకం పొందిన వారిలో హవల్దార్ లాలక్ జాన్ కెప్టెన్ కర్నాల్‌షేర్ వున్నారు షేర్ మృతదేహాన్ని భారత్ పాక్‌కు అప్పగించింది

ముజాహిదీన్‌లు జరిపారన్న యుద్ధానికి బాధ్యతను పాక్ సైన్యం మెల్లగా అయినా స్పష్టంగా అంగీకరిస్తోంది ఇంచుమించుగా ఈ పురస్కారాలన్ని ఎవరికీ తెలియని స్థావరాల్లోను ఎక్కడున్నాయో తెలియని అకిల్ పోస్టు హసన్ పోస్టు ' లలోను ధైర్యసాహసాలు ప్రదర్శించినందుకు ఇచ్చినవే

చనిపోయిన తన సైనికులనెవరూ గుర్తించకుండా వుండేందుకు పాక్ సైన్యం ఎంతో జాగ్రత్తగా ఒక మోస ముసుగును సిద్ధం చేసింది ఎ ప్రమేయం లేదు అనే ఈ ముసుగు జారిపోకుండా వుండాలంటే టోలోలింగ్ టైగర్ హిల్స్‌ల వద్ద సైనికులను కోల్పోవడం గురించి నిర్దిష్టంగా పేర్కొనడం పాకిస్తాన్‌కు సాధ్యపడదు 2 అలాంటప్పుడు పాకిస్తాన్‌గాని ఆదేశ సైన్యం గాని తమ పాత్రకి గుర్తింపు కోసం ఆరాట పడడం దేనికి? పాక్ సైనికాధికార గణంలో చాలా మందికి కార్గిల్ ఒక రాజకీయపు ఎత్తుగడ కాదు తమకు నిర్దేశించిన కర్తవ్యం నెరవేర్చుకునే యుద్ధం జియా ఉల్ హక్ ఉచ్ఛస్థితికి చేరినప్పటి నుంచి పాక్ సైనికాధికారగణంలో సమూలమైన మార్పులు చోటు చేసుకున్నాయి ఇరాన్ లేదా మొరాకో దేశాల పాలకులను (షా) ఆదర్శంగా తీసుకునే సంపన్న ఉన్నత వర్గాలకు చెందిన అధికారుల స్థానాన్ని అతి సంప్రదాయ వాదులైన దిగువ మధ్య తరగతి వారు ఆక్రమించారు తీవ్రమైన ఆర్థిక ఇబ్బందుల ఒత్తిడికి తట్టుకోలేని పాకిస్తాన్ సైన్యానికి మతవాద రాజకీయాల్లో ఆశాకిరణాలు కనబడసాగాయి

స్వదేశంలో ఆర్థిక ఇబ్బందులు అవినీతిలో కూరుకుపోయిన ప్రభుత్వ అసమర్థతల వల్ల పాకిస్తాన్‌లోని మత ఛాందసవాదులు ప్రజల్లో ముఖ్యంగా సామాన్య ప్రజానికంలో అభిమానాన్ని సంపాదించుకోగలిగారు అంతేకాక దశాబ్దాలుగా ఇస్లాం మోజును అడ్డుకోవడంలో పాశ్చాత్య పోకడలు గల కులీనుల కొమ్ము కాస్తున్న సైన్యం అభిమానాన్ని పొందడం కీలకమైంది అక్టోబర్ నెలలో ఇస్లామాబాదులో క్రిక్కిరిసిన బహిరంగసభలో జమాతె ఇస్లామి నేత కాజా హుసేన్ అహ్మద్ చెప్పినట్లు ఆర్థిక సంక్షోభం ముదిరే కొద్దీ సైన్యంలో సీనియర్ జూనియర్ అధికారుల వేతనాల మధ్య వ్యత్యాసం పెరిగిపోతోంది [3]

మనం పాకిస్తాన్‌గా వ్యవహరిస్తున్న దేశం ఒకసారి కాదు రెండుసార్లు పుట్టింది అని అయిజాజ్ అహ్మద్ చెబుతాడు బంగ్లాదేశ్ సృష్టితో తమ గుర్తింపు (జాతీయత) విషయంలో ఏర్పడిన సంక్షోభం గురించి అయిజాజ్ వివరిస్తాడు అలాగే ఉపఖండంలో ముస్లింల స్వగృహంగా కాక పశ్చిమ ఆసియా సంపత్తిపై ఆధారపడిన స్వచ్ఛమైన ఇస్లాం అనే మిథ్యా భావనకు సొంతగడ్డగా పాకిస్తాన్ పునరావిష్కృతం కావడాన్ని వివరిస్తాడు

పాకిస్తాన్‌కు అక్కడి ప్రత్యేక వర్గాలలో తిరిగి ఆత్మవిశ్వాసాన్ని నింపడంలో పెట్రో డాలర్లు చూపిన మహత్తు మరేదీ చూపలేదు ఐతే ఈ క్రొత్త తరహా సొమ్ము తనతో పాటే ఎంతో ప్రభావం కనబరిచే పెట్రో ఇస్లాం అనే కొత్త పదార్థాన్ని తెచ్చింది శతాబ్దాలుగా తీవ్ర సాంప్రదాయకత ఎడారి ప్రాంతాలకు సహజగుణం ఆ ప్రాంతాలలో అనూహ్య స్థాయిలో సంపత్తి కొత్తగా వచ్చి చేరింది ఈ రెండింటి సంకరంతో పుట్టినదే పెట్రో ఇస్లాం ఈ సంపత్తి స్థిరమైన చరిత్ర ఫలితమో తరతరాల శ్రమ ఫలితమో కాకుండా కాక తాళీయంగా లభించినది ఎక్కడా లేనంతగా నల్లబంగారం ప్రవహిస్తోందక్కడ వింత గొల్పే ఈ కొత్త ఇస్లాం పవిత్రత విషయంలో వినిమయతత్వం లో కూడా తీవ్ర స్వభావం గలది

ఈ పునరావిష్కృత ఇస్లాం జమ్మూ కాశ్మీర్‌లో పాక్ సైనిక కార్యక్రమాన్ని వెల్లడించడమేకాక పాక్ ప్రభుత్వం నిధులతో భారత్‌లో హింసను ప్రేరేపించేందుకు కులీన ఏకాభిప్రాయానికి 25 రూపు కల్పించి, సుస్థిరంగా వుంచుతోంది భారత్‌లో ప్రచార సాధనాల వాణికి విరుద్ధంగా కార్గిల్ యుద్ధం నిర్వహించడం వల్ల ప్రధాని షరీఫ్‌కు వచ్చిన గండం ఏదీ లేదన్నట్లు కనిపిస్తుంది పాకిస్తాన్ వైమానిక దళానికి చెందిన విమానాన్ని 1999లో 'రాణ్ ఆఫ్ కచ్'లో కూల్చివేయడం భారత్‌పై పగ తీర్చుకోవాలనే పిలుపులకు దారితీస్తే ప్రతిగా హిందూ మతవాదుల నుండి పాక్‌పై బహిరంగ దాడికి సిద్ధమంటూ పొలికేకలు వినిపించాయి అంతకన్న ప్రముఖంగా ముజాహిదీనుల ఛాందసవాద రాజకీయాలను, హింసాత్మక విధానాలను తాము ఆమోదించకపోయినా, షరీఫ్‌ను విమర్శించే మధ్యే వాదులు కూడా భారత్‌కు విరుద్ధంగా ముజాహిదీన్లుగా చలామణి అవుతూ తమ దేశ స్థావరాల నుండి కార్యకలాపాలు నిర్వహిస్తున్న వారికి నిధులను, తోడ్పాటును అందించడాన్ని సమర్థిస్తున్నారు

పశ్చిమ ఆసియాలో పాక్ మద్దతు అమెరికాకు అవసరమన్న అవగాహనతో ఆదేశ కులీన (ఎలైట్ వర్గం తమ భద్రతకు ఇప్పట్లో ముంచుకొచ్చే ప్రమాదం ఏదీ లేదని నిశ్చితంగా వుంది పచ్చి ఇస్లాం వాదులు విజృంభించకుండా నిరోధించేందుకు షరీఫ్ వంటి మధ్యేవాదులని ప్రోత్సహించడం అత్యవసరమని కూడా ఆ వర్గం

గ్రహిస్తోంది పాక్‌లోని అల్లా సైన్యం విస్తృత సామ్రాజ్యవాద పథకాన్ని కూడా నెరవేరుస్తుండడం ఆసక్తికరం అబ్దుల్ జబ్బార్ అనే తిరుగుబాటుదారు నేతృత్వంలో తీవ్రవాదులు పెంచి పోషించిన పాక్ విభాగాలకు పశ్చిమ ఆసియా ఛాందసవాదులకు ఉత్తర కాకసెస్‌లోని డాగెస్తాన్ యుద్ధంతో ప్రమేయం వుందని రష్యాకు చెందిన స్వతంత్ర వార్తాపత్రిక సెగొన్యా నమ్మకంగా చెబుతోంది [6] కేంద్ర ఆసియా చమురును రష్యా ప్రభావం నుంచి తప్పించడంలో అమెరికాకు ప్రత్యక్షంగా ఆసక్తి వుందని దీనివల్ల తేటతెల్లమవుతోంది

## భారత్ చెల్లించిన అసలు మూల్యం

కార్గిల్ అనంతరం మతఛాందసవాదులు సైన్యం అమెరికాల మధ్య బలపడే పొత్తును పాకిస్తాన్ ప్రజలు భరించక తప్పదు

1980 దశకంలో కొత్త మధ్యతరగతి ఆవిర్భావానికి భారతదేశమంతటా హిందుత్వ భావన పెరగడానికి మధ్య అవినాభావ సంబంధం గమనించిన వారికి అహ్మాద్ వర్ణించిన పెట్రో ఇస్లాంలో 1980 దశకం మధ్య కాలంలో పుట్టుకొచ్చిన స్వేచ్ఛా మార్కెట్ హిందుత్వపు ప్రతిధ్వనులు కలవరం కలిగిస్తాయి భారత్‌లో కూడా సైన్యంలో మత ధోరణులు పెంపొందించే ప్రక్రియ వేగం పుంజుకుంటున్న ధోరణి కొందరు ఉన్నత సైనికాధికారులకు హిందుత్వంతో వున్న కలవరపరిచే సంబంధాలు అద్దం పడతాయి కర్నాల్‌లో త్రివిధ దళాల అధిపతుల చిత్రాలతో అలంకరించిన వేదికపై నుంచి ఎన్నికల ప్రసంగం చేసేందుకు వాజ్‌పేయి పూనుకోవడం చూస్తే ఈ విధ్వంసక చర్యకు అధికారుల సమ్మతి ఎంతగా వుందో తెలుస్తుంది [6] అంతకు పూర్వం ఢిల్లీలోని సైనిక ఆస్పత్రిలో గాయపడి చికిత్స పొందుతున్న పరమ్‌వీర్ చక్ర గ్రహీత గ్రెనేడియర్ యోగేంద్ర యాదవ్‌ను విశ్వహిందు పరిషత్ నాయకుడు గిరి రాజ్ కిశోర్‌కు పాదాభివందనం చేయాల్సిందిగా ఆదేశించారు అతనలా చేయలేని నిస్సహాయ స్థితిలో వున్నందున, అతనికి బదులుగా అతని భార్య అభివాదం చేసింది [7]

భారత్‌లోను పాకిస్తాన్‌లోను ప్రగతి నిరోధక శక్తులు నశించకపోగా అణ్వస్త్ర శక్తితో మళ్లీ పుంజుకుంటున్నాయి

కార్గిల్ యుద్ధ ఫలితంగా భారత్‌కు సంక్రమించిన వారసత్వాలు ఎంత ఆందోళనకరమైనవో సరిగా అర్థం చేసుకోవడం విశ్లేషించడం జరగలేదు ఉత్తర దిశగా వున్న శిఖరాల రక్షణకు అవసరమని నిపుణులు చెబుతున్న కోట్లాది రూపాయల వ్యయం పాకిస్తాన్‌లోని సామాన్య ప్రజానీకంతో సంబంధాలు తెంచుకునేందుకు సమ్మతించని దిలీప్ కుమార్‌పై దాడులు, భారత-పాకిస్తాన్ వివాద పరిష్కారం కోసం

అణ్వస్త్ర ప్రయోగం జరపాలన్న ఆర్ ఎస్ ఎస్ ఉన్మత్త ప్రేలాపనలు, పాకిస్తాన్‌కు చెందిన పత్రికలు టెలివిజన్ కార్యక్రమాలు అందుబాటులో లేకుండా నిషేధం ఇవన్నీ కార్గిల్ యుద్ధ ఫలితంగా దీర్ఘకాలం మనం చెల్లించ వలసిన మూల్యంగా పరిణమించవచ్చు నాటకీయంగా మారి దేశభక్తి కార్గిల్ యుద్ధం మూలంగా తలెత్తిన అసమ్మతి అణిచివేత మాయని మచ్చలుగా మిగిలిపోనున్నాయి

కార్గిల్ అనంతర ప్రభుత్వ విధానం ద్వారానే కాక సినిమాలు టెలివిజన్ పత్రికలు ప్రజాభావాలకు సంస్కృతి సాధానాల ద్వారా కూడా దేశభక్తిని పెంపొందించేందుకు జరిగిన వాటికి ఎంతో ప్రాముఖ్యత ఉంది ఈ దేశభక్తిలో ఆత్మశోధన నిజాయితీ లోపించడం గమనార్హం అహ్మద్ సూచించినట్లు

" అయోధ్య కూల్చివేతలో తన పాత్రపై నేరారోపణ నెదుర్కొంటున్న ఎల్ కె అద్వాని నుంచి మొక్కవోని ఉదారవాది అయిన లాయరు మెచ్చదగిన రాజీవ్ ధవన్ వరకు పాకిస్తాన్‌కు దుష్టదేశ మనో తీవ్రవాదదేశమనో మరోటనో ముద్ర వేయాలనే విషయంలో అసాధారణంగా ఏకాభిప్రాయం కుదిరింది ఐతే లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ్ ఈలం (ఎల్ టి టి ఇ )కి ప్రభుత్వం మద్ధతు నిస్తున్నపుడు కాని ప్రధానే బింద్రన్‌వాలాను దేశంపైకి ఉసిగొల్పినపుడు గాని భారతదేశాన్ని దుష్ట దేశంగా ప్రకటించాలని ఎవరూ కోరలేదన్న విషయం విస్మరిస్తున్నారు 8

ఈ ఏకాభిప్రాయాన్ని ఎలా ఉత్పత్తి చేసారనే ప్రశ్నకు కార్గిల్ యుద్ధాన్ని నడిపించిన ప్రక్రియలపై పరిశోధన గాని విమర్శనా పూర్వకమైన అంతర్ దృష్టి గాని ప్రచార సాధనాలలో లోపించాయనేది సమాధానంగా నిలుస్తుంది "సమాచార యుద్ధంలో మీడియా ఒక బలి పశువా లేక సాధనమా" అనే అంశంపై ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మాస్ కమ్యూనికేషన్ నిర్వహించిన అధ్యయనం భారత విలేకర్ల కథనాలు క్రమబద్ధంగా దేశ విధానాన్ని సమర్ధించేవిగా వున్నాయని సూచించింది ఈ అధ్యయన రచయితలు భారత్ పాకిస్తాన్ పశ్చిమ దేశాలకు చెందిన 25 వార్తాపత్రికలకు చెందిన 301 సంచికలను 25 మాగజైన్లకు చెందిన 26 సంచికలను పరిశీలించి భారత ప్రచార సాధనాలు ఇతర దేశాల ప్రచార సాధనాల బాణీలోనే తమ ప్రభుత్వ విధానాన్ని బలపరిచాయనే నిర్ధారణకు వచ్చారు విమర్శన్నదే లేకుండా, ప్రచార సరళిలో సాగిన టెలివిజన్ కథనాలని ఈ అధ్యయనంలో చేర్చలేదు

కొందరు పాత్రికేయులు ఈ అధ్యయనం పట్ల ఆగ్రహావేశాలు వ్యక్తం చేసారు టైమ్స్ ఆఫ్ ఇండియాకు చెందిన దిలీప్ పడ్గాంకర్ కార్గిల్ ఉద్యమంలో పారదర్శకత లేదన్న వాస్తవాన్ని తేలిగ్గా తోసిపుచ్చుతూ, ప్రపంచ ప్రజల కోసం 'ప్రత్యేక భారత్

రూపొందించిన ప్రధాన ప్రచార సాధనాలను వెనకేసుకొచ్చారు 9

అసలీయుద్ధం ఎందుకు వచ్చింది? దీని వల్ల భారతదేశం నేర్చుకోదగ్గ పాఠాలేమిటి? అనే అంశాలపై దాపరికం లేని ప్రజాస్వామిక అధ్యయనంలో విఫలమయితే అది కార్గిల్ కొండల్లో వికలాంగులైన, అమరులైన సైనికుల జ్ఞాపకాలను అవమానించడమే అవుతుంది శ్రీనగర్‌లో ఈ ఏటి (1999) స్వాతంత్ర్య దినోత్సవాన్ని విజయ్ దివస్'గా జరిపారు దాల్ సరస్సుపై ఉన్నత సైనికాధికారులు అగ్రశ్రేణి రాజకీయనాయకుల ఎదుటే సినిమా తారలు వినోద ప్రదర్శన నిర్వహించారు సమాచార ప్రసార శాఖ మంత్రి ప్రమోద్ మహాజన్ సుపుత్రుడు రాహుల్ ఈ భారీ వేడుకల్ని ఏర్పాటు చేశారు ప్రజాధనం వెచ్చించి నిర్వహించిన ఈ వేడుకలకు జమ్మూ కాశ్మీర్ ప్రజల నెవరిని ఆహ్వానించకపోవడం విచారకరం వందలాది సైనికుల మరణం సరోవరాల వద్ద సంబరాలు జరుపుకునే సందర్భం కావడమనేది కాషాయంమార్కు దేశభక్తి గురించి చెప్పకయే చెబుతుంది

## కార్గిల్ - కాశ్మీర్‌లో ప్రజాస్వామ్యం

భారత్, పాకిస్థాన్ దేశాలలో ప్రజాస్వామ్యం సన్నగిల్లడం జమ్ము కాశ్మీర్‌పై అతిగా ప్రభావం చూపుతుంది ఎందుకంటే ఉభయ దేశాలలోని మతోన్మాదం యుద్ధానికి తలపడిన వేదిక అదే

అర్థ శతాబ్దంగా మొత్తం భారత దేశపు మతతత్వ సమీకరణల నేపథ్యంలోనే కాశ్మీరీలకు గుర్తింపు స్థిరపడిపోయింది ప్రత్యక్ష సాక్ష్యాధారాలు లభించడం కష్ట సాధ్యమైనా కాశ్మీర్‌లో ముస్లింల గుర్తింపులో వచ్చిన మార్పులు అధ్యయనం చేయదగ్గ సుక్షేత్రాలు రాష్ట్ర పాఠశాల విద్యా వ్యవస్థలో ఇతర రాష్ట్ర భాషల స్థానంలో క్రమబద్ధంగా ఉర్దూను ప్రవేశపెట్టడం వీటిలో ఒకటి విచిత్రంగా ఈ పథకాన్ని రాష్ట్రప్రభుత్వమే ప్రవేశపెట్టింది ఫలితంగా రెండు తరాల కాశ్మీరీ ముస్లింలకు తమ స్వంత భాషలో చదవడం రాయడం తెలియకుండా పోయాయి జమ్ము-కాశ్మీర్ లో కాశ్మీరీ భాషకు సంబంధించిన వార్తాపత్రికలు కాని కొత్త సాహిత్యంగాని లేవు

ఇదే సమయంలో జమాతె ఇస్లామీకి రాజకీయ పలుకుబడి అట్టే లేకపోయినా రాష్ట్రంలోని ముస్లింలను వారు అనుసరించే జానపద ఇస్లాం నుంచి తప్పించి కొత్త సాంప్రదాయిక ఇస్లాంలోనికి మార్చే పెద్ద పథకాన్ని చేపట్టింది దీనికి స్థానికుల్లో ఉన్నత వర్గాల వారి నుంచి రాజకీయ ప్రాపకం లభించింది ముస్లింవాదానికి అనుకూలుడైన ఒక పరిశీలకుడు ఇలా వాదించాడు -

-- కాశ్మీర్ ముస్లింల ఇస్లామీకరణ కోసం అహ్లె-ఎ-హదిత్ చేస్తున్న ప్రయత్నాలను

పగటి కలలుగా అభివర్ణించడమంటే వారి ప్రార్ధనా స్థలాలకు వెళ్ళే భక్తులలో రేకెత్తించిన 'శాహిద' స్ఫూర్తిని దాని ప్రభావ ప్రాముఖ్యతలదీను విస్మరించడమే! సమకాలీన దృశ్యాలను పరికిస్తే ప్రార్ధనా స్థలాలను ఇస్లాంకు సంబంధించిన విజ్ఞాన సముపార్జనా కేంద్రాలుగా మార్చేసేందుకు జరుగుతున్న ప్రయత్నాలు అహ్లే-ఎ-హదిత్ చేపట్టిన ఇస్లామీకరణ ప్రక్రియ పరిణామాలుగా ఒప్పుకోక తప్పదు [10]

హిందు ముస్లిం ఛాందసవాదుల మధ్య యధాలాపంగా జరుగుతుండే ప్రతిస్పందనల గురించి పరిశోధనలు తగ్గడం విచారకరం కాని ఒకటి మాత్రం వాస్తవం హిందుత్వ ఉధృతితోనే గతంలో ఎన్నడూ లేని విధంగా కాశ్మీర్ ముస్లింలు భారతదేశంలోని పరిణామాలకు స్పందించడం మరింత ఎక్కువైంది కాశ్మీరులోని విద్రోహులు జీన్స్ ధరించిన యువతులను తుపాకులతో కాల్చివేయడం గాని కేబుల్ టెలివిజన్ ప్రసారాలను నిషేధించడం గాని, ఆధునీకరణ పట్ల అర్ధరహితమైన వ్యతిరేకతతోనే అనుకోవడం పొరపాటు ప్రస్తుతం భారత దేశం అంతటా హిందూ ఛాందస వాదుల సమీకరణ జరుగుతున్న నేపధ్యంలో అటువంటి చర్యలకు పాల్పడడం స్థానబలం కలిగిన ప్రాంతాలలో తమకు న్యాయబద్ధత కల్పిస్తుందని మతతత్వ వాదులు విశ్వసిస్తున్నారు ”

జమ్ము - కాశ్మీరు రాజకీయాలలో ఈ బహువిధ ధోరణులు మతపరమైన అంశాలే రాష్ట్రంలో పరిస్థితులను నిర్దేశిస్తున్నట్లున్నాయి అలాగే విద్రోహ బృందాల వ్యవహారాలను కూడా అవే రూపొందిస్తున్నాయి ఈ తరహా రాజకీయవాదనలు భౌతికంగా వినాశహేతువులు కావచ్చు జమ్ము - కాశ్మీరులో జరుగుతున్న సంఘటనలు ఇలా రూపుదిద్దుకోవడంలో హిందూ మతవాదుల సమీకరణ - ఇస్లాం తీవ్రవాదుల తిరుగుబాటుల మధ్య పరస్పరాధారిత సంబంధాల ప్రగాఢ ముద్ర కనిపిస్తుంది దీనికి బి జె పి ప్రభుత్వ ఏలుబడిలోవ్ని భారతదేశ ప్రతిక్రియని పరిశీలిస్తే అది 'అంతర్గత భద్రతా నిర్వహణ' వెల్లడిస్తున్నట్లు విస్తృత సైనికవాదం రూపంలోనో కరారా ఊచకోత జరిగినప్పటి నుంచి జమ్ములో హిందు మత మౌలికవాదులను ప్రోత్సహించేదిగానో వుంది లౌకిక వాద ప్రజాస్వామ్య వాదులకు ప్రాతినిధ్యం వహించే నేషనల్ కాన్ఫరెన్సు ఇప్పుడు 370 అధికరణాన్ని వ్యతిరేకించే రాజకీయ పక్షంతో పొత్తు కట్టింది

విశ్లేషకులు కాశ్మీరీలైనా మరెవరైనా సరే వ్యూహాత్మక చర్చల సందర్భంగా తప్పని సరిగా జమ్ము - కాశ్మీర్ ప్రత్యేకతను ప్రస్తావిస్తూ ప్రారంభించడం వాడుక వారి కథనాలు ఆ రాష్ట్ర ప్రజలు ఇటీవలనే మరో గ్రహం నుంచి ఊడి పడ్డవారు సుమా అని సూచించేవిగా వుంటాయి వారు ప్రత్యేకత గురించి చెప్పే కథలు చర్విత చరణంగా

ఎకరువు పెట్టేవే తప్ప అట్టే విశేషం ఎమీ లేదు  కాశ్మీర్‌లో చారిత్రక ప్రక్రియలు పరిణామాలు ఇతర ప్రాంతాలకన్న ప్రత్యేకత గలవి కావు  ఐనా రాష్ట్రంలోని సంఘర్షణని కేవలం స్థానిక వివాదంగా అర్థం చేసుకోవడం మానేసి, ఒక విస్తృత మత సంఘర్షణలో భాగంగా చూస్తున్నారనేది కాదనలేని వాస్తవం  ప్రోఏక్టివిటి అనే ఆదర్శం ఈ విస్తృత సంఘర్షణలోంచి పుట్టినదే  కాని అదే కారణంగా ఆ సిద్ధాంతం విస్తృత మత సంఘర్షణని అర్థం చేసుకోవడంలోనూ ఆ విషయంలో సమర్థవంతంగా వ్యవహరించడంలోనూ విఫలమవుతోంది

జమ్ము – కాశ్మీర్‌పై గంభీరమైన పునరాలోచన అవసరం  అది సమకాలీన భారత చరిత్రలోని మహత్తర ఘటనలు దేశంలోని ఇతర ప్రాంతాలలో లాగానే అక్కడ కూడా సంభవించాయనే అవగాహనతో మొదలు కావాలి  1980వ దశకంలో హిందుత్వ ప్రోద్బలంతో భారత దేశం అంతటా చెలరేగిన హిందు–ముస్లిం సంఘర్షణల నేపథ్యంలోనే ఈ రాష్ట్రంలో కూడా విద్రోహ ధోరణులు తలెత్తడం కాకతాళీయం కాదు  రాష్ట్రంలో సాంప్రదాయికంగా వర్తక వ్యాపారాలు చేసుకునే మధ్య తరగతి వారిని ఆధునికమైన ఔత్సాహిక కార్యకలాపాలలోకి పరిశ్రమలలోకి మళ్ళించడంలో ప్రభుత్వం వైఫల్యం కావడం లౌకిక ప్రజాస్వామ్య రాజకీయ సంస్కృతి లోపించడం, అన్నిటినీ మించి జమ్ము – కాశ్మీర్‌లో నూతనంగా తమ వైఖరిలో భారతీయతను సంతరించుకున్న మధ్య తరగతిని రాష్ట్రంలో అధికారం ఆర్థిక అవకాశాల వ్యవస్థలకు దూరంగా వుంచడం జరిగాయి  రాష్ట్ర విధానం ఎదైనా అది అర్థవంతంగా వుండాలంటే ఈ మూడు అంశాలపై దృష్టి సారించక తప్పదు

1999 వేసవి నాటికి హిందుత్వ ప్రభుత్వం జమ్ము – కాశ్మీర్ రాష్ట్రాన్ని దేశ విభజన అనంతరం అంతటి విపత్కర సంక్షోభంలోకి నెట్టింది  ఈ విషయాన్ని వేలెత్తి చూపే వారెవరూ లేరు  ముస్లిం మత వాదం ప్రతిపక్ష స్థానాన్ని పూర్తిగా ఆక్రమించుకుని ప్రజాస్వామికంగా చర్చలు జరిపే ఆస్కారం లేకుండా చేస్తోంది  రాష్ట్రంలో చిన్నగా ఆరంభమై ఎదుగుతున్న వామపక్షం ఒక్కటే ప్రజాస్వామిక రాజకీయాలకు ప్రాతినిధ్యం వహిస్తోంది  అందువల్ల అచ్చమైన, ప్రజాస్వామికమైన రాజకీయాలు వృద్ధి చెందితే తప్ప రక్త సిక్తమైన కార్గిల్ యుద్ధ అంతం శాంతికి ఆరంభం అనేవి దుర్లభం

# వివరణలు

I <u>ఉపక్రమణిక జమ్మూకాశ్మీర్‌లో యుద్ధం</u>

1 ఐజాజ్ అహ్మద్ 'మీడియేషన్ వై ఎనీ అదర్‌నేమ్ ఫ్రంట్ లైన్ 30 జూలై 1999

2 షేక్ మహమ్మద్ అబ్దుల్లా 1951 నవంబర్ 5న జమ్మూకాశ్మీర్ రాజ్యాంగసభనుద్దేశించి చేసిన ఉపన్యాసం జమ్మూ-కాశ్మీర్ ప్రభుత్వం వారి రాష్ట్ర స్వయంప్రతిపత్తి కమిషన్ నివేదిక 1999 పేజీ 150లో ప్రస్తావించినది

3 సుమిత్‌గంగూలి ఎవాయిడ్ వార్ ఇన్ కాశ్మీర్ ఫారిన్ ఎఫైర్స్ శీతాకాలం 1990-91

II <u>కార్గిల్ ఎత్తుల కోసం పోరు</u>

1 ప్రవీణ్‌స్వామి 'అన్‌నోన్ హీరోస్ ఆఫ్ బతాలిక్ ఫ్రంట్ లైన్ 1999 జూలై 30

2 దినేష్‌కుమార్ 'హాట్ ఇట్ టుక్ అండ్ రన్ ఆఫ్ టు ఆపరేషన్ విజయ్ ది టైమ్స్ ఆఫ్ ఇండియా 1999 జూలై 1999

3 ప్రవీణ్‌స్వామి 'వార్ ఇన్ కార్గిల్ ఫ్రంట్‌లైన్ 18 జూన్ 1999

4 రాహుల్ బేడి 'ఆర్మీ డిస్ప్యూట్స్ ఎఫెక్టివ్‌నెస్ ఆఫ్ ఇండియన్ ఎయిర్ స్ట్రైక్స్ ఇన్ కార్గిల్, ది ఆసియన్ ఏజ్ 22 జూలై 1999

5 సునీల్ నరూలా, నితిన్‌గోఖలే 'ఎ స్టెప్ ఎ హెడ్ అవుట్‌లుక్ 5 జూలై 1999

6 మనోజ్ జోషి రాజ్ చెంగప్ప ' ది మరాథన్ వార్' ఇండియా టుడే 21 జూన్ 1999

7 ప్రవీణ్‌స్వామి 'ది ఫైనల్ అస్సాల్ట్ అండ్ ది విత్ డ్రాయల్' ఫ్రంట్ లైన్ 30 జూలై 1999

8 గులాంహస్‌నైన్, 'అండర్ ది కవర్ ఆఫ్ నైట్' టైమ్, 12 జూలై 1999

9 ఇన్ ఎనిమీ టెరిటరి ఎ సోల్జర్స్ స్టోరీ, టైమ్, 12 జూలై 1999

10 అజిత్ పిళ్లై ఇషాన్ జోషి, 'దిరోడ్ ఎహెడ్ 'అవుట్‌లుక్ 12 జూలై 1999

11 హరీందర్ బవేజా,'లాంగ్ హోల్' ఇండియా టుడే 12 జూలై 1999

12 లెటర్ ఆఫ్ ది ఆర్మీ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ కల్నల్ శృతికాంత్ అఫ్ స్ట్రాటజిక్ పాలీస్ చూడండి 16 జూలై 1999

13 'పాకిస్తాన్ ఫోర్సెస్ బిగిన్ టు విత్ డ్రా' ది ట్రిబ్యూన్ 12 జూలై 1999

14 బజ్‌రంగ్ పోస్ట్ రిగెయిన్డ్' ది ట్రిబ్యూన్ 14 జూలై 1999

15 పాక్ వయొలేట్స్ ఎయిర్‌స్పేస్' ది ట్రిబ్యూన్ 24 జూలై 1999

16 'ఫైట్ ఫర్ రిడ్జెస్ ఎలాంగ్ లైన్ ఆఫ్ కంట్రోల్ ది ట్రిబ్యూన్ 31 జూలై 1999

III <u>రణరంగాని కావల యుద్ధం</u>

1 'కార్గిల్ హ్యాజ్ విట్‌నెస్‌డ్ ఏన్ ఇన్‌వేజన్' ది హిందుస్థాన్ టైమ్స్ 18 జూలై 1999

2 ఇక్కడ ఉదహరించినవే కాక కార్గిల్‌పై ఫెర్నాండేజ్ ప్రకటనల చక్కని సంకలనం కోసం

'గవర్నమెంట్ డబుల్ స్పీక్ ఆన్ కార్గిల్' చూడండి ది ట్రిబ్యూన్ 5 జూన్ 1999

3 1999 మే 19న జరిగిన యూనిఫైడ్ హెడ్ క్వార్టర్' సమావేశం తాలూకు మినిట్లు యూనిఫైడ్ హెడ్ క్వార్టర్స్ సెక్రటేరియట్ మే 1999 ఈ సమావేశానికి సంబంధించిన ఇక ముందుటంకించబోయేవన్నీ ఈ పత్రం నుంచి గ్రహించినవే

4 'ఉయ్‌డిడ్ ఫెయిర్లీ వెల్' లెఫ్టినెంట్ జనరల్ క్రిషన్ పాల్‌తో ఇంటర్వ్యూ ఫ్రంట్‌లైన్ 27 ఆగస్టు 1999

5 పైదాన్లోంచే

6 పైదాన్లోంచే

7 లెటర్ 6361/ఎస్ టి ఎస్ /21 తేది 2 మార్చి 1998 లెఫ్టినెంట్ జనరల్ వి ఎన్ బుధ్‌వార్ జనరల్ ఆఫీసర్ కమాండింగ్ 3ఇన్‌ఫ్రాంట్రి డివిజన్ లెహ్ తరఫున కల్నల్ ఎస్ పి తన్వర్ సంతకం చేసినది

8 నితిన్ ఎ గోఖలే అజిత్ పిళ్లై 'ది వార్ దట్ షుడ్ నెవర్ హ్యావ్‌బీన్ ఔట్‌లుక్ 6 సెప్టెంబరు 1999

9 సైన్యం ఖండన పూర్తి పాఠంకోసం టెక్స్ట్ ఆఫ్ ఆర్మీ స్టేట్‌మెంట్ ఆన్ కార్గిల్ పేపర్స్' చూడండి ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 2 సెప్టెంబర్ 1999

10 కొత్తఢిల్లీలోని కేంద్ర రక్షణ మంత్రిత్వ శాఖ విడుదల చేసిన జనరల్ పర్వేజ్ ముషారఫ్ లెఫ్టినెంట్ జనరల్ అజీజ్ ఖాన్‌ల మధ్య సంభాషణ బేస్ నుంచి రాసినవి ప్రవీణ్‌స్వామి ఎలాంగ్ హాల్ ఎహెడ్' కూడా చూడండి ఫ్రంట్ లైన్ 2 జూలై 1999

11 అజీజ్ అహ్మద్ మీడియేషన్ వై ఎనీ అదర్‌నేమ్' ఫ్రంట్‌లైన్ 30 జూలై 1999

12 పాక్ షెల్లింగ్ నియర్ వెన్యూ ఆఫ్ పి ఎమ్స్ విజిట్ ఇన్ కార్గిల్' 2 బిజినెస్ లైన్ 13 జూన్ 1999

13 సేమాగుహా 'పాక్ అన్‌లైక్‌లీ టు హీడ్ జి 8 ది టైమ్స్ ఆఫ్ ఇండియా 22 జూన్ 1999

14 ది యు ఎస్ ఎంగిల్ ఫ్రంట్ లైన్ 16 జూలై 1999 వాషింగ్టన్ పోస్ట్ నుంచి పునర్ముద్రితం

15 అయిజాజ్ అహ్మద్, 'మీడియేషన్ బై ఎనీ అదర్ నేమ్'

16 పైన పేర్కొన్నదాన్లోంచి

17 శ్రీధర్ క్రిష్ణస్వామి ఎఫర్మ్ అమెరికన్ డిమాండ్ ఫ్రంట్‌లైన్ 30 జూలై 1999 క్లింటన్–షరీఫ్‌ల సంయుక్త ప్రకటన పూర్తి పాఠం కూడా ఈ సంచికలో పునర్ముద్రించారు

IV <u>బస్సులో పోఖ్రాన్ నుండి కార్గిల్ వరకు</u>

1 ప్రవీణ్‌స్వామి 'కాశ్మీర్ ఎట్ క్రాస్‌రోడ్స్' ఫ్రంట్‌లైన్ 3 జూలై 1998

2 ప్రవీణ్‌స్వామి ఫ్లాష్ పాయింట్ కాశ్మీర్' ఫ్రంట్‌లైన్ 28 ఆగస్టు 1998

3 ప్రవీణ్‌స్వామి 'ది బంగిల్ ఇన్ కార్గిల్' ఫ్రంట్‌లైన్ 2 జూలై 1999

4 అమిత్ బారువా 'పాకిస్తాన్ స్ట్రాటజీ' ఫ్రంట్‌లైన్ 18 జూన్ 1999

5 ప్రవీణ్‌స్వామి ' ది బంగిల్ ఇన్ కార్గిల్'

6 ఎన్ రామ్ 'ది పోఖరన్–కార్గిల్ కనెక్షన్ 'ఫ్రంట్ లైన్ జూలై 1999

7 ప్రవీణ్‌స్వామి 'ది వార్ ఇన్ కార్గిల్ ' ఫ్రంట్ లైన్ 18 జూన్ 1999

8 ప్రవీణ్‌స్వామి ది ఫైనల్ అస్సాల్ట్ ఎండ్ ది విత్ డ్రాయల్' ఫ్రంట్ లైన్ 30 జూలై1999

9 ప్రవీణ్‌స్వామి ' వార్ ఇన్ కార్గిల్'

10 ఎ జి నూరాని 'క్వశ్చన్ ఆఫ్ అకౌంటబిలిటీ' ఫ్రంట్ లైన్ 2 జూలై 1999

11 ది టైమ్స్ ఆఫ్ ఇండియా 6 సెప్టెంబరు 1999

12 ఉయ్ డిడ్ ఫెయిర్లీ వెల్ లెఫ్టినెంటు జనరల్ కిషన్ పాతతో ఇంటర్వ్యూ ఫ్రంట్ లైన్ 27 ఆగస్టు 1999

13 'ది ఆర్మీ లీడర్ షిప్ హాజ్ బీన్ పొలిటిసైజ్‌డ్' లెఫ్టి జనరల్ మోతీదార్‌తో ఇంటర్వ్యూ 27 ఆగస్టు 1999

14 పైదాన్లోంచే

15 విక్రం జీత్‌సింగ్, నజీర్ మసూది ఆర్మీ ఫెయిల్డ్ టు హిడ్ వార్నింగ్ ఆఫ్ పాక్ ఏక్షన్' ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్, 2 జూన్ 1999

16 ఇన్ ఎనిమీ టెరిటరీ ఎ సోల్జర్స్ స్టోరీ' టైమ్ 12 జూలై 1999

17 ప్రవీణ్‌స్వామి ది ఫైనల్ అస్సాల్ప్ ఎండ్ ది విత్ డ్రాయల్'

18 ప్రవీణ్‌స్వామి, 'స్ట్రాటజిక్ ఫాలీస్' ఫ్రంట్‌లైన్ 2 జూలై 1999

19 మనోజ్ జోషి, 'అవర్ సోల్జర్స్ సక్సీడెడ్, వేర్ డిడ్ వుయ్ ఫెయిల్?' సండే టైమ్స్‌లో, పేజీ 13, 18 జూలై 1999

20 పైదాన్లోంచే

21 లోక్‌సభలో రాష్ట్రపతి ప్రసంగానికి ధన్యవాదాలు తెలుపుతూ ప్రధాని ప్రసంగం 15 మార్చి 1999

22 అయిజాజ్ అహ్మద్ ది మెనీరోడ్స్ టు కార్గిల్' ఫ్రంట్‌లైన్ 16 జూల్ 1999

V <u>కార్గిల్ పోరు – కాశ్మీర్ రాజకీయాలు</u>

1 అజీజ్ అహ్మద్ ఉటంకించినది, 'మీడియేషన్ బై ఎనీ అదర్‌నేమ్ ఫ్రంట్‌లైన్ 30 జూలై 1999

2 బాల్‌రాజ్ పూరి 'సైనన్స్ ఆఫ్ డిస్ట్రెస్' ఫ్రంట్‌లైన్ 16 జూలై 1999 పూరి ఇలా రాశారు "150 మంది కార్గిల్ కాందిశీకులు బౌద్ధులు అధికంగా వున్న లెహ్‌లో ఆశ్రయం

కోరినప్పుడు వారిని వెనక్కుపంపెయ్యాలన్న డిమాండ్లు వారికెదురయ్యాయి లడఖ్ బౌద్ధ సంఘం యువజన విభాగం అక్రమ చొరబాటుదారులకు 'ఆశ్రయమిచ్చి ఆదరించడానికి మా ప్రజలు సిద్ధంగాలేర ని హెచ్చరించింది

3 పైదాన్లోంచే

4 ప్రవీణ్‌స్వామి ప్రో ఎక్టివ్' ఆఫ్టర్ పోఖ్రాన్ ఫాల్ట్‌లైన్స్ జూన్ 1997 ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కాన్‌ఫ్లిక్ట్ మ్యానేజ్‌మెంట్, న్యూఢిల్లీ

5 శ్రీధర్‌స్వామి 'కాశ్మీరీ పండిట్స్ సీక్ యు ఎస్ హెల్ప్ ది హిందూ 7 ఆగస్టు 1999

6 బెనజీర్ భుట్టో కామెంట్ ది న్యూయార్క్ టైమ్స్ జూన్ 8 ఫర్ ఎ క్యాంప్ డేవిడ్ ఫర్ కాశ్మీర్ పేరిట తిరిగి ప్రకటితమైంది ఫ్రంట్‌లైన్ 2 జూలై 1999

ప్రవీణ్‌స్వామి బ్లడ్ ఆన్ ది చీనాబ్ ఫ్రంట్‌లైన్ 24 ఏప్రిల్ 1998

8 ప్రవీణ్‌స్వామి ప్రొ ఏక్టివ్ ఆఫ్టర్ పోఖ్రాన్

9 ఈ నివేదిక పూర్తి వివరాలతో కావాలంటే ప్రవీణ్‌స్వామి టువర్డ్స్ గ్రేటర్ అటానమి చదవండి ఫ్రంట్‌లైన్ 30 జూలై 1999

VI <u>జమ్మూకాశ్మీర్ మతతత్వ వ్యాప్తి</u>

1 ఎం జె అక్బర్ ఇండియా ది సీజ్ విదిన్ లో పేర్కొన్నది పేజీ 241 న్యూఢిల్లీ 1985

2 1999లో జరిగిన మారణహోమాల వివరాలకు 'అనదర్ సమ్మర్ ఆఫ్ కిల్లింగ్స్ చూడండి 30 జూలై 1999

3 ప్రవీణ్‌స్వామి మాసకేర్స్ అండ్ కోల్డ్ ఫాక్ట్స్ ఫ్రంట్‌లైన్ 13 ఆగస్టు1999

4 ప్రవీణ్‌స్వామి బ్లడ్ ఆన్ ది చీనాబ్' ఫ్రంట్‌లైన్ 24 ఎప్రిల్ 1998

6 ప్రవీణ్‌స్వామి 'చప్‌నారీస్ టెర్రర్' ఫ్రంట్‌లైన్ 17 జూలై 1998

7 అందుల్లోంచే

8 ప్రవీణ్‌స్వామి 'అనదర్ సీజన్ ఆఫ్ మాసకేర్స్ ఫ్రంట్ లైన్ 26 మార్చి 1999 పేజీ 13

VII <u>కాశ్మీర్‌లో ప్రొ ఆక్టివ్</u>

1 ఉయ్ హేవ్ ఎక్సర్ సైజ్‌డ్ అట్‌మోస్ట్ రిస్ట్రెయింట్ లెఫ్టినెంట్ జనరల్ కిషన్‌పాల్‌తో ఇంటర్వ్యూ ఫ్రంట్‌లైన్ 28 ఆగస్టు 1998

2 'ఆర్మీఫర్ హాట్‌పర్స్యూట్ లెఫ్ట్ జనరల్ కిషన్‌పాల్‌తో ఇంటర్వ్యూ ఫ్రంట్‌లైన్ 3 ఎప్రిల్ 1998

3 ప్రవీణ్‌స్వామి అనదర్ సమ్మర్ ఆవ్ కిల్లింగ్స్ ఫ్రంట్‌లైన్ 30 జూలై 1999

4 పైదాన్లోంచే

5 ఎన్ రామ్ 'కార్గిల్ సక్సెస్ ఎండ్ కాంప్లికేషన్ ఫ్రంట్‌లైన్ 30 జూలై 1999

6 ఈ వ్యాసంలోని ఈ విభాగంలో వివరించిన అంశాల గురించి ప్రవీణ్ స్వామి రాసిన 'ఎక్స్‌టెండింగ్ టెర్రర్' చదవండి ఫ్రంట్ లైన్ 26 మార్చి 1999

7 ప్రవీణ్‌స్వామి 'ది టేల్స్ ఆఫ్ ఎ బ్లడి నవంబర్ ఫ్రంట్‌లైన్ 18 డిసెంబర్ 1997

9 ప్రవీణ్‌స్వామి 'ముంబైస్ మాఫియా వార్స్' ఫ్రంట్‌లైన్ 9 ఏప్రిల్ 1999

10 ప్రవీణ్‌స్వామి 'ది అదర్ విక్టిమ్స్ ఆఫ్ కార్గిల్ ఫ్రంట్‌లైన్ 16 జూలై 1999

11 గౌరవ్ సావంత్ 'ఇన్ ట్రబుల్డ్ టర్బుక్ ఆర్మీసీడ్స్ ఎఫర్ట్స్ టు ఛెక్‌పోస్ట్ ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 28 జూన్ 1999

12 మేనేజ్‌మెంట్ ఆఫ్ ఇంటర్నల్ కాన్‌ఫ్లిక్ట్ అంతర్గత సైనిక (సమాచార)పత్రం 1998 పేజీ 7 పేరా

13 పైదాన్లోంచే పేజీ 36 సిఫార్సు–ఇ

14 పైదాన్లోంచే పేజీలు 36 37 పేరా 8

15 ప్రవీణ్‌స్వామి 'ఛేంజింగ్ స్ట్రాటజీస్' ఫ్రంట్‌లైన్ 10 సెప్టెంబర్ 1999

VIII <u>కప్పి పుచ్చే ప్రయత్నం</u>

1 కె సుబ్రమణ్యమ్ 'అడ్వయిజ్ ఫర్ మిస్టర్ అజీజ్ ది టైమ్స్ ఆఫ్ ఇండియా 17 జూన్ 1999

2 జె ఎన్ దీక్షిత్ ఎ వైట్ వాష్ జాబ్ ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 5 ఆగస్ట్ 1999

3 'వెర్డిక్ట్ ఆన్ 3 మెంబర్ కమిటీ' ది ఆసియన్ ఏజ్ 25 జూలై 1999

4 పైదాన్లోంచే

5 'రైజింగ్ కార్గిల్ విల్ బేక్ ఫైర్ ఆన్ కాంగ్రెస్' ది ఆసియన్ ఏజ్ 25 జూలై 1999

6 జె ఎన్ దీక్షిత్ 'ఎ వైట్ వాష్ జాబ్'

7 కె సుబ్రమణ్యం, అడ్వయిజ్ ఫర్ మిస్టర్ అజీజ్'

8 కె సుబ్రమణ్యం థ్రెట్ టు గ్లోబల్ పీస్' ది టైమ్స్ ఆఫ్ ఇండియా 21 జూన్ 1999

9 పైదాన్లోంచే

10 'పాకిస్తాన్స్ నెక్స్ట్ మూవ్ ది టైమ్స్ ఆఫ్ ఇండియా 29 జూన్ 1999

11 ప్రవీణ్‌స్వామి 'అదర్ ఎంగేజిమెంట్స్' ఫ్రంట్‌లైన్ 13 ఆగస్టు 1999

12 రాజేష్‌జోషి 'శాఫ్రాన్ సాంబా ఆన్ ది ఇండస్' ఔట్‌లుక్ 9 ఆగస్టు 1999

13 కన్వర్ సాంధు,'నాట్ బై హోమిలీస్' ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 3 సెప్టెంబర్ 1999

14 రాహుల్ బేడి, 'ఆర్మీ ఆర్డర్స్ ఇన్వెస్టిగేషన్ ఇన్‌టు ఎర్లీ కార్గిల్ మిస్టేక్స్' ది ఆసియన్ ఏజ్ 20 జూలై 1999

15 రాహుల్ బేడి 'జనరల్ మాలిక్ వాంట్స్ టు బి చిఫ ఆఫ డఫెన్స్ స్టాఫ దిఆసియన్ ఎజ్ 22 జూలై 1999

16 పైదాన్లోంచే

17 ప్రవీణ్‌స్వామి నౌ ది కవరప్' ఫ్రంట్‌లైన్ 13 ఆగస్టు 1999

18 ఎ జి నూరాని ఎ డబియస్ ఎక్సర్‌సైజ్ ఫ్రంట్‌లైన్ 27 ఆగస్టు 1999 ఉటంకాలు (Quotes) తో సహా ఈ విభాగం మొత్తం నూరాని వ్యాసం ఆధారంగా రాసినదే

IX <u>కార్గిల్ వారసత్వం</u>

1 'లోకల్స్ క్లాష్ విత్ మిలిటెంట్స్ ది ట్రిబ్యూన్ 14 జూలై 1999

2 అమిత్ బారువా పాక్ ఆనర్స్ ఇట్స్ సర్వీస్‌మెన్' ది హిందు 15 ఆగస్టు 1999

3 అహ్మద్ రషీద్ 'రైజ్ ది క్రిసెంట్' ఫార్ ఈస్ట్రన్ ఎకనామిక్ రివ్యూ 3 డిసెంబర్ 1998

4 అజీజ్ అహ్మద్ ది మెనీ రోడ్స్ టు కార్గిల్' ఫ్రంట్‌లైన్ 16 జూలై 1999

5 'పాక్ మిలిటెంట్స్ దాగెస్తాన్ కార్గిల్ ఇన్‌ట్రూజన్ సిమిలర్ రష్యన్ మీడియా ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 19 ఆగస్టు 1999

6 కార్గిల్ మ్యూరల్ ఎట్ పి ఎం ఎస్ మీట్ ఇర్క్స్ అపోజిషన్ ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 22 ఆగస్టు 1999

7 సీమా ముస్తఫా ది పొలిటిసైజేషన్ ఆఫ్ కార్గిల్ ది ఆసియన్ ఎజ్ 21 ఆగస్టు 1999

8 అయిజాజ్ అహ్మద్ మీడియేషన్ బై ఎనీ అదర్ నేమ్' ఫ్రంట్‌లైన్ జులై 30 1999

9 'ఇండియన్ మీడియా సపోర్టెడ్ గవర్నమెంట్ యాక్షన్స్ కార్గిల్ ది హిందూ ఆగస్టు 15 1999

10 మహమ్మద్ ఇషాక్‌ఖాన్ సిక్స్ కంట్రీస్ ఆఫ్ ఇస్లామైజేషన్ కాశ్మీర్' ఇన్ బలరాజ్‌పురి (ఎడిషన్) 5000 ఇయర్స్ ఆఫ్ కాశ్మీర్ న్యూఢిల్లీ అజంతా పేజీ 71 1997 మే 11

11 వివరాలకు ప్రవీన్‌స్వామి ది రివైవల్ ఆఫ్ కమ్యూనిజం"